First Edition: 5000 Copies
May 1960

MEEKU AVASARAMAYINA

# NYAYA SASTRA PARICHAYAMU

(Law for the Layman)

by
G. C. VENKATA SUBBA RAO



**PRICE Rs. 2.00**

Published under the Auspices of
The Southern Languages Book Trust, Madras
Telugu - 62

Published by:
Viswavani Publishers, Vijayawada.

Printed at:
Venkata Ratna Printers, Vijayawada.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భాషా పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదంచేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధవిషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు వారుచేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తా మెంత ఋణపడివున్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వా రెన్నెన్ని పాట్లుపడినది ముందుతరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం— ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి.

విజ్ఞానవికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షించగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తారప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్యభాషలలోకి అనువదింపచేయుటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలంకాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7-10-58.

ఎ. యల్. ముదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఉపోద్ఘాతం

"నీవు మూర్ఖుడివి. లేదా నలభయ్యోపడిలో పడిన వైద్యుడివి" అనే అర్థంలో ఆంగ్లభాషలో ఒక సామెతఉంది. అసలు, జీవనయాత్రలో దాదాపు సగం గడిచేసరికి మనకు ఆరోగ్యానికి, రోగాలకు సంబంధించిన వైద్యశాస్త్ర పరిజ్ఞానం కొంత లభిస్తుందని ఈ సామెత తాత్పర్యం. అలాగే, న్యాయ శాస్త్రానికి కూడా ఈ సామెత వర్తిస్తుందనుకుంటాను. అట్టి జ్ఞానం అసమగ్రమైనది, అస్ఫుటమైనదీ కావచ్చు. కాని, ఆ వయసులో ప్రతివ్యక్తి న్యాయశాస్త్రంలో తనకు వర్తించే సూత్రాలతో తగుమాత్రపు పరిచయం స్వానుభవపూర్వకంగా సాధించిఉంటాడు. కుటుంబసంబంధమైన హక్కులను గురించి, బాధ్యతలనుగురించి కుటుంబజీవనమే మనకు పరిచయం కలిగిస్తుంది. ఆస్తిపాస్తులకు, ఒప్పందాలకు సంబంధించిన విషయాలను మన వ్యాపార వ్యవహారాలే మనకు నేర్పగలవు. కోర్టులు, నేరాలు, రాజ్యాంగసిద్ధములైన అధికారాలు మొదలైనవాటినిగురించి వార్తాపత్రికలలో చదువుతూ ఉంటాం.

ఈ పుస్తకంలో, మన జీవితాలకువర్తించే న్యాయ శాసనాలను తేటమాటలలో, అందరికీ సులభంగా బోధపడే టట్లు వివరించడానికి గ్రంథకర్త ప్రయత్నించారు. పాఠకులందరినీ న్యాయవాదులుగా తయారుచేయడం కాదు ఈ గ్రంథం లక్ష్యం. అయితే, ఈ పుస్తకం చదివినమీదట పాఠకుడు తన హక్కులను బాధ్యతలను గురించి పూర్వంకన్న చక్కగా తెలుసుకొన్నవాడై ఉంటాడు.

ఈ పుస్తకం బహుభాషలలో ప్రచురింపదగినది. ప్రతి గృహగ్రంథాలయములో ఉండవలసినది.

మద్రాసు,
11-8-1958.

కె. కృష్ణమీనన్

# ప్రవేశిక

ఇద్దరు దైనోపహతులు ఒకచోట తారసిల్లిరి. ఒకరి నొకరు తమతమ జీవితములలో వచ్చినకష్టాలకు కారణములను పరామర్శించుకొనిరి.

మొదటివాడు :-

"నేను ఎవరిసలహాను తీసికోలేదు. అదే జీవితము కుంటుపడుటకు కారణము" అని చింతించెను.

రెండవవాడు :-

"నేను అందరిసలహాలను తీసికొంటిని. అందుచేతనే పతనమైతిని," అని వాపోయెను. కనుక ఎవ్వరిసలహాను తీసికొనకపోవుట యెట్లో అందరిసలహాలను తీసికొనుటకూడ అట్లే సమానముగా హానిచేయగలదని తెలియుచున్నది. కోర్టు వ్యవహారవిషయములో ఈ సూత్రము ముఖ్యముగా వర్తించును. ఒక్క తప్పటడుగువల్ల పూర్తిగా నష్టపడి, భంగపడెడి అనకాశాలు వ్యవహారాలలో తరచుగా కన్పించును.

న్యాయశాస్త్రము తెలియనందువల్ల పొరపాటు జరిగినదనగా తీర్పరులు ఒప్పుకోరు. "న్యాయశాస్త్రము నాకు అచుంబితశాస్త్ర" మను వాదన శుష్కవాదన; చెల్లనేరదు. ఇది వ్యవహారములో ముఖ్యసూత్రము. ఈ సూత్రము ఎంత కఠినమైనదో తెలిసికొనవలెనన్న వ్యవహారరంగములో చాలా గోప్యముగా కాపాడబడుచున్న పరమరహస్యమొకటి గుర్తించుకొనవలెను.

“వ్యవహారములో నిక్కచ్చిగా చెప్పగలిగే నిశ్చయ విషయము: ‘దానిలో అంతయు అనిశ్చితమే’ అని.”

“పంకంబులోని కంబంబు పోక” యన్నాడు శ్రీనాథుడు. బురదలోని స్తంభము నెంత గ్రోసినను గ్రోయనచ్చుగదా! న్యాయశాస్త్రము నిత్యము పెరుగుచున్నది; మారుచున్నది. మన రాజ్యాంగము సాంఘికసంక్షేమమును సాధించుటకే పూనుకొన్నది. అందుచేత శాసనాలు పుంఖానుపుంఖముగా వచ్చుచున్నవి. మన శాసనసభలనుండి, ఈ శాసనాలను మన న్యాయవాదులే పూర్ణంగా తెలిసికోలేకున్నారు. ఇక సామాన్యులసంగతి చెప్పనేల! ఈ శాసనసభలకు తోడుగా ఒక సుప్రీంకోర్టు; 14 హైకోర్టులు తీర్పులపరంపరను కురిపిస్తున్నవి. ఇవన్నియు న్యాయశాస్త్రమును విస్తృతము చేయుచున్నవి. ఇటువంటి సందర్భములలో న్యాయశాస్త్రమును సాంగముగా ఆకళింపుచేసికొనుటకు అనువైన గ్రంథము చిన్నదిగా నుండుట కష్టసాధ్యము గదా!

ఈ గ్రంథము న్యాయశాస్త్రము నెల్ల సంపూర్ణముగా ప్రదర్శింపగలదని చెప్పుకొనుట సాహసమే. మన దైనందిన జీవితములో సాధారణముగా వర్తించు న్యాయశాస్త్రమును పాఠకుల దృష్టిపథమునకు తెచ్చుటయే ఈ గ్రంథము ఉద్దేశము. ఈ గ్రంథము పాఠకులకు కొంతవరకైన తమ సాధారణ వ్యవహారాలలో తమ హక్కులను సంరక్షించుకొనుచు న్యాయశాస్త్రోల్లంఘనము చేయకుండ వ్యవహరింపగల దక్షత చేకూర్చిన నా ప్రయత్నము సఫలమైనట్లు భావించెదను.

ఒక న్యాయవాది ముద్దాయిపక్షమున వాదించుచుండెను. అది కొట్టరానటువంటి అభియోగము. ముద్దాయి

ఆత్మసంరక్షణార్థముమాత్రమే కొట్టెనని న్యాయవాదివాదము. ఆత్మరక్షణమును అతిక్రమించి ప్రహరించెనని ఫిర్యాదివకీలు వాదన. జడ్జీగారు "అతిక్రమించటాన్ని, అతిక్రమించకపోవటాన్ని విభజించేహద్దు ఎక్కడ ఏర్పాటుచేయడం?" అన్నారు. దానికి ముద్దాయివకీలు "మీ యిష్టంవచ్చినచోట హద్దు ఏర్పాటుచేసుకోండి. కాని నాకక్షిదారుని ఆహద్దుకు సరియైన తట్టున పడేటట్లు చూడండి" అన్నాడట. ఈరకపు మన సత్వం చేసబబు కాదుగదా! ఈ గ్రంథ పర్యాలోకనము న్యాయ శాస్త్రము ఏర్పాటుచేసిన హద్దులకు సరియైనవైపుననే మనలను ఉంచుటకు తోడ్పడిన యెడల అంతే నాకు కావలసినది.

గొట్టిపాటి సుబ్బారావు

# విషయానుక్రమణిక

## మొదటిభాగము - భారతరాజ్యాంగవ్యవస్థ



## రెండవభాగము - కుటుంబవ్యవహారము

## మూడవభాగము-ఆస్తులు, అన్యాక్రాంతములు

## నాలుగవభాగము : ఖరారు లేక ఒడంబడిక



## ఐదవభాగము : దండశాస్త్రము

## ఆరవభాగము: ప్రక్రియాకాండము

## ఏడవభాగము: దండప్రక్రియలు

నేరములు – శిక్షలు పట్టిక

# న్యాయశాస్త్ర పరిచయము

## మొదటిభాగము

## భారత రాజ్యాంగవ్యవస్థ

### ఉపక్రమణిక

భారతమాత :-

పండిత జవహర్‌లాల్ నెహ్రూ మహాశయుడు తన యుద్గ్రంథమగు "భారత దర్శనము"లో ఒక సంఘటనను హృదయంగమముగా వర్ణించెను. ఆ సంఘటనవల్ల దేశమనగా ఏమో సుస్పష్టమగును. మన జాతీయనాయకుడగు నెహ్రూకు జాట్ కర్షకులు పలుచోట్ల ఘనస్వాగతమొసగిరి. వారందరు "భారతమాతకు జై! భారతమాతకు జై!" అని జయఘోష చేసిరి. అప్పుడు నెహ్రూజీ "మీరు జేకొట్టు చున్న ఆ భారతమాత యెవ్వరు?" అని ప్రశ్నించెను. ఒక జాట్ యువకుడు "భారతమాత అంటే మన ధాత్రి; మన భూమాత!" అనెను. "మన భూమాత అంటే మీ గ్రామంలో భూమియా, అన్ని జిల్లాలలోనిదా, దేశమంతటిలోనిదా?" అని నెహ్రూపండితుడు మరల ప్రశ్నించెను. ఈవిధముగా ప్రశ్నోత్తరాలు కొంతసేపు సాగగా, ప్రజలు "నెహ్రూజీ! భారతమాతఅంటే యేమిటో మీరే మాకు చెప్పండి," అని ప్రార్థించిరి. "మీరందరూ భారతమాతలో భాగాలే.

మీలో ప్రతిఒక్కరూ భారతమాతలో ఒకభాగం. 33 కోట్ల భారతీయులూ ఈ భారతమాతస్వరూపం. ఈ జనులే మన భారతమాత !" ఈ వివరణలో మన అప్పరాయకవి చెప్పిన "దేశమంటే మట్టి కాదోయ్! దేశమంటే మనుషులోయ్" అను భావము ప్రస్ఫుటముగా కనబడుచున్నది. దేశమనగా ఒక భూఖండముమాత్రమే కాదు. ఒకప్రభుత్వమును ఏర్పాటు చేసికొనిన ప్రజానీకమే దేశము.

1947 వ సంవత్సరము ఆగస్టు 15వ తేదీ మన భారత దేశచరిత్రలో పర్వదినము. ఆరోజున మన దేశము స్వతంత్ర దేశమాయెను. తర్వాత రాజ్యాంగపరిషత్ ఏర్పాటు జరిగెను. డాక్టరు రాజేంద్రప్రసాదు మహాశయుడు, ఆ పరిషత్తునకు అధ్యక్షుడుగా ఉండెను. నూతన రాజ్యాంగసృష్టి జరిగి 1950 జనవరి 26 తేదీనుండి మన దేశము ప్రజాసత్తాకముగా నేర్పడెను. ఈ నూతనరాజ్యాంగము ధర్మమును సుస్థాపితము చేయ నుద్దేశించినది. దీని ముఖ్యాంశములు మాత్రము ఇక్కడ ప్రస్తావింపబడును.

## 1. శాసననిర్మాణాధికారము

వివిధ దేశాలలో శాసననిర్మాణసభలు :-

శాసననిర్మాణాధికారముగల సభను శాసనసభ యందురు. దేశానికంతటికి ఒకేఒక శాసనసభఉన్న దేశాలు గలవు. అట్టిదేశాలు కేంద్రైకదేశాలని పేర్కొనబడును. భారతదేశము అటువంటిదేశము కాదు. ఇది కొన్ని రాష్ట్రి

ముల కూటమి. భారతకూటమిలో 14 కూటస్థ రాష్ట్రములు కలవు. (కూటప్రదేశాలు అను కొంతభాగము విడిగాగలదు) ఈ కూటస్థరాజ్యాలకు ఒక్కొక్కదానికి ప్రత్యేకమైన శాసన సభ కలదు. కొన్నిటియందు శాసనసభలు రెండువిభాగములు కల్గియున్నవి. దిగువసభ (విధానసభ లేక ప్రజలసభ), ఎగువ సభ (శిష్టసభ) అని. దిగువసభ ఎన్నుకొన్నప్పటినుండి 5 సంవత్సరముల కాలము వ్యవహరించును. ఎన్నికల సౌకర్యార్థము కూటస్థరాష్ట్రమును కొన్ని భాగములుగా విభజించుదురు. ఒక్కొక్క రాష్ట్రములోని ప్రజలు తమప్రతినిధులను దిగువ సభకు పంపుదురు. ఎగువసభకు 1/3వంతుల ప్రతినిధులను మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు ఎన్నుకొనును. 1/3 వంతులు దిగువ సభలో ఎన్నికైన ప్రతినిధులు ఇతరులనుండి (ప్రతినిధులుకాని వారినుండి) ఎన్నుకొందురు. 1/12వవంతు పట్టభద్రులచే ఎన్నుకొనబడును. 1/12 వవంతిని ఉపాధ్యాయులు ఎన్నుకొందురు. తక్కిన వారిని గవర్నరు నియమించును. రెండుసంవత్సరముల కొకసారి యీ ఎగువసభలోని 1/3 వంతులవారు తొలగుదురు. వారిస్థానములలో క్రొత్తవారు ఎన్నికౌదురు.

కేంద్ర శాసనసభ (పార్లమెంటు) :-

ఒక్కొక్క కూటస్థరాష్ట్రసభచే చేయబడిన శాసనములు ఆ రాష్ట్రమునకే వర్తించును. యావద్భారతానికి వర్తించు శాసనములు నిర్మింపగలసభ కూటమికి కలదు. దీనికి మహాజనసభ (పార్లమెంటు) అని పేరు. ఈ సభ రెండు భాగములు. 1. లోక్‌సభ, 2. రాజ్యసభ. లోక్‌సభ 5 సంవ

వత్సరములు పనిచేయుటకు ఎన్నికఅగును. దీనిలోని సభ్యులు (అ) 500 మందికి మించకుండ దేశములోని వివిధప్రాంతముల నుండి యెన్నికైనవారు. (ఆ) 20 మందికిమించకుండ కేంద్రపాలిత ప్రదేశాలనుండి ఎన్నుకోబడినవారు.

రాజ్యసభయందు 250మంది ప్రతినిధులు ఉందురు. ఇందులో 238 మంది కూటస్థరాష్ట్రాలలోని దిగువసభల కెన్నికైన సభ్యులచే ఎన్నుకొనబడుదురు. 12 మందిని అధ్యక్షుడు నియమించును. ఈ సభలో 1/3 మంది 2 సంవత్సరముల కొకమారు తొలగుచుందురు. అంతేకాని, రాజ్యసభ అంతయు ఒకేమారు ఎప్పుడును రద్దుకాదు.

శాసననిర్మాణపు అధికారాలపంపిణీ :-

కూటమి శాసనసభకు, కూటస్థరాష్ట్ర శాసనసభలకు శాసననిర్మాణాధికారము విభజింపబడినది. కొన్ని విషయాలలో కూటమి శాసనసభయే శాసనములను చేయగలదు. ఉదాహరణ : దేశరక్షణ; విదేశాంగనీతి; రైల్వేలు; తపాల; తంతి; ద్రవ్యపునాణెములు మొదలైనవి. ఇవన్నియును భారతదేశముఅంతటి సంక్షేమానికి సంబంధించినవి. కొన్ని విషయాలలో కూటస్థ రాష్ట్రసభలుమాత్రమే శాసన నిర్మాణపుహక్కు గల్గియున్నవి : ఉ॥ పోలీసు; ప్రజారోగ్యం; హాస్పిటళ్ళు, యూనివర్సిటీలు; రాష్ట్రస్వపరిపాలన; కో-ఆపరేటివ్ సొసైటీలు; భూములపై రైతుహక్కులు మొదలగునవి. కొన్నివిషయాలలో కూటమి, కూటస్థ రాష్ట్ర శాసనసభలు రెండునూ శాసననిర్మాణము చేయవచ్చును. ఉ॥

వివాహము; వివాహవిచ్ఛేదము; ఫాక్టరీలు; సివిల్, క్రిమినల్ వ్యవహారకాండ మొదలగునవి.

శాసననిర్మాణ పద్ధతి: పార్లమెంటులో శాసననిర్మాణపద్ధతి:-

పన్నులువిధించే బిల్లులను, పన్నులనుండివచ్చిన ద్రవ్యమును వినియోగించు ప్రయోజనములుగల బిల్లులను 'మనీ బిల్లు' లందురు. వీనిని లోక్‌సభలోనే తేవలెను. రాష్ట్రపతి అనుమతితోనే వానిని ప్రవేశపెట్టవలెను. రాజ్యసభకు ఇటువంటిబిల్లును నిరాకరించుహక్కు లేదు. మార్పులు సూచింపవచ్చును గాని, లోక్‌సభ అట్టిసూచనలను తిరస్కరింపవచ్చును. ఇతరబిల్లులు ఏసభలోనైనను ప్రతిపాదింపబడవచ్చును. ఎగువ, దిగువసభలలో అంగీకరింపబడినబిల్లు, ప్రెసిడెంటు ఆమోదింపగానే న్యాయశాసనమగును. కేంద్రిమంత్రుల సలహాపై ప్రెసిడెంటు ఆమోదింపక నిరాకరింపవచ్చును! మనీబిల్లులు కానివానిని పునఃపరిశీలనచేయవలెనని పార్లమెంటును నాపసుచేయవచ్చును. పునఃపరిశీలనపై తిరిగి ఆ బిల్లును పార్లమెంటు అంగీకరించినచో, రాష్ట్రపతి తన ఆమోదముద్ర తప్పక వేయువలసియుండును.

కూటస్థ రాజ్య శాసనసభలకుకూడ పైనజెప్పినపద్ధతియే చాలావరకు వర్తించును. ఇచటి బిల్లులకు గవర్నరుఅంగీకారమును తీసికొందురు. కొన్నిబిల్లులను గవర్నరు రాష్ట్రపతి పరిశీలనకు పంపవచ్చును. కేంద్రములో, క్రిందిసభలో ఆమోదింపబడి ఎగువసభలో ఆమోదింపబడని బిల్లులను రెండుసభల సంయుక్తసమావేశములో తీర్మానింతురు. కూటస్థ

రాష్ట్ర శాసనసభలలో మాత్రము ఈ పద్ధతి లేదు. క్రిందిసభలో రెండవసారి ఆమోదింపబడినచో ఎగువసభలో నాగల ప్రసక్తి యము లేకుండానే గవర్నరుగారి ఆమోదమునకై బిల్లును పంపవచ్చును.

ఎగువ దిగువసభల పోలికలు: ఎగువ,దిగువసభల అధికారములనుగూర్చి పైన చెప్పబడినదానినిబట్టి దిగువసభ ఎగువసభ వైరుధ్యమును లక్ష్యముచేయవలసినపనిలేదని తేలుచున్నది. నిజమైన ప్రజాస్వామ్యములో ఇట్లే యుండవలెను. దిగువసభలోనే ప్రజాబాహుళ్యముచే ఎన్నుకొనబడిన ప్రతినిధులుందురు. అందుచే దిగువసభ అభిప్రాయమే చివరకు నెగ్గవలసియుండును.

"ఎగువసభ క్రిందిసభతో ఏకీభవింపనిచో అది దుష్టము, క్రిందిసభతో ఏకీభవించిన అది అనవసరము"—అని ఆచీసియీజ్ అను ఫ్రెంచిరాజకీయవేత్త అభిప్రాయము. భారత దేశములోకూడ ఎగువసభలను రద్దుచేయవలెనని కొందరు అభిప్రాయపడుచున్నారు.

జార్జి వాషింగ్టన్‌కు సంబంధించిన గాథ :—

అమెరికకాలో రాజ్యాంగమును ఏర్పాటుచేసికొనునప్పుడు ఎగువసభ ఉండవలెనా లేదా అను మీమాంస బయలుదేరెను. రాజ్యాంగసభలో ఈ సమస్యపై తీవ్రమైన వాదోపవాదములు జరిగెను. రాజ్యాంగ సభాధ్యక్షుడైన వాషింగ్టన్ ఈ సమస్యాపరిష్కారములో తన సహజ చాతుర్యమును చూపెను. తేనీరు (టీ) తెమ్మని పరిచారకుల

కాజ్ఞాపించెను. వేడివేడి తేనీరు ఒక లోటాలో పోసి, పళ్ళెర ములో పెట్టి తెచ్చిరి. వాషింగ్టన్ ఆ వేడితేనీరు త్రాగగా నాలుక చుఱ్ఱుమనెను. అప్పుడు ఆ వేడిపానీయమును పళ్ళెగ ములో పోసి నింపాదిగా ఆస్వాదించెను. రాజ్యాంగసభలోని సభ్యులను తిలకించుచు వాషింగ్టన్ ఇట్లు ప్రసంగించెను. "క్రిందిసభ వేడితేనీరువంటిది. ఎగువసభ పళ్ళెమువలె పని జేసి వేడిని చల్లార్చును." రాజ్యాంగసభ దీనిఅంతరార్థమును ఆకళించుకొని, ఎగువసభకూడ అవసరమని తీర్మానించెను. దిగువసభలోని ప్రతినిధులు తాము ఎన్నికలయందు ప్రజల కిచ్చిన హామీలను చెల్లించు ఆదుర్దాతో శాసనములను కొంత తొందరపాటుతో నిర్మించుటకు ఉబలాటపడుట సహ జము. కొంత కాలహరణముకానిది, యీ తొందరపాటు సద్దుకొనదు. ఎగువసభ పునరాలోచనకు అవకాశము నొసం గును. శాసనమునకు కావలసినసవరణలు ప్రతిపాదించుటకు వీలుకలుగజేయును. ఎగువసభలు నిల్చియుండుటకు ఇదే ముఖ్యమైన కారణము.

## రాష్ట్రశాసనసభలు

| రాష్ట్రముపేరు | విధానసభ లోనిసభ్యుల సంఖ్య | శిష్టసభ లోనిసభ్యుల సంఖ్య | లోక్‌సభ లోనిసభ్యుల సంఖ్య | రాజ్యసభ లోనిసభ్యుల సంఖ్య |
|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 301 | 90 | 43 | 18 |
| అస్సామ్ | 108 | | 12 | 7 |
| బీహార్ | 318 | 96 | 53 | 22 |

| | | | | |
|---|---|---|---|---|
| బొంబాయి | 396 | 108 | 66 | 27 |
| కేరళ | 126 | | 18 | 9 |
| మధ్యప్రదేశ్ | 228 | 90 | 36 | 16 |
| మద్రాసు | 205 | 63 | 41 | 17 |
| మైసూరు | 208 | 63 | 26 | 12 |
| ఒరిస్సా | 140 | | 20 | 10 |
| పంజాబు | 154 | 51 | 22 | 11 |
| రాజస్థాన్ | 176 | | 22 | 10 |
| ఉత్తరప్రదేశ్ | 430 | 108 | 86 | 34 |
| పశ్చిమబెంగాల్ | 252 | 75 | 36 | 16 |
| జమ్మూ; కాశ్మీరము | | | 6 | 4 |

## 2. ప్రాతిపదిక (లేక మౌలిక) హక్కులు

శాసననిర్మాణాధికారముపై ఆంక్షలు :-

శాసననిర్మాణ అధికారము రాజ్యాంగముచే ప్రసాదింపబడిన ప్రాతిపదికహక్కులకు లోబడియున్నది. ఈ మౌలికహక్కులకు భంగముకలుగజేయు శాసనములు చెల్లనేరవు. ఈ హక్కులు ఏవనగా :

(1) సమానత్వము :-

న్యాయశాస్త్రదృష్టిలో అందరూ సమమే. పాక్షికమైనచట్టములు చేయరాదు. శాసనసభలు ప్రభుత్వోద్యోగులకు నిరంకుశాధికారమును దత్తముచేయుచట్టాలు చేయ

రాదు. అటువంటి చట్టాలు అధికారులకు పాక్షికముగా ప్రవర్తింపజేయు అవకాశము కలుగజేసి, రాజ్యాంగముచే హామీయివ్వబడిన సమానత్వమును ఉల్లంఘించును. ఆడు వారికి, పసివాండ్రకు మాత్రము ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయుట ఈ సమానత్వమునకు భంగముకాదు. ప్రభుత్వోద్యోగాలు పొందుటకు అందరికి సమానముగు అవకాశము ఏర్పాటుచేయబడెను. వెనుకబడినతరగతివారికి ప్రభుత్వోద్యోగాలు ప్రత్యేకింపవచ్చును. అస్పృశ్యతను పాటింపరాదు. యోధాతిశయ, విద్యాతిశయ సూచక గౌరవములను దప్ప బిరుదప్రదానము ప్రభుత్వముచే చేయబడరాదు. ఈ వివిధ విధాల సమానత్వము రాజ్యాంగముచే సాధింపబడినది.

(2) స్వాతంత్ర్యము :-

వాక్స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము, సంఘసంస్థాపనస్వాతంత్ర్యము, యావద్భారతదేశములో సంచరించుటకు, అందుచ్చటనయిన స్థిరనివాసమేర్పరచుకొనుటకు స్వాతంత్ర్యము; వృత్తిస్వాతంత్ర్యము – ఈ వివిధ స్వాతంత్ర్యాలు ప్రతిపౌరునికి ఇవ్వబడినవి. ఈ హక్కులను న్యాయమైన, సబబైన నిబంధనలచే శాసనసభలు అవరోధింపవచ్చును. ప్రభుత్వముచే ఏర్పాటుచేయబడిన ఏకస్వతంత్ర వ్యాపారసంస్థలచేగాని, సాంకేతిక యోగ్యతానిర్ణయముచే గాని వృత్తిస్వాతంత్ర్యమును భంగపఱుపవచ్చును. వాక్స్వాతంత్ర్యము పరువునష్టముననుసంబంధించిన, న్యాయస్థాన నిరసనకుసంబంధించిన నిబంధనలకు లోబడియుండవలెను. నేరము ఆరోపణచేయబడినపుడు ముద్దాయిని తనకువ్యతిరేకించు

సాక్ష్యమిమ్మని నిర్బంధింపరాదు. ఒకసారి అభియోగము తేబడి శిక్షింపబడినవానిని అదే అపరాధమునకు మరల విచారణజరుపరాదు. ఒకరుచేసినపని చట్టమునుబట్టి నేరము కానిచో, తర్వాత అమలులోనికివచ్చిన చట్టముక్రింద అతనిని దండింపరాదు. వ్యక్తిస్వాతంత్ర్యము న్యాయశాసనమును ననుసరించి ఏర్పరుపబడిన పద్ధతిలోతప్ప అరికట్టరాదు. అటువంటి న్యాయశాసనములు కొన్ని రక్షణలను పొందుపరుపవలెను. ఆ రక్షణలు ఏవనగా : (I) బంధీకృతుడయిన వానికి అతనిని నిర్బంధములోపెట్టుటకుగల కారణాలు తెల్పకుండ చెరలో వుంచరాదు. (II) 24 గంటలలో అత్యంతసమీపములోనున్న దండనాధికారియెదుట బంధితుని హాజరుపెట్టవలెను. (III) వకీలుచే ప్రతివాదనచేసికొను అవకాశము బంధితునికి నిరాకరింపరాదు. అనర్థనివారకనిరోధములో ఉంచబడినవారికి ఈ రక్షణలు వర్తింపవు. దేశమునకు అనర్థదాయకమైన పనులు చేయునేమోఅన్న అనుమానముపై న్యాయస్థానములో అభియోగము తేకుండానే కారాగారములో ఉంచుట నామోదించు చట్టము నివారకనిరోధశాసనము. అటువంటిచట్టము నివారకనిర్బంధావశ్యకత పరిశీలించుటకొక సలహాసంఘమును ఏర్పాటుచేయవలెను. ఈ సంఘము ఆమోదముద్రలేకుండ మూడు నెలలకుమించి నివారక నిరోధములో ఎవనిని ఉంచరాదు. నివారకనిర్బంధములోవుంచుట గర్హ్యమే. కాని మన దేశస్వాతంత్ర్యం స్థిరముగా నిల్చుదాక అటువంటి చట్టాలు అవసరమయినవి. నివారక నిర్బంధ శాసనము 31-12-1960 దాక వర్తించును.

(3) పరపీడన నిష్కృతి :-

మనుష్యులను అమ్ముట, కొనుట; వారిచే నిర్బంధముగా పనిచేయించుటయు నిషిద్ధము. 14 సంవత్సరములు నిండని పసివారిని కర్మాగారములలోను, గనులలోను, ఇతర ప్రమాదభరితమగు పనులలోను నియోగింపరాదు.

(4) మతస్వాతంత్ర్యము :-

ఏ మతమునైనను శాసోక్తముగా అభ్యసించుటకు, బోధించుటకు, ప్రచారము చేయుటకు ప్రతివానికి స్వాతంత్ర్యము కలదు. ప్రతి మతశాఖ తన కనువయిన వ్యవస్థలను మతవిషయక ధర్మాది కార్యకలాపాలకు ఏర్పాటుచేసికొనవచ్చును. ప్రత్యేక మతశాఖల మనుగడకోసము సుంకాలను విధింపరాదు. ఈవిధముగా భారతదేశము మతాన్వితరాజ్యము కాకుండ లౌకికోపయోగాలు చూచుకొనే రాజ్యముగా రూపొందినది.

(5) సాంస్కృతిక వైజ్ఞానిక స్వాతంత్ర్యములు :-

ప్రభుత్వముచే పోషింపబడుచున్న లేక ప్రభుత్వ సహాయముపొందుచున్న విద్యాసంస్థలు మత, జాతి, కుల, భాషలు కారణముగా లేక వీనియం దేదొకటిగాని కారణముగా ఏ పౌరునికిని ప్రవేశము నిరాకరింపరాదు. విద్యలో వెనుకబడినవర్గాలకు, షెడ్యూల్డుకులాలకు, షెడ్యూల్డుజాతులకు మాత్రము కొన్ని స్థానాలు ప్రత్యేకించవచ్చును. అల్పసంఖ్యాకవర్గాలవారు ప్రత్యేకముగా విద్యాసంస్థలను ఏర్పాటుచేసికొని తమ సంస్కృతిని సంరక్షించుకొనవచ్చును. అట్టి

వర్గాల యాజమాన్యమునఉన్న విద్యాసంస్థలను ప్రభుత్వము ధనసహాయవిషయములో ఇతర సంస్థలకన్న భిన్నదృష్టితో చూడరాదు. ఈ విధముగా భారతరాజ్యాంగము మత విషయములోను, భాషావిషయములోను, అల్పసంఖ్యాక వర్గాలకు తగు రక్షణ కలుగజేసినది.

(6) ఆస్తిహక్కులు :-

ఆస్తిహక్కులను చట్టము లేకుండా ప్రభుత్వము తీసికొనరాదు. చట్టముకూడ ప్రజోపయోగార్థముగప్ప నిర్బంధముగా ఏ ఆస్తులను ప్రభుత్వము సొంతముచేసికొనుటను ఉపయోగార్థము స్వాధీనంచేసుకొనుటను అనుమతింపరాదు. ఆస్తిని ప్రభుత్వపరముచేయుటకుగాని, ప్రభుత్వముయొక్క సొంతసంస్థ లేక వశములోఉన్న సంస్థపరముచేయుటకుగాని సంకల్పించు చట్టము ఆస్తికి ప్రతిఫలమును ఆస్తినికోల్పోవుపౌరునికి ఇప్పించవలసియుండును. ప్రతిఫలము ఎంత యివ్వవలెనో నిర్ణయించుటకు శాసనసభకు సంపూర్ణమైనహక్కు గలదు. ప్రతిఫలము తక్కువగాఉన్నదని కోర్టులో వాదించుటకు వీలులేదు. ప్రారంభదశలో రాజ్యాంగం ఇంతకంటె ఎక్కువ రక్షణ ఆస్తిహక్కులను ఇచ్చియుండెను. కాని, సామ్యవాదమునకు అనుగుణమైన సంఘసంక్షేమరాజ్యమును ఏర్పాటుచేయుటకై జరిగిన సవరణలచే ఈ హక్కులు చాలవరకు నిర్వీర్యముచేయబడినవి.

(7) రాజ్యాంగసిద్ధ పరిహారాలు :-

మూలాధారస్వత్వములను న్యాయస్థానములలో స్థాపించుకొనుహక్కు కూడ ఒక ప్రాతిపదికహక్కే. ఈ హక్కులరక్షణార్థము హైకోర్టునకు, సుప్రీంకోర్టునకు రిట్ (ఆజ్ఞ)లను జారీచేయు అధికారము గలదు. హెబియస్ కార్పస్ అను రిట్‌వలన అక్రమముగా నిర్బంధములో పెట్టబడినవారిని నిర్బంధములోనుండి విడుదలచేయవచ్చును. 'కోవారంటో' (ఏ అధికారమువలన ?) అను రిట్‌వలన ప్రభుత్వోద్యోగి ఎవరైన తనకులేనిఅధికారము ఆరోపించుకొని చెలాయించిన, దానిని అరికట్టవచ్చును. 'మాండమస్' (మేము శాసించుచున్నాము) అను రిట్‌వలన చట్టనిర్ణీతవిధులను నెరవేర్చని ప్రభుత్వోద్యోగులను ఆ విధులను నెరవేర్చునట్లు చేయవచ్చును. 'ప్రొహిబిషన్' అను రిట్‌వలన న్యాయవిచారణాధికారముగలవారిని తమకుగల అధికారమును మీరకుండ అరికట్టవచ్చును. 'సర్టియురారి' అను రిట్‌వలన విచారణతీర్పరికాగితములను తెప్పించి, అందు దోషమున్నచో ఆ విచారణ వర్తనలను త్రోసివేసి పునర్విచారణ చేయింపవచ్చును. ప్రాతిపదికహక్కుల సంరక్షణార్థము ఈ రిట్లకొరకు ఒకే మారు సుప్రీముకోర్టుకే పోవచ్చును. క్రిందికోర్టులతీర్పు తర్వాతనే సుప్రీంకోర్టుకు పోవలెనను నిబంధనలేదు. పైగా ఈ రిట్లు ఎక్కువ వ్యయములేకుండానే త్వరితముగా న్యాయము నొందుటకు అనుకూలముగా ఉన్నవి. కనుక ఈ రిట్లు ప్రధానస్వాతంత్ర్యములను కాపాడుకొనుటకు చాల ఉపకరించుచు జనరంజకముగ నున్నవి.

## 3. పరిపాలనాధికారము

శాసనసభచే నిర్మించబడిన శాసనములను ప్రభుత్వము అమలుజరుపవలసియున్నది. రాష్ట్రములో శాంతిభద్రతలు నెలకొల్పవలసియున్నది. ఈ పనులన్నీ నెరవేర్చునది కార్యాంగశాఖ.

రాష్ట్రపతి; ఉపరాష్ట్రపతి; గవర్నర్లు:-

రాజ్యాంగ కూటమియొక్క పరిపాలనాధికారము రాష్ట్రపతికి గలదు. కూటమిలోని ఒక్కొక్క రాష్ట్ర పరిపాలనాధికారము ఆ రాష్ట్ర గవర్నరును చెందియుండును. రాష్ట్రపతి 5 సంవత్సరముల కొక్కమారు ఎన్నుకొనబడును. ఒకమారు ఎన్నికయినవ్యక్తి తిరిగి ఎన్నికకు నిలువవచ్చును. గవర్నరు రాష్ట్రపతిఅనుగ్రహమున్నంతవరకు పదవిలో 5 సంవత్సరములకాలము ఉండును. రాష్ట్రపతి జీతము నెలకు రూ. 10,000 లు. గవర్నరు జీతము రూ. 5,500 లు. రాష్ట్రపతిస్థానము రాజీనామా మొదలైన కారణములచే ఖాళీఅయినచో క్రొత్తరాష్ట్రపతి ఎన్నిక అగుదాక ఉపరాష్ట్రపతి ఆ స్థానములో పనిచేయును. ఉపరాష్ట్రపతి రాజ్యసభకు అగ్రాసనాధిపతిగా ఉండును.

రాష్ట్రపతిని ఎన్నుకొనువారు లోక్‌సభకు రాజ్యసభకు ఎన్నికైనసభ్యులు, వివిధరాష్ట్రముల విధానమండలులకు ఎన్నికైనసభ్యులు. ఉపరాష్ట్రపతిని లోక్‌సభ, రాజ్యసభలసభ్యులు ఎన్నుకొనెదరు.

మంత్రిమండలి, కార్యవర్గము :-

రాష్ట్రపతి, గవర్నర్లు అలంకారప్రాయముగా పరిపాలనాధికారముగలవారు. నిజమైన పరిపాలనాధికారము మంత్రిమండలికి గలదు. ఈ మంత్రులు విధానసభకు జవాబుదారీకల్గియుందురు. కేంద్రములో రాష్ట్రపతి ముఖ్యమంత్రిని నియమించును. ముఖ్యమంత్రిసలహాతో రాష్ట్రపతి మిగిలిన మంత్రులను నియమించును. ఒక్కొక్క రాష్ట్రములో ముఖ్యమంత్రిని గవర్నరు నియమించును. తక్కినమంత్రులను అతని సలహాపై నియమించును. రాష్ట్రకూటములో మంత్రి మండలి రాష్ట్రపతి అనుగ్రహమున్నంతవరకును, ఒక్కొక్క రాష్ట్రములోని మంత్రిమండలి అక్కడి గవర్నరు అనుగ్రహమున్నంతవరకు పరిపాలించును. సాంప్రదాయికమైన ఒప్పందాలవల్ల మంత్రిమండలి శాసనసభయొక్క విశ్వాసము ఉన్నంతవరకు పదవిలో నుండును. ప్రతి మంత్రి పదవీస్వీకరణ వేళ శాసనసభ్యుడై యుండవలెను. లేక 6 నెలలలోగా సభ్యుడుగావలెను. అట్లుకానిచో మంత్రిపదవినుండి తొలగవలెను. కేంద్రములో ప్రధానమంత్రి శాసనసభలో అధిక సంఖ్యగల రాజకీయ పక్షమునకు నాయకుడుగా నుండును. అట్లే ప్రతిరాష్ట్రములోని ముఖ్యమంత్రి అక్కడి శాసనసభలోని ప్రబల రాజకీయపక్షమునకు నాయకుడుగానుండును. సాంప్రదాయికమైన ఒప్పందములవలన, రాష్ట్రపతి, గవర్నర్లు తమ మంత్రిమండలుల సలహాతోనే పరిపాలన సాగింతురు.

నిజమైన ప్రజాస్వామ్యము :-

కార్యాంగశాఖ భారతదేశములో శాసనసభకు జవాబు దారి కలిగియుండును. శాసనసభ వయోజనుల సార్వత్రిక హక్కుతో ఎన్నిక అయినది. కనుక భారతదేశములో ప్రజా స్వామ్యము సిద్ధించినది. రాజ్యాంగము అవతారికలో భారత దేశము ప్రజాప్రభుత్వ దేశముగా వర్ణింపబడినది.

ప్రజాప్రభుత్వము అనగా ?

ఈజిప్టు దేశపు పాషా (రాజు) ఒకమారు ఫ్రెంచి రాయబారిని "ప్రజాప్రభుత్వం అంటే ఏమిటి?" అని ప్రశ్నించెను. ఆ రాయబారి దానికి ఈక్రిందివిధముగా జవాబు చెప్పెను: "ఈజిప్టు ప్రజాప్రభుత్వం అయితే మీరు (పాషా గారు) ప్రజలస్థితిలోను, ప్రజలు పాషాస్థితిలోను ఉంటారు." ఇది విని "అట్లాఅయితే, నాకు ప్రజాప్రభుత్వం అక్కర్లేదు" అని పాషాగారు సిద్ధాంతీకరించిరి. ఇండియాలో ఇప్పుడు ప్రజలే పాషాస్థానమును ఆక్రమించినారు. శాసననిర్మాణము చేయుటకు, వానిని రద్దుచేయుటకును, అధికారము ప్రజాప్రతి నిధులదే. ఇదే ప్రజాప్రభుత్వము.

## 4. న్యాయవిచారణశాఖ

సుప్రీముకోర్టు ఆవశ్యకత :-

మన రాజ్యాంగము న్యాయశాసన నిర్మాణాధికార మును కేంద్రమునకు, రాజ్యాలకు పంపిణీ చేసినది. ఈ పంపిణీ న్యాయస్థాన విచారణానుకూలమైనది. శాసనసభచే నిర్మింప

బడిన చట్టాలు రాజ్యాంగముచే సభకు దత్తమయిన అధికార పరిధిలో లేనివో, ఆ శాసనము చెల్లనేరదని తీర్మానించు హక్కు న్యాయస్థానమునకు గలదు. రాజ్యాంగమును వ్యాఖ్యానించి, ఇటువంటి విషయాలు సిద్ధాంతీకరించు తుది హక్కుగల కోర్టుఒకటి ఉండవలెను. అదే సుప్రీముకోర్టు. ఇదిగాక ప్రతిరాష్ట్రములో ఒక హైకోర్టు గలదు. మొత్తము 14 హైకోర్టులున్నవి. వీనిఅధికారములు వ్యవహారకాండకు సంబంధించిన అధ్యాయములో వివరింపబడును.

# రెండవభాగము

## 1. కుటుంబవ్యవహారము

మతమునుబట్టి కుటుంబవ్యవహార నిర్ణయము:-

ఆంగ్లేయులు మన దేశమును పరిపాలించినప్పుడు, మతవిషయములతో జోక్యములేనట్టి చట్టములను మాత్రము చేయుచుండిరి. ప్రజల మతములకు సంబంధించిన విషయములలో ప్రమేయము కల్పించుకొనరైరి. హిందూ మహమ్మదీయ న్యాయశాస్త్రములలో వివాహము, వారసత్వము మతానికి సన్నిహితసంబంధముకలవి. కనుక, 1781 లోనే బ్రిటిషు పార్లమెంటు హిందువులను, మహమ్మదీయులను వారివారి న్యాయశాస్త్రములే ఈ విషయములలో వర్తించునట్లు చట్టముల నేర్పాటుచేసిరి. ఈవిధముగ హిందూ మహమ్మదీయ న్యాయశాస్త్రములు కొంతవరకు నిలిచినవి. క్రైస్తవులకు 1865 లో ఇండియన్ వారసత్వపు చట్టమువలనను, 1872లో క్రైస్తవ వివాహచట్టమువల్లనూ వారసత్వ, వైవాహికములకు సంబంధించిన న్యాయశాస్త్రము క్రోడీకరింప బడెను.

భరతఖండములో నివసించు అందరికి సర్వసాధారణముగా వర్తించు ధర్మశాసన క్రోడీకరణ జరుగవలెనని భారత నూతన రాజ్యాంగములో ఒక రాజనీతిశాస్త్రాత్మక నియంత్రణ సూత్రము కలదు. దీని అంతరార్థము ఏమనగా, హిందువులకును; మహమ్మదీయులకును, క్రైస్తవులకును వైవాహిక

వారసత్వాది విషయములలో విభిన్నమైన న్యాయశాసనములు కాకుండ, అందరికి ఒకేరీతిని వర్తించెడి ఏకైక శాసనము ఉండవలెనని. ఇది చాలా ఉదాత్తమైన ఆశయము. దీనిని సార్థకముచేయగల్గినచో పండిత నెహ్రూ తరచుగా ఉద్ఘాటించెడి భావైక్యము కల్గుటకు దోహదముచేసినట్లే. ఈ ఆశయము ఇంతవరకు నెరవేరలేదు. ప్రస్తుతము హిందూ, మహమ్మదీయ, క్రైస్తవాది మతావలంబకులకు విడివిడిగా కుటుంబమునకు సంబంధించిన న్యాయశాస్త్రము కలదు. ఈ న్యాయశాస్త్రభాగమును సూక్ష్మముగ ఇక్కడ చర్చింతము:

## హైందవులెవరు ?

“హీనత్వం దూషయత్యేవం హిందుః; హిందూ రితి ఈ రితః” హీనత్వమును అనగా నీచత్వమును ద్వేషించు వాడు హైందవుడు. హిందూమతమునకనుబంధముగానుండు సిద్ధాంతములలో ముఖ్యమగునవి (1) బ్రహ్మ సత్యం: భగవంతుడు నిత్యుడు. (2) ‘జగత్ మిథ్యా’: ప్రపంచము మాయ. (3) జీవుడు నాశనాంతరము పునర్జన్మమునొందును. (4) పూర్వజన్మకృతకర్మమును జీవుడు పునర్జన్మమునందు అనుభవించును. (5) పరోపకారమువలన పుణ్యము సిద్ధించును • (6) పరపీడనము పాపము నిచ్చును*

• శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిషు
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః ॥ (శంకరః)

* శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిషు
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్ (కాళిదాసః)

ఈక్రింద ఉదహరింపబడినవారు హైందవులు :—

(I) హిందువులయినతల్లిదండ్రులకు జన్మించినసంతానము.

(II) తల్లిగాని, తండ్రిగాని హిందువునై, అట్టి తల్లి లేక తండ్రి యొక్క కుటుంబములో ఒకడుగా పెంచబడిన సంతానము.

(III) అన్యమతమునుండి హిందూమతమును స్వీకరించినవారు బౌద్ధులు, సిక్కులు, జైనులు.

బౌద్ధ, సిక్కు, జైనమతములు హిందూమతశాఖలే. సనాతనహిందూమతమును కొన్నివిషయములలో ఈ మతావలంబకులు వ్యతిరేకింతురు. అయినను వీరికి హిందూ న్యాయశాస్త్రము వర్తించును.

క్రైస్తవు లెవరు?

జీసస్ క్రైస్తుచే స్థాపింపబడిన మతావలంబకుడు క్రైస్తవుడు. ఇతరమతములను వదలి క్రైస్తవమతమును పుచ్చుకొన్నవారు, వారిసంతతివారుకూడా క్రైస్తవులే.

మహమ్మదీయు లెవరు ?

భగవంతు డొక డేననియు, మహమ్మదే అతనిప్రవక్త అనియు నమ్మువారు మహమ్మదీయులు. సాధారణముగా మహమ్మదీయులగు తల్లిదండ్రులకు పుట్టుటచే మహమ్మదీయ మతము సంక్రమించును. ఇతరమతస్థుడు మహమ్మదీయ మతములో చేరవచ్చును.

# 2. వివాహకాండ

వివాహముచేసికొనదలచినవారు ఏయే నిబంధనలను పాటించవలెను? వివాహవిచ్ఛేదము ఏపరిస్థితులలో సంభవను? ఈ ప్రశ్నలకు సమాధానము ఆయా వ్యక్తులమతమునుపై ఆధారపడియుండును. హిందువులకు, మహమ్మదీయులకు, క్రైస్తవులకు ఈ విషయములో సంబంధించిన న్యాయశాస్త్రము పరిశీలింతము.

## (అ) హైందవులు

### చట్టము

### హిందూవివాహపుచట్టము (1955)

వివాహనియమములు :–

(1) వివాహముచేసికొనెడు మొగవానికి వేరొక భార్యగాని, స్త్రీకి వేరొక భర్తగాని ఉండరాదు.

బహుభార్యాత్వము నిషిద్ధము :–

పూర్వపు హిందూశాస్త్రము బహుభార్యాత్వము నంగీకరించెను. ఇప్పుడు దీనిని నిషేధించినారు. కనుక, ఒక భార్యవుండగా మరియొక స్త్రీని వివాహముచేసికొనరాదు. భార్యయుండగా మరియొక స్త్రీని వివాహముచేసికొనినచో ఆ వివాహము చెల్లనేరదు. పైగా శిక్షాస్మృతిక్రింద నేరముగా శిక్షింపబడును. ఒక భర్తయుండగా మరొకభర్తను వివాహమాడుట పూర్వపు హిందూధర్మశాస్త్రమునకుకూడ విరుద్ధమే; శిక్షాస్మృతిక్రింద ఎప్పుడైనను నేరమే.

విడాకులుపొందినవారు :-

ఒకరికి భర్తగాని, భార్యగాని ఉన్నసందర్భములో పునర్వివాహము తలపెట్టినచో మొదటివివాహము విచ్ఛేదము చేసికొనవలెను. ఈ వివాహవిచ్ఛేదము కోర్టుమూలమున జరుగవలెను. తగినకారణములున్ననే కోర్టువారు వివాహ విచ్ఛేదమున కంగీకరింతురు. (వివాహవిచ్ఛేదప్రకరణమును చూడుము.) ఈవిధముగ వివాహవిచ్ఛేదమైనచో పునర్వివాహ మీ క్రిందినియమములకు లోబడి చేసికొనవచ్చును. (I) మొదటిన్యాయస్థానము ఒసగిన వివాహవిచ్ఛేదపుతీర్పు అనంతరం ఒక సంవత్సరము గతించవలెను. (II) కోర్టువారి తీర్పుపైన అప్పీలుచేయనికారణమునగాని, అప్పీలు త్రోసి వేయబడుటచేగాని ఆ తీర్పు న్యాయముకావలెను.

విధవావివాహము :-

యాజ్ఞవల్క్యఋషిప్రోక్తమగు స్మృతిలో వివాహ మగుస్త్రీ 'అనన్యపూర్వికే' గా వుండవలెనని నియమము కలదు. అనగా మరియొకనికి చెందినదిగా యుండరాదు. విధనకు వివాహ మయుక్తమని సారాంశము. నారదస్మృతిలో విధవావివాహముకొన్నిసందర్భములలో అంగీకరింపబడినట్లుగా భావింపబడుచున్నది! 1856 లో హిందూవిధవాపునర్వివాహ శాసనము ఏర్పడి, విధవలకుగల పునర్వివాహమందు అన ర్హత తీసివేయబడెను. ఆ చట్టముక్రింద వితంతువునకు

(1) వ్యవహారదక్షతగల వయస్సు రాక, మొదటివివాహ ములో పునస్సంధానముజరుగనిచో, పునర్వివాహమునకు ఆమె

సంరక్షకుని అనుమతి అవసరము. ఆ సంరక్షకులలో ప్రాధాన్యమునుబట్టి వారిని ఈవిధముగా సంకలనముచేయవచ్చును: తండ్రి, పితామహుడు; తల్లి; పెద్దన్న; తక్కిన సోదరులు; సన్నిహిత పురుషబంధువులు. సంరక్షకుని అనుమతిలేకుండ విధవా పునర్వివాహము జరిగిన, గర్భాధానక్రియ పూర్తి కానంతవరకు, అతనికి ఆ వివాహమును రద్దుజేయించు హక్కు కలదు. భార్యమరణానంతరము తిరిగి వివాహము చేసికొనుహక్కు పురుషునికి గలదు.

శ్లో॥ నష్టే, మృతే, ప్రవ్రజితే, క్లీబే చ పతితౌ పతౌ పంచస్వాపత్సు
నారీణాం పతి రన్యో విధీయతే॥

2. పెండ్లికూతురు, పెండ్లికొడుకు నిషేధింపబడిన సంబంధముగలవారుగా ఉండరాదు. ఈ నియమమును భంగమైన వివాహము న్యాయశాస్త్రవిహితముగాదు.

నిషిద్ధసంబంధములు :—

(అ) వంశానవళిలో పైతరమువారితో ఉదా॥ కూతురు తండ్రితో; కొడుకు తల్లితో.

(ఆ) పైతరమువారి లేక క్రిందితరమువారి భార్య లేక భర్తతో, ఉదా॥ మామ కోడలి (కొడుకుభార్య)తో, అత్త అల్లుని (కూతురిభర్త)తో.

(ఇ) సోదరునిభార్య; తండ్రిసోదరునిభార్య; మేనమామభార్య; తాతసోదరునిభార్య, అవ్వసోదరునిభార్య.

(ఈ) సోదరుడు, సోదరి, మేనమామ, మేనకోడలు, మేనత్త, మేనల్లుడు, సహోదరిసంతానము, సోదరులసంతానము; ఇద్దరుసోదరులసంతానం; ఇద్దరుసోదరీమణులసంతానం.

ఆచారము మినహాయింపు :-

పై నియమము ఉల్లంఘింపబడినను, లోకాచారము వలన కొన్ని వివాహములు శాస్త్రీయములుగనే పరిగణింప బడుచున్నవి. దక్షిణహిందూదేశములో సహోదరి సంతానము సోదరులసంతానముతో చేయు వివాహములు; మేనమామ మేనకోడలి వివాహములు సర్వసాధారణముగా జరుగుచున్నవి. ఇది లోకాచారముచే అంగీకరింపబడినందున పై నిషేధములు వీనికి వర్తించవు.

(3) సపిండులు వివాహము చేసికొనరాదు. సాపిండ్య మెంతవరకు? సపిండులనగా "ఒకేశరీరము పంచుకొన్న" అని అర్థము.

హిందూధర్మశాస్త్రములు సాపిండ్యసంబంధమును తల్లివైపున 5 పురుషాంతరములవరకును, తండ్రివైపున 7 పురుషాంతరములవరకును ఉండునని నిశ్చయించెను. 1955 సం॥ పు చట్టము దీనిపరిమితిని తగ్గించెను. ఈ చట్టముప్రకారము తల్లివైపున 3 పురుషాంతరములవరకు, తండ్రివైపున 5 పురుషాంతరములవరకు మాత్రమే సపిండ సంబంధము వర్తించును. ఇద్దరిని సపిండులుగా పరిగణించుటకు ఈ పరిధిలో ఒకరు మరియొకరి పైతరమువారయియుండను కావలెను, లేదా పైతరమువారొకరు ఇరువురికి ఈ హద్దులోనే ఉండవలెను. 1956 చట్టము ఈ హద్దులను దగ్గరకు తెచ్చి పరస్పర వివాహార్హతగలవారుండు పరిధిని పెంచినది.

పురుషాంతరములను లెక్కించుపద్ధతి :-

రామయ్య, రామమ్మలు సపిండులగుదురా అనునది ప్రశ్న. నాగినవంశావళి క్రింద తెలుపబడినది :

వెంకయ్య

| | |
|---|---|
| — పెదవెంకయ్య (తాతతండ్రి) | కామయ్య (తల్లితండ్రి) — |
| — చినవెంకయ్య (తాత) | కామయ్య (తల్లి) — |
| — బుల్లివెంకయ్య (తండ్రి) | |
| — రామయ్య | రామమ్మ — |

ఈ వంశావళిలో రామయ్య, రామమ్మలకు ఒకే మూలపురుషుడు కలడు. పై తరమునాడగు ఈ మూలపురుషుడు రామయ్యనుండి 5 పురుషాంతరములలోనే ఉన్నాడు. (రామయ్య ఒకపురుషాంతరమని లెక్కపెట్టవలెను). తండ్రి వైపున 5 పురుషాంతరములవరకు సపిండసంబంధము ఉండును. కనుక రామయ్యనుండి మూలపురుషుడు సపిండపరిధిలో ఉన్నాడు. రామమ్మ వైపున ఆమెతల్లిద్వారా 4 పురుషాంతరములలో మూలపురుషుడగు వెంకన్న ఉన్నాడు. (రామమ్మను ఒకపురుషాంతరముగా లెక్కించవలెను) తల్లి వైపున 3 పురుషాంతరములవరకే సాపిండ్యము వర్తించును. కనుక రామమ్మవైపున వెంకయ్య ఈ పరిధికిఅవతల ఉన్నాడు కనుక రామయ్య రామమ్మలు సపిండులు కారు. కనుక వారొకరినొకరు వివాహముచేసుకొనవచ్చును.

ఆచారము మినహాయింపు :-

సపిండవివాహము నిషిద్ధమైనను, లోకాచారమును వలన అట్టివివాహములు కొన్ని అంగీకరింపబడినవి. దక్షిణ భారతదేశములో సహోదరీ సోదరులసంతానము, అనగా మేనమామ మేనగోడలివివాహము ఆచారరీత్యా అంగీకరింపబడినవి.

సవర్ణవివాహము :-

పెండ్లికుమారుడు పెండ్లికుమార్తె ఒకే వర్ణమువారు కావలెనను నియమము ఇప్పుడు లేదు.

(4) వివాహ కనిష్ఠ వయోపరిమితి :-

వివాహమునాటికి పెండ్లికుమారునికి 18సంవత్సరములు నిండవలెను. పెండ్లికుమార్తెకు 15 ఏళ్లు నిండవలెను. పెండ్లి కుమార్తెకు 18 సంవత్సరములు నిండనిచో, ఆమెసంరక్షకుని అంగీకారము పొందవలెను. సంరక్షకునికి 21 సంవత్సరములు నిండినగాని అంగీకారము నొసగు యోగ్యతఉండదు.

ఈ నిబంధనను అతిక్రమించినచో ఫలితము:-

వివాహార్థ్రులకు కనిష్ఠ వయోపరిమితిలేనప్పుడు చేసిన వివాహము శాస్త్రరీతిని చెల్లును. కాని, అట్టి వివాహముచేసి కొన్నవారు (పెండ్లికొడుకు, పెండ్లికూతురు) 15రోజుల కారా గారవాసమునకు గాని, వెయ్యి రూ. ల దాక జరిమానాకు గాని, ఈ రెండురకముల శిక్షలకుగాని పాత్రులగుదురు. 18 సంవత్సరములునిండని పెండ్లికూతురిని సంరక్షకునిఅంగీకా రము లేనిదే ఉద్వాహమైన పెండ్లికుమారునికి వెయ్యిరూపా యలదాకా జరిమానా విధింపవచ్చును.

(5) వివాహసమయమున పెండ్లికూతురునికిగాని, పెండ్లి కుమారునికిగాని మూఢత్వముగాని, ఉన్మాదము (పిచ్చి)గాని ఉండరాదు.

ఈ నిబంధనను అతిక్రమించినచో ఫలితము :

ఈ నిబంధనము ఉల్లంఘించుటవలన వివాహము రద్దు చేయదగినదిగా పరిణమించును. వివాహము నిరర్థకమైన దని కోర్టుడిక్రీ పొందవచ్చును. (నల్లిటీ డిక్రీ) అట్టి డిక్రీ కొరకు వ్యవహారచర్యలు వివాహమైనప్పటినుండి ఒకసంవత్స రములోగానే జరుపవలెను.

వివాహ నిరర్థకత్వనిరూపణకు అన్యకారణాలు :

నల్లిటీ డిక్రీ పొందుటకు ఈ క్రింది కారణములుకూడ ఆధారములే :

(1)వివాహమునాటికిని, నల్లిటీ డిక్రీపొందుటకు వ్యవ హారచర్య నారంభించునాటికిని వరునికి పుంస్త్వహీనత.

(2)వివాహమునాటికి పెండ్లికూతురు పెండ్లికుమారుని వలనగాక ఇతరులవలన గర్భవతియైయుండుట; ఆ సంగతి వరు నికి తెలియక, వివాహముచేసికొనుట.

అసిద్ధవివాహము; నిరర్థక వివాహము; భేదము :-

వివాహము సిద్ధింపనిచో (వాయిడ్ మ్యారేజి) దానిలోనిదోషమును ఎవరైనను, ఎప్పుడైనను ప్రతిపాదింప వచ్చును. వివాహము నిరర్థకమైనచో దానిని తగిన చర్యల మూలమున రద్దుపరుపవలెను. అట్టిచర్యలుతీసికొనుహక్కు- అన్యాయమునకు గురియైన భార్యకు లేక భర్తకు మాత్రమే

యున్నది. ఈ హక్కును వివాహమైన సంవత్సరములో వినియోగించుకోవలెను.

**1956 చట్టముక్రింద వివాహసంస్కారములు:-**

1956 చట్టము వివాహమునకు సంస్కారములను విధించలేదు. ఆచారమునుబట్టి ఈ సంస్కారములుండవచ్చును. *సంస్కారములలో సప్తపది అనునది ఉన్నచో, వివాహాగ్ని చుట్టు 7అడుగులు వేయగనే వివాహముస్థిరమగును.

**శేషహోమము; గర్భాదానము:-**

ఇవి సాధారణముగా జరుగు సంస్కారములు.

## (ఆ) మహమ్మదీయులు : నిఖా

**లౌకికమైన ఒడంబడిక :-**

మహమ్మదీయ న్యాయశాస్త్రము వివాహమును ఒక ఒడంబడికగా పరిగణించును. బాల్యదశ వీడి, మనోవైకల్యము లేనివారు, వివాహమునకు ఒప్పందము చేసికొనవచ్చును. బాల్యదశ 15 సంవత్సరములు నిండగనే తీరలగును. ఒప్పందము పెద్దమనుష్యుల సమక్షములో జరుగవలెను. ఈ సాక్షులు ఇరువురికితగ్గకుండ పురుషులు, లేక ఒక పురుషుడు, ఇరువురు స్త్రీలుగా ఉండవచ్చును.

---

* గణపతిపూజ; నాందిదేవతాపూజ; గృహయజ్ఞము: స్నాతకము; కాశీయాత్ర; వాక్‌నిశ్చయము; సంకల్పము; కన్యాదానము; కంకణబంధనము; సప్తపది; ప్రధానఆహుతి; లాజహోమము; గృహప్రవేశము, త్రిరాత్ర బ్రహ్మచర్యము— ఈ సంస్కారము జరుగగనే వివాహము పూర్తియగును.

న్యాయసమ్మతమైన విభాగ నియమములు :-

మహాస్మృతీయములు భార్యయుండగా తిరిగి పెండ్లాడ వచ్చును. కాని ఒకేమారు నలుగురికన్న ఎక్కువమంది భార్యలుండరాదు. బహుభర్తృత్వము నిషేధము. మహా స్మృతీయవనితనే కాక ప్రమాణ మతగ్రంథములుగల మతముల వనితలనైనను పెండ్లాడవచ్చును. (ఉదా॥ క్రైస్తవ లేక హిందూమత స్త్రీని). విగ్రహారాధనచేయు స్త్రీని వివాహ మాడరాదు. (ఉదా॥ హిందూ స్త్రీ). పురుషునికి కొన్ని బంధుత్వములలో వివాహము నిషిద్ధము.

1. రక్తసంబంధము– ఉ॥ తల్లి కూతురు; సోదరి, మేన కోడలు మొదలగువారు.

2. అనుబంధసంబంధము—కొడుకు భార్య.

3. పెంచినసంబంధము—సోదరి, పెంపుడుతల్లి.

శుల్కము :-

భర్తచే వివాహార్థము భార్యకొసగబడు ధనమునకు శుల్కమని పేరు. ఇది సద్యశ్శుల్కము, వాయిదాశుల్కము అని ద్వివిధము. సద్యశ్శుల్కమును ఎప్పుడడిగిన అప్పుడే చెల్లించవలెను. వాయిదా శుల్కము వివాహము విచ్ఛిన్నమైన సందర్భములో లేక భర్త చనిపోయినప్పుడు చెల్లించవలసియుండును. శుల్కమును నిర్ణయించని ఎడల కోర్టువారికి సబబని తోచు మొత్తము యుక్తశుల్కముగా ఇయ్యవలెను. ఈవిధముగ శుల్కము వివాహములో ముఖ్యాంగము.

బతిల్ నిఖా :-

రక్తసంబంధమైన, అనుబంధసంబంధమైన, సంస్పర్శ సంబంధమైన దోషములుగల వివాహములు చెల్లనేరవు. అట్టి వివాహములవలన పుట్టినపిల్లలు జారజులు. భార్యాభర్తల సంబంధము సిద్ధించదు.

ఫసిద్ నిఖా :

ఈ క్రిందిరీతి దోషయుక్తమైన, అశాస్త్రీయ వివాహములను ఫసిద్ నిఖా లందురు.

(అ) సాక్షులు లేకుండ చేసికొన్నవి (ఆ) ప్రవచనాత్మక గ్రంథములు లేనివారితో (ఉ॥ హిందవస్త్రీలతో). (ఇ) నల్గురు భార్యలుండగ అయిదవభార్యను చేసికొనుట.

ఫసిద్ నిఖావల్ల జన్మించినసంతతి క్రమమైనట్టి సంతతిగా పరిగణించబడును. కాని, భార్యాభర్తల కొకరి కొకరికి వారసత్వపుహక్కు ఉండదు. శాస్త్రీయ వివాహమందే అట్టి వారసత్వపుహక్కు కలుగును.

మూటా నిఖా. -

తాత్కాలిక వివాహమును మూటా నిఖా అందురు. దీనిని షియా మహమ్మదీయు లనుసరింతురు.

---

*షియా (షియత్ అలీకి సంక్షిప్తసంజ్ఞ) మహాప్రవక్త అగు మహమ్మదు అస్తంగతుడైన పిదప వారిచే నాతానాక సమయమున ప్రతినిధిగా నియుక్తుడైన వారి జామాతయగు అలీయే వారికి సరియైన స్థానీయుడని విశ్వసించిన అనుయాయులు షియా తెగవారు.

ఈ వివాహములో గమనించవలసిన విషయములు :-

(1) సహవాసకాలము నిర్దేశించవలెను. ఒకరోజు మాత్రమే ఐనను కావచ్చును. (2) శుల్కమును నిర్ణయించుకొనవలెను. తాత్కాలిక వివాహోత్పన్న సంతానము ఔరసులుగానే పరిగణింపబడుదురు.

సంభోగము జరిగినచో భార్యకు శుల్కమియ్యవలసియుండును. తాత్కాలికవివాహములో భార్యాభర్తలలో ఒకరికొకరికి వారసత్వపుహక్కు ఏర్పడదు.

వ్యవహారదక్షత ప్రాప్తించనివారి వివాహములు :-

యుక్తవయస్సురానివారికి వారితరపున తండ్రి, పితామహుడు, పితృసంబంధులగు కొందరు ఇతరబంధువులు, అట్టివారు లేనిచో తల్లి, మాతృసంబంధులగు బంధువులు, వివాహపు ఒడంబడిక చేయవచ్చును.

తండ్రి, పితామహుడు గాక ఇతరసంరక్షకులచే ఈరీతిగా ఒడంబడిక అయినచో, యుక్తవయస్సురాగానే ఆ ఒడంబడికను రద్దుచేసికొనవచ్చును. 15 సంవత్సరములు నిండని కన్యవిషయములో తండ్రి లేక పితామహునిచేత ఒడంబడికచేయబడినను, భర్తతో సంయోగము కానంత వరకు 18 సంవత్సరములు నిండకయుండు ఆ వివాహమును త్రోసివేయుహక్కు ఆమెకు గలదు. ఈ హక్కు 1939 లో మహమ్మదీయ వివాహవిమోచనచట్టమువలన కలిగినది.

## (ఇ) క్రైస్తవులు

### చట్టము :—క్రైస్తవుల వివాహచట్టము (1872)

వివాహములను యథావిధిగా జరిగించుటకు సంస్థలు :—

ఈ చట్టముక్రింద మతాచార్యులకు వివాహములను జరిపించుటకు అనుజ్ఞ నొసగబడును. భారతదేశపు క్రైస్తవులకు వివాహనిదర్శనపత్రికల నొసగు అధికారముగలవారు వివాహపత్రములను నమోదుచేయు అధికారముగల ప్రభుత్వ కార్యాలు (వివాహరిజిస్ట్రారులు) కూడ వివాహములను నిర్వర్తించుటకు తగినవారు.

వివాహమునకు నియమములు :—

ఈ చట్టము పెండ్లికొడుకుగాని పెండ్లికూతురుగాని, ఇద్దరుగాని క్రైస్తవమతస్థులైనప్పుడే వర్తించును. వీరిలో ప్రతి ఒకరికి వర్తించు ధర్మశాస్త్రమువల్లనైన వివాహమునకు ఆటంకములున్నచో (ఉ॥ సన్నిహిత బాంధవ్యములవలన కలిగెడి ఆటంకములు.) ఈ చట్టముక్రింద వివాహము నిషిద్ధమగును. ఈ చట్టము వివాహమును శాస్త్రీయముగా నిర్వహింపజేయు పద్ధతులను మాత్రమే నిర్వచించును. వివాహపు రిజిస్ట్రారుచే వివాహముజరుపబడుసందర్భములో ఉపయోగింపవలసిన పద్ధతి గమనార్హము. ఆ పద్ధతి యేమనగా—

నిశ్చయింపబడిన వివాహ ఉపక్రమణ ప్రకటన :—

వివాహము నిశ్చయమైన వధూవరులలో నొకరు తాము నివసించు జిల్లాలోని వివాహపు రిజిస్ట్రారునకు వివాహ

నిశ్చయసమాచారమును లిఖితపూర్వకముగా తెలియజేయ వలెను. వీరు వేరువేరుజిల్లాలలో నివసించుచున్నచో ఆజిల్లాల లోని వివాహముల రిజిస్ట్రారుల కిరువురకు ఇట్లే లిఖితపూర్వక ముగా తెలియజేయవలెను. ఈ సమాచారమును వివాహపు రిజిస్ట్రారు "వివాహప్రకటనపుస్తకములో" నమోదుపరచి తనకచ్చేరిలో అందరికి తెలియుచోట ప్రకటనపత్రికను అతి కించును.

రిజిస్ట్రారుముందు ప్రమాణముచేయుట :-

వధూవరులలో నొకరు స్వయముగా వివాహపు రిజిస్ట్రారునొద్ద హాజరయి కొన్ని ప్రమాణములను జేయవలెను. ఆ ప్రమాణము లేవనగా :

(1) సన్నిహిత బాంధవ్యముండుట మొదలైన ఆటంకములు వివాహమునకు లేవు.

(2) తననివాసస్థలము ఆ రిజిస్ట్రారు అధికారము కలిగియుండు జిల్లాలోనే యున్నది.

(3) వధూవరులలో నొకరికిగాని, యిరువురికిగాని 21 సంవత్సరములు నిండనిచో వివాహమున కనుమతించు అధికారముగలవారి (తండ్రి, తండ్రి మరణించినచో, న్యాయశాస్త్ర నిర్దిష్ట పోషకస్తి; అట్టివారు లేనిచో తల్లి) అంగీకారము పొందబడినది, లేక అట్టి అంగీకారము నొసగగల వారెవరును భారతదేశములో లేరు.

వివాహప్రకటన నిదర్శనపత్రిక :-

పైన చెప్పబడిన ప్రమాణములు చేసినతర్వాత, వివాహనిశ్చయప్రకటన ముట్టెన 14 రోజులకు (21 సంవత్సర

ములు వధువునకుగాని వరునకుగాని నివసించినచో 14 రోజులు) వివాహాలరిజిస్ట్రారు తనకు ప్రకటన సమర్పించినట్లు నిదర్శనపత్రికను ఇవ్వవచ్చును. ఈ పత్రికలో ఏ చర్చిలో లేక ఏ ప్రార్థనాగారములో పెండ్లి జరుపదలచిరో నిర్దేశింపబడును. ఎవరైనా కారణసహితముగా వివాహమునకు ఆక్షేపణ తెల్పినచో ఈ ఈ నిదర్శనపత్రిక ఇయ్యబడదు. అట్టి ఆక్షేపణ నిష్ఫలమైనదిగా చేయబడిన, ఆక్షేపకుడు నష్టపరిహారమును చెల్లింపవలసి యుండును. నిదర్శనపత్రిక లభించినచో, [illegible] రెండు మాసములలో వివాహమును జరుపవలెను. అట్లు చేయనిచో, నిదర్శనపత్రిక నిష్ప్రయోజనమగును. తిరిగి వివాహమునకు ప్రకటనను రిజిస్ట్రారునకు తెలిపి అట్టి నిదర్శనపత్రికను మరల పొందవలసియుండును.

వివాహావిధి :-

ఇద్దరు, లేక అంతకన్న ఎక్కువమంది సాక్షులసమక్షమున ఎవరైన ఒక వివాహపు రిజిస్ట్రారుసమక్షములో (పైన చెప్పబడిన నిదర్శనపత్రిక నొసగిన రిజిస్ట్రారే కానవసరము లేదు.) వధూవరులకు సరియని తోచిన పద్ధతిని వివాహము జరుపుకొనవచ్చును. వధూవరులు ఒకరితో నొకరు "ఇక్కడ ఉన్న పెద్దమనుష్యులయెదుట నిన్ను శాస్త్రీయముగా ఉద్వాహమైన భార్య (లేక భర్త)గా స్వీకరించుచున్నాను." అని చెప్పవలెను.

జాబితాపుస్తకములో నమోదుపరచుట :-

వివాహమునకు హాజరయి ధ్రువపరచిన రిజిస్ట్రారు "వివాహాల జాబితాపుస్తకము"లో వివాహమును నమోదు

పరచి, ఆ పుస్తకములో ప్రతిగా జతపరచిన ధ్రువపత్రికమీద కూడ వ్రాయవలెను. వధూవరులు చేవ్రాలుచేయగా సాక్షులు సంతకముచేయుదురు. ప్రతిగా జతపరిచిన ధ్రువపత్రిక "జనన మరణ వివాహముల సమాచారపు రిజిష్ట్రారు జనరల్" అను అధికారికి పంపబడును.

భారతీయ క్రైస్తవులకు ప్రత్యేకనిబంధనలు :—

భారతీయ క్రైస్తవుల విషయములో ఉపక్రమణ ప్రకటన లేకుండగనే నిదర్శనపత్రిక నొసగవచ్చును. వధూవరులలో ఏ ఒకరికిగాని 18 సంవత్సరములు నిండనిచో వివాహమునకు అంగీకారము తెలుపగలవారి అనుజ్ఞ లేనిదే నిదర్శనపత్రిక నొసగరాదు. అనుజ్ఞనొసగగలవారు తండ్రి, తండ్రి మరణించినచో న్యాయశాస్త్రనిర్దిష్ట పోషణకర్త, అట్టివారు లేనిచో; తల్లి. వివాహముల జాబితా పుస్తకములో వివాహము నమోదగును. 4 అణాల మూల్యమునకు వధూవరులకు వివాహధ్రువపత్రిక నొసగబడును.

## 3. వివాహవిచ్ఛేదము

వివాహవిచ్ఛేద వివరణ :—

వివాహవిచ్ఛేద మనగా వివాహబంధమునుండి విమోచనముబొంది, భార్యాభర్తల సంబంధమును రద్దుచేసికొనుట. ఇది న్యాయస్థానపు తీర్పువల్ల లభ్యమగును. మహమ్మదీయులలో భర్తకు న్యాయస్థానమునకు పోకుండగనే వివాహవిచ్ఛేదమునొందించు అధికారము గలదు.

(అ) హిందువులు :

వివాహవిచ్ఛేదనకు ఆధారకారణములు :—

భర్తకాని, భార్యకాని వివాహవిచ్ఛేదనమునకు విజ్ఞాపన చేయుటకుగల ఆధారములు, ఆక్షేపణలు ఏమనగా :

ఆక్షేపింపబడినవారు :

1. వ్యభిచారజీవితమును సాగించుట.

2. సన్యసించుట, లేక అన్యమతమును స్వీకరించుట.

3. విజ్ఞాపనచేయుటకుముందు 3 సంవత్సరములనుండి గాని, అందుకు యెక్కువకాలమునుండిగాని, చికిత్సనయముకాని ఉన్మత్తత, లేక కుష్ఠువ్యాధి కలిగియుండుట, లేక ఇతరులకు సంక్రమించే సుఖరోగములను కలిగియుండుట.

4. 7 సంవత్సరములకాలము ఎచ్చట నివసించు చున్నది తెలియకపోవుట.

5. కోర్టువారిచే దాంపత్యజీవితము గడుపవలసినదిగా తీర్పుఇవ్వబడినను ఆ తీర్పును రెండుసంవత్సరములుగాని, అంతకు ఎక్కువకాలముగాని అతిక్రమించుట.

6. కోర్టువారిచే విడిగానుండుటకు అనుమతించు తీర్పుఇవ్వబడినతర్వాత, 2 సంవత్సరములుగాని, అంతకు మించినకాలమువరకుగాని తిరిగి దాంపత్యజీవనము సాగకుండుట.

ఇవిగాక భార్యకు ప్రత్యేకమైన వివాహ విచ్ఛేదన ఆధారములు కొన్ని కలవు. అవి :

(1) భర్త స్త్రీని చెఱచుట, నిషిద్ధమైథున, పశుగమైథున నేరములు చేయుట.

(2) 18-5-1955 కు పూర్వము జరిగిన వివాహవిష యములో వివాహమునకుపూర్వమే భర్తకు వేరొకభార్య యుండుట, లేక తర్వాత వేరొకభార్యను బడయుట. విజ్ఞాపన జేయు సమయమున ఆ రెండవభార్య బ్రతికియుండిననే ఈ ఆధారము వర్తించును.

వివాహము అయినవెంటనే వివాహవిచ్ఛేదముకు విజ్ఞప్తి చేయవచ్చునా ?

వీలుపడదు. అసాధారణ పరిస్థితులలో తప్ప వివాహ విచ్ఛేదవిజ్ఞాపన వివాహమైనప్పటినుండి 3 సంవత్సరములు దాటువరకు కోర్టువారు అంగీకరింపరు.

రహస్య విచారణ :-

కక్షిదారులు కోరినచో, లేక న్యాయమూర్తికే అట్లు చేయుట యుచితమని తోచినచో వివాహవిచ్ఛేదమును గూర్చిన వ్యవహారములను, హిందూవివాహశాసనముక్రింద జరుగు ఇతర చర్యలను బహిరంగముగా గాక రహస్యముగా విచారణ జరిగింపవలెను. అనగా, ఇతరులు విచారణస్థలము నకు రాకుండ కట్టుదిట్టములు చేయవలెను. కోర్టువారి అను మతి లేకుండ ఈ వ్యవహారమునకు సంబంధించిన వివరములు ప్రకటించరాదు. ఈ నియమమును అతిక్రమించినవారు రూ. 1000 వరకు జరిమానాతో శిక్షింపబడుదురు.

న్యాయస్థానము పాటించవలసిన విధి :-

భార్యాభర్తలకు వీలైనంతవరకు సఖ్యమేర్పడుటకు న్యాయస్థానము పాటుపడవలెను. వ్యవహారదక్షత ప్రాప్తించన్ని

పిల్లలను సంరక్షణలోనుంచుట, పోషణాభృతిని నిర్ణయించుట, విద్యాసౌకర్యము లోనగునట్టి మొదలగు విషయములు వారి భావిక్షేమము నాలోచించి వారి ఇష్టానిష్టములను గుర్తించి చేయవలెను. విడాకులలో తీర్పు చెప్పునపుడు భార్యకు మనోవృత్తిగ నెలనెలకు కొంత ద్రవ్యాది ఇచ్చునట్లు ఏర్పాటు చేయవచ్చును. శాశ్వతమైన మనోవృత్తి ఏర్పాట్లు విడాకుల తీర్పు చెప్పినపుడు చేయవలెను.

## (ఆ) మహమ్మదీయులు :

భర్తచే వివాహవిచ్ఛేదము :—

భర్త వ్యవహారదక్షుడై, మనోవ్యాధిగ్రస్తుడు కానిచో, భార్యను ఎప్పుడైనను వివాహబంధమునుండి విమోచనము చేయవచ్చును. నోటిమాటలతోగాని వ్రాతపూర్వకముగాగాని ఇట్లు చేయవచ్చును. షియాలలో మాట్లాడుటకు శక్తిలేని సందర్భములో తప్ప లిఖితపూర్వక వివాహవిచ్ఛిత్తిని అంగీకరించరు.

ఇద్దత్ :—

భర్త మరణమువలనగాని, వివాహవిచ్ఛేదమువలన గాని వివాహము రద్దయిన కొంతకాలమువరకు స్త్రీ పునర్వివాహము చేసికొనరాదు. ఆ కాలమును ఇద్దత్ అందురు. గర్భముదాల్చియున్నదో లేదో ధృవపరచుకొనుటకు ఈ నిబంధనను చేసినారు. స్త్రీ ఋతుమతి అగుచో మూడు మాట్లు ముట్టుఅగువరకు ఇద్దత్ ఉండును. కానిచో మూడు చాంద్రమాసముల పర్యంతము ఉండును. గర్భముదాల్చి

యున్నచో విసుజపననుసరను ఇద్దత్ ఉండును. గర్భాభాసము కాకయుండే వివాహవిచ్ఛిత్తి అయినచో ఇద్దత్ పాటించవలసిన అవసరము లేదు.

భార్యచే వివాహ విచ్ఛేదము :-

కొన్నికొన్ని సందర్భములలో భార్య వివాహవిచ్ఛేదమును చేయు హక్కును పొందే అవకాశమును పొందవచ్చును. భర్త వేరొక భార్యను తన అంగీకారము లేకుండ వివాహముచేసికొన్నను, తనతండ్రి ఇంటికి పోవుట కాటంకము కల్గించినను, క్రూరముగ చూచినను, వివాహవిచ్ఛిత్తిని కల్గించెడు హక్కు తన కుండవలెనని ఒప్పందముచేసికొనవచ్చును. భర్త వివాహవిచ్ఛేదపు అధికారమును భార్యకు దత్తముచేయవచ్చును. అప్పుడు ఆ అధికారము వినియోగించి భార్య వివాహవిచ్ఛేదముచేయవచ్చును.

న్యాయస్థానము తీర్పువలన భార్యకు విడాకులు :-

1939 నాటి మహమ్మదీయ వివాహవిచ్ఛేదశాసనము క్రింద కోర్టువారు ఈ క్రింది కారణములలో ఏదేనున్నచో భార్యకు విడాకులను ప్రసాదింపవచ్చును.

(1) భర్త ఎక్కడ ఉన్నది 4 సంవత్సరముల పర్యంతము తెలియకపోవుట.

(2) 2 సంవత్సరములనుండి భర్త తనను పోషించక పోవుట.

(3) భర్తకు 7 సంవత్సరముల కారాగారవాసశిక్ష ప్రాప్తించుట.

(4) 3 సంవత్సరములకాలమువరకు భర్త కానరాను లేకుండ దాంపత్యజీవితము గడపకుండుట.

(5) వివాహకాలమునుండి భర్త పుంస్త్వహీనుడుగా నుండుట.

(6) భర్తకు ఉన్మత్తత లేక కుష్ఠురోగము లేక సుఖరోగము లుండుట.

(7) భర్త హింసించుట. భార్యచేత వ్యభిచరింప జేయ ప్రయత్నించుట; కొట్టుట, మరిపెద్దల కాపురంతరము కల్గించుట మొదలగునవి హింసగా పరిగణింపబడును.

విడాకులఫలితము :—

విడాకులవలన వివాహవిచ్ఛేదము జరిగిన, శుల్కము వెంటనే భార్యకు చెల్లించవలెను. ఇద్దత్ పూర్తికాగానే త్యజింపబడినభార్య ఇంకొకనిని పెండ్లాడవచ్చును. విడాకులు పొందిన భార్యాభర్తలకు పరస్పరము వారసత్వపుహక్కు ఉండదు. వారు పునర్వివాహములు చేసికొనవచ్చును. అట్లు చేసికొనకుండ సంభోగించుటవలన పిల్లలు జన్మించిన, తండ్రి చేత తన పితృత్వము అంగీకరింపబడినను, ఆ పిల్లలు ఔరసులుగా గణింపబడరు. వివాహము జరుగుటనుగురించిగాని, వివాహకాలమునుగూర్చిగాని సందిగ్ధముగా ఉన్న పరిస్థితిలో తండ్రిచేత బహిరంగముగా తనబిడ్డగా జూడబడినట్లు ఋజువైనచో, అట్టి పితృత్వాంగీకారమువలనగాక, ఇతర ఆధారములచే పునర్వివాహమును ఋజువుచేసికొనవలసియుండును.

## (ఇ) క్రైస్తవులు

చట్టము :

(1) మతాంతర్గతుల వివాహవిచ్ఛేద శాసనము (1866)

(2) విడాకులచట్టము (1869)

క్రైస్తవమత స్వీకారమువలన హైందవునికిగలుగు ఫలము :

ఇద్దరుహిందువులు—జోగయ్య జోగమ్మ అనువారు భార్యాభర్తలు. వారిలో జోగయ్య క్రైస్తవమతములో కలిసెను. దీనివలన వారి వివాహము విచ్ఛిన్నముకాదు. హిందూమతములోనే యుండదలచిన జోగమ్మ మతాంతర్గతుడైన భర్తతో దాంపత్యజీవనము జరుపుటకు నిరాకరింప వచ్చును. అట్లు 6 నెలలు గడిచిన తర్వాత 'మతాంతర్గతుల వివాహవిచ్ఛేదశాసనము' క్రింద జోగమ్మ తనతో దాంపత్యజీవనముగడుపునట్లు ఉత్తరువుచేయుమని కోర్టువారికి జోగయ్య వినతిచేయవచ్చును. జోగమ్మ సమ్మతింపనిచో కోర్టువారు ఒక సంవత్సరము వాయిదా వేయుదురు. సంవత్సరము గడిచినతర్వాతకూడ జోగమ్మ దాంపత్య సహజీవనమునకు విముఖురాలుగానున్నచో జోగయ్యకు వివాహవిచ్ఛేదపు ఉత్తరువులను కోర్టువారు నొసగవచ్చును. గర్భాదానము కానిచో సంవత్సరము ఆగకుండానే ఇట్టి ఉత్తర్వులను ఇవ్వవచ్చును.

విడాకులచట్టముక్రింద పరిహారములు :-

వాది ప్రతివాదులలో నొకరు క్రైస్తవులైన విడాకుల చట్టము వర్తించును.

ఈ చట్టముక్రింద లభించు పరిహారములు:

(1) వివాహవిచ్ఛేదను.

(2) వివాహము చెల్లదని ప్రకటన.

(3) కోర్టువారిఅనుమతితో దంపతులు విడివిడిగా నుండుట.

(4) దాంపత్యపుహక్కుల యథాస్థాపనము.

## 4. వారసత్వము

ఎవరయినను మరణించినచో వారిఆస్తి ఎవరికి సంక్రమింపవలెనను ప్రశ్న ఉత్పన్నమగును. ఆస్తికాపుదారు తన మరణానంతరము తన ఆస్తి యెవరికి చెందవలెనో మరణశాసనము మూలమున నిర్దేశింపవచ్చును. అప్పుడు మరణశాసనానుసారముగా అతనిఆస్తి పంపిణీజరుగును. అట్లు మరణశాసనపూర్వక వారసత్వము సిద్ధించును. మరణశాసనము చేయకుండా ఒకవ్యక్తి మరణించినచో అతనిఆస్తి అనుసరింపవలసిన న్యాయశాస్త్రము నిర్దేశించిన ప్రకారము కొంతకొంతమంది బాంధవ్యముగలవారికి చెందును. ఇట్లు న్యాయశాస్త్రరీతిని ఆస్తిని పొందదగువారిని వారసులందురు. వారిది మరణశాసనపూర్వకముకానట్టి వారసత్వము. ఇట్టి "వారసత్వము"ను గూర్చి ముందు తెలిసికొందము.

### హిందూ వారసత్వ సూత్రములు

మితాక్షరి, దాయభాగ శాఖలు :—

వంగదేశము (బెంగాల్)లో దాయభాగమును

న్యాయశాస్త్రమును పాటించుదురు. న్యాయశాస్త్రముపై జీమూతవాహనుడను పండితుడు రచించిన యుద్గ్రంథ ములో 'దాయభాగ'మనునది యొక అధ్యాయము. దీనికి వంగదేశములోనే ప్రాధాన్యము. వంగదేశముగాక యింక భారతదేశములో ఎక్కడైనను మితాక్షరి నిర్దిష్ట దాయ సత్వము అనుసరింపబడును. విజ్ఞానేశ్వరుడను యతి యాజ్ఞ వల్క్యఋషిప్రోక్తస్మృతికి మితాక్షరి అను పేరుతో వ్యాఖ్యా నము రచించెను. అందు ప్రతిపాదింపబడిన దాయసత్వపు హక్కులను పాటించువారు మితాక్షరి అనుయాయులు.

1956 హిందూ దాయసత్వ శాసనము :-

మితాక్షరి, దాయభాగములచే ప్రతిపాదింపబడిన దాయ సత్వపు సిద్ధాంతములకు చాల వ్యత్యాసము గలదు. పైగా మితాక్షరి అనుయాయులలోనే భిన్నభిన్న ప్రాంతములలో భిన్నభిన్న దాయసత్వపుసిద్ధాంతములు ఆమోదింపబడెను. ప్రాంతమునుబట్టి దాయసత్వపుహక్కులు మారుచుండుటచే చాల గందరగోళముగానుండెను. అందువలన భారతదేశ మందలి శాసనకర్తలు ఈ విభిన్న దృక్పథములుగల దాయ సత్వపు సిద్ధాంతములస్థానమున అందరు హిందువులకు ఒకే రీతిని వర్తించు దాయసత్వపుహక్కులను ప్రతిపాదించుచు హిందువుల దాయసత్వపు చట్టమును 1956 లో అమలుపరిచిరి. ఈ చట్టములో నిర్దేశింపబడిన దాయసత్వపుహక్కులు ఇచట చర్చింపబడును.

(I) చనిపోయిన ఆస్తిదారుడు పురుషుడైనప్పుడు వారసులు:

1 వ తరగతి వారసులు

(1) కుమారులు
(2) కుమార్తె
(3) వితంతువైనభార్య
(4) తల్లి
(5) ముందుగా చనిపోయిన కుమారుని కుమారుడు
(6) ,, ,, కుమారుని కుమార్తె
(7) ,, ,, ,, వితంతువు
(8) ,, ,, కుమార్తెయొక్క కుమారుడు
(9) ,, ,, ,, కుమార్తె
(10) ,, కుమారునియొక్క ముందుగా చనిపోయిన కొడుకుని కుమారుడు
(11) ,, ,, ,, ,, కుమార్తె
(12) ,, ,, ,, ,, వితంతువు

ముఖ్యగమనికలు:-

1 వ తరగతి వారసులు ఒకేకాలమునందు ఆస్తిని పొందుదురు. ఈ తరగతిలోని వారసులెవరైనను ఉన్నచో, తక్కినతరగతివారసులకు ఆస్తి చెందదు. ఈ తరగతివారసులలో ఆస్తివిభజన నియమములు:

(1) చనిపోయినవాని భార్యకు (ఎక్కువమంది ఉన్నచో అందరికి గలసి) ఒకవాటా
(2) కుమారుడు ఒకొక్కనికి ఒకొక్కవాటా.

(3) కుమార్తెకు ఒక్కొక్కతెకు ఒక్కొక్కవాటా.

(4) తల్లికి ఒకవాటా.

(5) ముందుచనిపోయిన కుమారుడు :-

జీవించియుండినచో, ఇతనికిరాదగ్గభాగము, ఇతనిశాఖలో పంచబడును. ఇతని వితంతువు, (లేక వితంతువులు) కుమారులు, కుమార్తెలు సమభాగములుగాను; ఇతనికంటెముందు చనిపోయిన కుమారుని శాఖకు ఇతనికివచ్చినంత భాగము వచ్చునట్లును పంచబడును.

(6) ముందుచనిపోయిన కుమార్తె :

ఈమె జీవించియున్నచో ఈమెకులభ్యమగుభాగమును ఈమెవారసులు, ఈమె స్థానమున పొందుదురు. అందులో ఈమె కుమారులకు, ఈమెకుమార్తెలకు భాగము సమముగా ఉండవలెను.

ఉదాహరణము :

వీరయ్య చనిపోయినాడు. అతనిఆస్తి 70 ఎకరములు. దీని పంపిణీ ఈ క్రిందివిధముగా ఉండును.

(1) కుమారుడు......... 10 ఎకరములు

(2) కుమార్తె .......... 10 ,,

(3) వితంతుభార్య ...... 10 ,,

(4) తల్లి ..........10 ,,

(5) ముందుగా చనిపోయిన

కుమారునికొడుకు ⎫
(6) ,, ,, కుమార్తె ⎬ 10 ,, (ఒక్కొక్కవాటా 3 1/3 ఎకరములు
(7) ,, ,, వితంతువు ⎭

(8) ఇప్పుడు చనిపోయిన ... 5 ఎకరములు
కుమార్తెకుమారుడు
(9) ,, ,, కుమార్తె ... 5 ,,
(10) ముందుచనిపోయిన ...3 1/3 ,,
కుమారునియొక్క-
ముందుచనిపోయిన
కుమారుని కొడుకు
(11) ,, ,, కుమార్తె 3 1/3 ,,
(12) ,, ,, వితంతువు 3 1/3 ,,

రెండవతరగతి వారసులు

(1) తండ్రి
(2)(I) కుమారుని కుమార్తెకుమారుడు
(II) ,, ,, కూతురు
(III) సోదరుడు
(IV) సోదరి
(3)(I) కుమార్తె కుమారుని కుమారుడు
(II) ,, ,, కూతురు
(III) ,, కుమార్తె కుమారుడు
(VI) కుమార్తె కుమార్తె కుమార్తె
(4)(I) సోదరుని కుమారుడు
(II) సోదరి ,,
(III) సోదరుని కుమార్తె
(IV) సోదరి కుమార్తె

(5) తండ్రి తండ్రి; తండ్రి తల్లి;
(6) తండ్రి వితంతువు; సోదరుని వితంతువు
(7) తండ్రి సోదరుడు; తండ్రి సోదరి
(8) మాతామహుడు (తల్లి తండ్రి) మాతామహి (తల్లి తల్లి)
(9) తల్లిసోదరుడు (మేనమామ); పినతల్లి (తల్లి సోదరి)

మొదటితరగతి వారసులు లేనిచో, రెండవతరగతి వారసులకు ఆస్తి సంప్రాప్తించును. ఈ రెండవతరగతిలో 9 తెగలు గలవు. ఇవి పైన చూపబడినవి. ఈ తెగలలోని వారు క్రమముగా పై శాఖలలోనివారు లేనిచో క్రింది తెగల లోనివారు వారసులగుదురు. ఒకే తెగలో జేరినవారి నడుమ పంపకము సమముగా ఉండవలెను.

జ్ఞాతులు :-

ఒకటి రెండు తరగతుల వారసులు లేనిచో, చనిపోయినవాని ఆస్తి అతని జ్ఞాతులకు సంక్రమించును. ఒకనికి ఇంకొకడు జ్ఞాతి అయినచో వారిరువురికిగల రక్తసంబంధము గాని లేక దత్తతవలన సంబంధముగాని పూర్తిగా పురుషులనుండియే యుండును.

బంధువులు :

జ్ఞాతులు లేనిచో బంధువులు వారసులు. బంధువులలో పరస్పరసంబంధము పూర్తిగా పురుషులద్వారముననే యుండదు. స్త్రీలనుండికూడ వారికి సంబంధ మేర్పడి యుండును.

జ్ఞాతులకు, బంధువులకు వర్తించు సూత్రములు :—

ఈ క్రింది సూత్రములు గమనార్హములు.

(1) ఎవనికి చనిపోయినవానినుండి తరములు తక్కువగా ఉండునో అతనిది వారసత్వము. చనిపోయినవాని వంశస్థులు పైతరమువారికంటే ముందు పొందుదురు. పూర్వీకములలోవారుగాని; వారి జ్ఞాతులుగాని వంశస్థులుగాని ఎవరు చనిపోయిన వాని కెక్కువ సన్నిహితులుగానున్నవారో వారు వారసత్వమున కర్హులు.

(2) పై తరములవారిసంఖ్య సమముగానున్న యెడల ఎవరికి క్రిందితరములు తక్కువగా ఉండునో వారిది వారసత్వము.

(3) ఈ రెండుసూత్రములచేత జ్ఞాతులలోగాని, బంధువులలోగాని, ఎవరికి వారసత్వము నుండునది తేలనిచో, అట్టి జ్ఞాతులందరును లేక బంధువులందరును సమానముగా పంచుకొనవలెను.

తరములను లెక్కించు పద్ధతి :—

చనిపోయినవానినుండి తరములను పైకిగాని క్రిందికిగాని, గణించునపుడు, చనిపోయినవానినికూడ ఒక తరముగా లెక్కించవలెను. ప్రతిపురుషాంతరము పైకి లెక్కించునపుడు ఒక పూర్వతరము, క్రిందికి లెక్కించునపుడు ఒక తరువాతి తరము అగును.

ఉదాహరణ :—




కామయ్య మరణశాసనము వ్రాయకుండ గతించెను. సోమయ్య అతనికి జ్ఞాతి. ఇతనికి కామయ్యకు పరస్పర సంబంధము నిర్ణయించు తరములలో స్త్రీ రాలేదు. కనుకనే వీరు జ్ఞాతులు. భీమయ్య బంధువు. ఇతని సంబంధము నిర్ణయించుతరములలో వెంకమ్మ అను స్త్రీ ఉన్నందున భీమయ్య జ్ఞాతికాడు; ఇతడు బంధువు. సోమయ్య జ్ఞాతి కనుక బంధువగు భీమయ్యకన్న వారసత్వమునకు ఎక్కువ అర్హత కలవాడు. చిన్నయ్యకూడ బంధువే. సోమయ్య లేనిచో, ఆ ఆస్తి భీమయ్యకు చెందవలెనా, చిన్నయ్యకు చెందవలెనా? చనిపోయినవానినుండి తరములు లెక్కించవలెను. అతనినికూడ కలుపుకొనవలెను. అప్పుడు చిన్నయ్య చనిపోయినవాని నుండి పైకి 3 తరములు; మూలపురుషునినుండి (అతనిని ఒకటిగా లెక్కింపగా) 4 తరములు క్రిందికి ఉన్నాడు. భీమయ్య 3 తరములు పైకి, 3 తరములు మాత్రమే క్రిందికి ఉన్నాడు.

కనుక భీమయ్య చిన్నయ్యకన్న దగ్గరబంధువు. అప్పుడే ఆస్తి చిన్నయ్యకన్న ముందు సంక్రమించును. సీతయ్య బ్రతికి యున్నచో భీమయ్య సీతయ్యలు ఇద్దరు సమానస్థాయి సన్నిహిత బంధువులు గనుక, సమముగా ఆస్తిని పంచుకొన వలెను.

## హిందూస్త్రీలఆస్తికి వారసత్వము

పరిమితమైనఆస్తి; దానికి సంబంధించిన హక్కులు :-

హిందూవారసత్వపుచట్టము 17-6-1956 నుండి అమలులోనికి వచ్చెను. అంతకుపూర్వము హిందూస్త్రీలు వారసత్వపద్ధతిని తమకు సంక్రమించిన ఆస్తిలో పరిమితమైన హక్కులను మాత్రమే కల్గియుండిరి. ఆ ఆస్తినుండివచ్చు ఆదాయమును అనుభవించు హక్కునుమాత్రమే కల్గియుండిరి. కాని ఆ ఆస్తిని దానముచేయుటకు, మరణశాసనద్వారమున ఇతరులకు సంక్రమింపజేయుటకు హక్కు ఉండెడిదికాదు. న్యాయశాస్త్రము అంగీకరించు ఆవశ్యకతలేక లాభమునుఉన్ననే (ఉ॥ స్వీయపోషణ నిమిత్తము) అన్యాక్రాంతముచేయ వచ్చును. ఆమె మరణానంతరము అట్టి స్త్రీ ఆమెచే అక్కర లేనిదే యితరులకు సంక్రమింపజేసినను, తిరిగి క్రిందటి పంగ హక్కుదారునివారసులకు సంక్రమించుచుండెను. వారినే ఉత్తరవారసు లందురు ఆమెవారసులకు చెందదు. ఉత్తర వారసులకే చెందును.

ఉ॥ పేరయ్య చనిపోయెను. అతనికి ఒకకుమార్తె, భీమయ్యఅను సోదరుడు, సోమయ్యఅను అల్లుడు (కుమార్తె

భర్త) గలదు. ఆ ఆస్తి కుమార్తెకు సంక్రమించును. కుమార్తెకు పరిమితమైన హక్కులుమాత్రమే ఉండును. ఆమె మరణానంతరము క్రిందటి మగ హక్కుదారుని (పేరయ్య) వారసులకు ఆ ఆస్తి చెందును. అతనిసోదరుడు భీమయ్యకు చెందును. భీమయ్య ఉత్తరవారసుడు.

స్త్రీధనము :-

స్త్రీకి దానవిక్రయాది సంపూర్ణస్వాత్వముగల ఆస్తికి స్త్రీధనమని పేరు. 17–6–56 కు ముందుగాని తర్వాతగాని హిందూస్త్రీకి సంక్రమించి ఆమెస్వాధీనములోనేయున్న ఆస్తి ఆమె స్త్రీధనముగా పరిగణింపబడును. అనగా 17–6–56 కు ముందు పరిమితమైన హక్కులే ఆమెకు ఉన్నను, పూర్తి హక్కులు ఈ చట్టమునలన ఆమెకు సిద్ధించును.

ఉదాహరణ : 1950 లో పేరమ్మఅను వితంతువు ఆమెభర్తతాలూకు 10 ఎకరముల ఆస్తికి వారసురాలాయెను. అప్పుడు ఆమె పరిమితమైనహక్కు మాత్రమే కలిగియుండెను. 17–6–56 నాటికి ఆస్తి ఆమెస్వాధీనములో ఉన్నచో, ఆమెకు సంపూర్ణమైన హక్కులు లభ్యమగును. 1951 లో 3 ఎకరములను సీతయ్యకు దానముచేసినదని అనుకొందము. 17–6–56న మిగతా 7 ఎకరములలోనే ఆమెకు సంపూర్ణమైన హక్కులు సిద్ధించును. సీతయ్య యీ చట్టము వలన పొందినదానిపై సంపూర్ణమైన హక్కులు లభించినవని తలపరాదు.

స్త్రీకి దానపత్రము, మరణశాసనము, కోర్టుడిక్రీ, లేక [illegible] పరిమితమైన హక్కులకే లభిం

చిన ఆస్తికి ఈచట్టము వర్తింపదు. ఆవిధముగా సంక్రమించిన పరిమిత మైన హక్కుగల ఆస్తి ఉత్తరవారసులకు ఆమె మరణానంతరము లభించును.

పరిమితమైన హక్కుగల స్త్రీ చనిపోయినప్పుడు ఆ ఆస్తికి వారసత్వము నిర్ణయించుటలో క్రిందటి సుగహక్కు దారునికే మరలమరల వారసత్వము చూడవలసియుండవలెను. స్త్రీధనము మాత్రము స్త్రీయొక్క వారసులకే చెందును.

స్త్రీధనమునకు వారసులు :-

స్త్రీ చనిపోయినపుడు ఆమె స్త్రీధనము వారసులకు సంక్రమించెడి క్రమము ఈ క్రిందివిధముగా నుండును.

(1) కుమారులకు, కుమార్తెలకు; భర్తకు ముందు చని పోయిన కుమారుని లేక కుమార్తెయొక్క బిడ్డలు చనిపోయిన వారిస్థానమున వారికి రావలసిన భాగమును పొందుదురు.

(2) భర్తవారసులు

(3) తల్లి; తండ్రి.

(4) తండ్రివారసులు

(5) తల్లివారసులు

ఈ 5 తెగలలో ఒక్కొక్కదానిలోనివారు తర్వాత వచ్చు తెగలవారికన్న ముందు వారసత్వమునకు అర్హులు. ఒకే తెగలోనివారు ఏకకాలములో సమానమైన వాటా దార్లుగా ఉందురు.

మినహాయింపులు :-

1. తండ్రి లేక తల్లినుండి వారసత్వరీతిని వచ్చిన

స్త్రీధనము బిడ్డలకుగాని బిడ్డలబిడ్డలకుగాని, లేనిచో, తండ్రి యొక్క వారసులకుగాని సంక్రమించును. అనగా భర్తకు ముందుగా వారసత్వము ఉండదు.

2. భర్త లేక మామగారినుండి వారసత్వరీతిని వచ్చిన స్త్రీధనము బిడ్డలకుగాని బిడ్డలబిడ్డలకుగాని లేనిచో భర్త వారసులకుగాని చెందును.

## 5. మహమ్మదీయ వారసత్వపుసూత్రములు

మహమ్మదీయులలో అధికసంఖ్యాకులగు సున్నీలకు వర్తించు న్యాయశాస్త్రములో వారసులు ఈ క్రింది తరగతులుగా విభజింపబడినారు.

1. షేరర్లు (వాటాదారులు) :

వీరికి నిర్ణీతమైనభాగము కలదు. ఈ భాగము పరిస్థితులనుబట్టి మారుచుండును.

2. రెసిడ్యూయరీలు (అవశిష్టులు) :

భాగస్థులకు చెందవలసిన వాటాలు చేరగా శేషించినది వీరికి చెందును. కొంతమంది భాగస్థులుగాను, అవశిష్టులుగాను ఉండవచ్చును. (ఉదా॥ తండ్రి; సోదరి) వీరికి నిర్దిష్ట భాగమేకాక, శేషించినదానిలోకూడ వాటా రావచ్చును.

అవశిష్టులలోని తరగతులు :-

వీరిని క్రిందివిధముగా వర్గీకరింపవచ్చును.

(I) సంతతివారు :

1. కుమారులు 2. కుమారుని పురుషసంతతి (ఎంత క్రింది తరమువారైనను)

(II) పైతరముసాారు
3.తండ్రి 4. నిజపితామహుడు ♦ (ఎంత పైతరమువారైనను)

(III) తండ్రిసంతతి :–

5. పూర్ణరక్తసంబంధియగు సోదరుడు
6. ,, ,, సోదరి
7. అర్ధరక్తసంబంధియగు సోదరి
8. ,, ,, సోదరుడు
9. పూర్ణరక్తసంబంధియగు సోదరుని కుమారుడు
10. అర్ధ ,, ,, ,, ,,
11. పూర్ణరక్తసంబంధియగు సోదరుని సోదరికుమారుడు
12. అర్ధ ,, ,, ,, ,,

(IV) సరియైనపితామహుని సంతతి :–

13. పూర్ణరక్తసంబంధియగు పెదతండ్రి (పినతండ్రి)
14. అర్ధ ,, ,, పెదతండ్రి
15. పూర్ణ ,, ,, ,, (పినతండ్రి) యొక్క కుమారుడు
16. అర్ధ ,, ,, ,, ,, ,,
17. పూర్ణ ,, ,, ,, (పినతండ్రి) కుమారుని కుమారుడు
18. అర్ధ ,, ,, ,, ,, ,,

---

♦ దీనికి వివరణ క్రిందిశీర్షికలో గలదు.

ఒక్కొక్కతరగతిలోని వారసులు క్రిందితరగతిలోని వారసులకన్న ముందు వారసత్వమునకు అర్హులు. ఒక్కొక్క తరగతిలోనివారసులు పైనసూచింపబడిన నెంబర్ల వరుసలో వారసత్వపుహక్కు పొందుదురు. మహమ్మదీయ న్యాయ శాస్త్రములో ప్రతి దగ్గరబంధువునకు కొంతభాగము, ఎంత చిన్నదైనను లభించును. ఇదే దీని ప్రత్యేకత.

## షేర్లు : భాగస్థులు

1. తండ్రి :—

ఇతనివాటా 1/6. చనిపోయినవానికి బిడ్డలుగాని లేక కుమారునిసంతతిగాని యున్న ఈ వాటా వచ్చును. వారు లేనిచో అవశిష్టుడుగా వారసుడగును.

2. సరియైన పితామహుడు :—

చనిపోయిన ఆ స్త్రీపురుషునికి అతనిపైతరములోని పురుషునికి నడుమ స్త్రీలు లేనిచో, అట్టి పైతరపు పురుషుడు సరియైన పితామహుడు.

(ఉ॥ తండ్రితండ్రి; తండ్రితండ్రితండ్రి మొదలగువారు) ఇతనివాటా 1/6. తండ్రి; సన్నిహిత నిజపితామహునికి వాటా లేకుండచేయును. తండ్రివలెనే అదేపరిస్థితులలో 1/6 వాటా దారుడుగాని అవశిష్టుడుగాని అగును.

3. భర్త :—

బిడ్డగాని, కుమారునిసంతతిగాని (ఎంత క్రిందితర మైనా) యున్నచో 1/4, లేనిచో 1/2 వాటా.

4. భార్య (లేక భార్యలు) :—

బిడ్డగాని, కుమారునిసంతతిగాని యున్నచో 1/8 లేనిచో 1/4.

5. తల్లి :—

బిడ్డగాని, కుమారునిసంతతిగాని, ఇద్దరు అంతకన్న ఎక్కువమంది సోదరులు లేక తోబుట్టువులుగాని, లేక ఒక సోదరుడు ఒకసోదరిగాని యున్నచో 1/6. లేనిచో 1/3.

6. సరియైన పితామహి:—

వాటా 1/6. చనిపోయిన ఆస్తిదారునికి పై తరములోని స్త్రీ. వీరినడుమ సరికాని పితామహుడు ఉండరాదు. సరికాని పితామహుడనగా చనిపోయినవానికి అతని పై తరములోని ఆ పితామహునికి నడుమ స్త్రీ యుండును. సరియైన ముత్తవలకు ఉదాహరణ॥ తల్లితల్లి; తల్లి తల్లితల్లి; తండ్రితల్లి; తండ్రి తండ్రితల్లి; తల్లి, దగ్గరిముత్తవ్వ; తండ్రి; నడుమను సరియైన పితామహుడుగాని యుండిన ఆమెకు హక్కువుండదు॥

7. కూతురు :—

ఒకకూతురైతే 1/2. అంతకుఎక్కువమందియున్న 2/3. చనిపోయిన ఆస్తిదారునికి కుమారుడు ఉన్నచో అతనితో అవశిష్టదారాలుగా మాత్రమే ఉండును. అప్పుడు కుమారునికి కూతురుకన్న రెట్టింపుభాగము రావలెను.

8. కుమారునికుమార్తె (ఎంత క్రిందితరమైనా) :—

ఒకరైన 1/2, అంతకుమించిన 2/3. కుమారుడున్నచో వాటాలేదు. కుమారుని కుమారుడున్నచో అవశిష్టదారాలగును. ఒక కుమార్తెయున్నచో 1/6 వాటామాత్రమే పొందును.

ఒక్కతెకంటె ఎక్కువమంది కుమార్తెలున్నచో ఈమెకు వాటాఉండదు.

9. ఏకోదరుడు: 10. ఏకోదరి :–

ఒకేతల్లికి వేరువేరు తండ్రులవలన ఉత్పన్నమైనవారు. ఇటువంటి హక్కుదారుడు ఒకడైయైన 1/6వాటా. ఒకనికంటె ఎక్కువమంది అయిన 1/3 వాటా. బిడ్డ; కుమారునిబిడ్డ (ఎంతక్రిందితరమైనను); తండ్రి; సరియైన పితామహుడు, వీరిలో ఎవరున్నను ఇతనికి వాటా ఉండదు.

11. పూర్ణరక్త సంబంధపుసోదరి :–

ఒకరైన 1/2, ఎక్కువమంది ఉన్నచో 2/3. ఏకోదరి వలెనే అదేపరిస్థితులలో ఈమెకు వాటా పోవును. పూర్ణరక్తసంబంధపు సోదరుడున్నచో అతనితో అవశిష్టురాలగును.

12. అర్థరక్తసంబంధపుసోదరి :–

1/2 లేక 2/3. పూర్ణరక్తసంబంధపు సోదరివలెనే వాటాపోవుట సంభవించును. ఒకే ఒక పూర్ణరక్తసంబంధ సోదరియుండి ఆమెఅవశిష్టురాలైన ఈమెవాటా1/6.అంతకన్న ఎక్కువమంది పూర్ణరక్తసంబంధపు తోబుట్టువులున్నచో ఈమెకు వాటాఉండదు. అర్థరక్తసంబంధపు సోదరుడున్నచో అతనివలెనే అవశిష్టురాలగును.

ఉదాహరణ :– ఈ క్రింది వారసులకు చనిపోయిన వానిఆస్తి పంపకము : మొత్తముఆస్తి 72 ఎకరాలు

| | | |
|---|---|---|
| తండ్రి : | 1/6 (బిడ్డయున్నందున) | 12 ఎకరాలు. |
| తల్లి : | 1/6 ( ,, ) | 12 ,, |

తండ్రితండ్రి : (తండ్రియున్నందున వాటాలేదు)
తల్లితల్లి : (తల్లి ,, ,, )
నల్గురువితంతువులు : 1/8 (అందరికికలిసి) 9 ఎకరాలు

ఇద్దరు పూర్ణరక్తసంబంధపు తోబుట్టువులు :-
(బిడ్డలున్నందున, తండ్రియున్నందున వాటాలేదు)
మొత్తము = 1/6 + 1/6 + 1/8 = 11/24 = 33 ఎకరాలు.
సోదరుడు : (కుమారుడున్నందున అవశిష్టులలో వాటాలేదు)
కుమారుడు : 13/24 × 2/3 = 26/72 = 26 ఎకరాలు.
కుమార్తె : 13/24 × 1/3 = 13/72 = 13 ఎకరాలు.

వృద్ధిసిద్ధాంతము:-

వారసులవాటాలనునిర్ణయించుటలో వృద్ధిసిద్ధాంతమును ఉపయోగింతురు. వాటాలుఅన్నీ కలిసి ఆస్తి మొత్తముకన్న ఎక్కువఅయినచో, వానిని సంబంధసామ్యపద్ధతిగా తగ్గించవలెను.

ఉదా॥ భర్త : 1/2 = 3/6.
2 సోదరిలు : 2/3 = 4/6.
మొత్తము = 3/6 + 4/6 = 7/6 వృద్ధిసిద్ధాంతము ప్రకారము,
భర్తకు 3/7 ఆస్తి.
2 సోదరిలు = 4/7 ఆస్తి.

రద్ సిద్ధాంతము (వాపస్) :-

అవశిష్టులులేనప్పుడు, భాగస్థులవాటాలు మొత్తముకన్న తక్కువఅయిన, మిగిలిన ఆస్తి భాగస్థులకే సరిపుచ్చు దగ్గరీతిని తిరిగి వచ్చును. భర్త భార్యలకు మాత్రమే ఇతర

భాగస్థులు దూరపుబంధువులుగాని లేనియెడలనే యీ సిద్ధాంతము వర్తించును.)

## 6. క్రైస్తవుల వారసత్వపు సూత్రములు

వర్తించుచట్టము: ఇండియన్ సక్సెషన్ ఆక్టు 1925

పురుషునివారసులు: చనిపోయిన ఆస్తిదారుడు పురుషుడయినచో అతనివారసులు ఈ క్రిందివిధముగా నుందురు.

1. భార్య :-

ఆస్తిదారుని సంతతివారుగాని, అతని పైతరమువారి సంతతివారుగాని లేకుండినచో, భార్యకే ఆస్తియంతయు సంక్రమించును. అతనిసంతతివారు లేకపోయినను, పైతరమువారు గాని, వారిసంతతివారుగాని యుండినచో, భార్యకు 1/2వంతు వచ్చును.

2. సంతతి :-

ఆస్తిదారునిసంతతి (అనగా బిడ్డలు, బిడ్డలసంతానము) అతనిభార్య యుండిన 2/3వంతు ఆస్తి కై కొందురు. అతని భార్య లేనిచో మొత్తముఆస్తికి వారసులగుదురు. సంతతి వారిలో పంపకము ఎట్లుజరుగవలెనో యీ క్రింది ఉదాహరణ వలన విశదమగును.




(చనిపోయినకూతురు)

ముగ్గురు కుమార్తెలు

జోసఫ్ ఆస్తిదారుడు. ఇతడు చనిపోయినప్పుడు ఇద్దరు కుమాళ్ళు, ముగ్గురుదౌహిత్రులు కలరు. ఆస్తి కుమారులకు ఒక్కొక్కనికి ఒక్కవాటా, చనిపోయిన కుమార్తె సంతతి [ఆమె ముగ్గురుకుమారులు] ఆమెశాఖకు రావలసిన ఒక వాటాను దీసికొందురు.

3. తండ్రి :

ఆస్తిదారునిసంతతి లేనిచో, అతనిభార్యకు రావలసిన 1/2వంతు పోను, మిగిలిన 1/2వాటా తండ్రికిసంక్రమించును.

4. తల్లి :-

తండ్రిలేనిచో, అతనిస్థానమును తల్లి తీసుకొనును.

5. సోదరుడు; సోదరి; బిడ్డలు:-

ఆ స్తిదారునితల్లి లేనిచో, సోదరుడు, తోబుట్టువులు, వారిబిడ్డలు వారసులు. తల్లియున్నచో ఆమెకు ఒక్క-వాటా నిచ్చి, మిగిలినదానిని మాత్రము వీరు పొందవలెను. బ్రతికియున్న ప్రతిసోదరునికి, సోదరికి ఒకవాటా. చనిపోయిన సోదరునిబిడ్డలు అందరూ కలిసి, వారి తండ్రి బ్రతికియున్న అతనికి రాతగ్గవాటా తీసికొనవలెను. అట్లే చనిపోయిన సోదరి బిడ్డలుకూడ వాటా తీసుకొందురు.

6. సన్నిహిత బంధువులు :-

పైన చెప్పబడిన వారసులు లేనిచో, సన్నిహితబంధువులు వారసులు. భార్యమాత్రము ఉన్నచో ఆమె 1/2 వాటాగాక మిగిలిన 1/2 ఆస్తి వీరు పంచుకొందురు.

స్త్రీకి వారసులు :—

పైనజెప్పినవిధముగానే వారసత్వము నిర్ణయింప బడును. పురుషుని విషయములో అతని భార్యస్థానమున స్త్రీవిషయములో ఆమెభర్తను వారసత్వ ప్రణాళికలో చేర్చుకొనవలెను.

## 7. హైందవ అవిభక్త కుటుంబము

హిందూమతములో అవిభక్తకుటుంబమునకు ప్రత్యేక స్థానము గలదు. కుటుంబములోని పురుషభాగస్థులలో పెద్ద వాడు కుటుంబయజమానుడు (భర్త)గా ఉండి వ్యవహరించును. భాగస్థులకు కుటుంబపు ఆస్తిని విభాగించుకొను హక్కు గలదు. ఈ హక్కును ఉపయోగించి, కుటుంబమును విభక్తముచేయవచ్చును.

కుటుంబపుఆస్తి ఏది ? భాగస్థులెవరు ?

అవిభక్తకుటుంబములో పుట్టుకచేతనే ఆస్తిలోహక్కు కొంతమందికి గలదు. ఆ జన్మసిద్ధహక్కు బెంగాలులో అంగీకరింపబడలేదు. కాని తక్కినచోట్ల మిటాక్షరిప్రకారము అంగీకరింపబడినది. జననముచేతనే హక్కుఎవరికిగలదు? ఏ ఆస్తియందు కలదు? పైతామహము ఆస్తియందుకలదు. ఒకనికి తండ్రి, పితామహుడు మొదలగు పైతరములవారినుండి వారసత్వముగావచ్చిన ఆస్తి పిత్రార్జితము. ఆ ఆస్తిలో అతని కుమారుడు, మనుమడు (కుమారుని కుమారుడు),ముని మనుమడు (కుమారుని కుమారుని కుమారుడు) జన్మముచేతనే హక్కుగల్గియున్నారు.




పై వంశవృక్షములో పేరయ్యకు పిత్రార్జితము కలదు. ఆ ఆస్తిలో అతనికుమారులు పెదవీరయ్య, చినవీరయ్య, చిట్టి వీరయ్యలకుపుట్టగానే హక్కుచేకూరును. పేరయ్య మనుమలకు, మునిమనుమలకుకూడ అట్టిహక్కే కలదు. వీరందరు అవిభక్త కుటుంబములో భాగస్థులు. వీరిలో ఒకరు చనిపోయిన మిగిలినవారికే ఆ ఆస్తి చెందును. భాగస్థులకు విభాగమునకు హక్కు గలదు. ఈహక్కుద్వారమున ఆ ఆస్తినిపంపకము చేసికొనవచ్చును. భాగస్థుల భార్యలకు, కుమార్తెలకు అవిభక్తకుటుంబపు ఆస్తిలో భాగము లేదు. వారికి పోషణభృతిహక్కుమాత్రము కలదు.

1956 హిందూవారసత్వపుచట్టమువలని మార్పు :-

అవిభక్తకుటుంబములోని భాగస్థుడు మరణించిన, అతనికి మొదటితరగతివారసులలోని స్త్రీవారసులు [ఉదా॥ కుమార్తె]గాని, అట్టి స్త్రీవారసులద్వారమున వారసుడైనమగ

వారసులుగాని [దౌహిత్రులు] ఉన్నచో ఆ ఆస్తి ఇతరభాగస్థులకు సంక్రమింపదు. 1956 హిందూవారసత్వపు చట్టముక్రింద వారసులకు సంక్రమించును.

స్వార్జితము:-

యాజ్ఞవల్క్యఋషి ధర్మశాస్త్రము ప్రకారము కుటుంబపు ఆస్తిలోని భాగస్థుడు పిత్రార్జితమును ఉపయోగపరచుకోకుండా ఆర్జించిన ఆస్తి అతని స్వార్జితము. [ఉదా॥ వివాహకాలములో మిత్రుడొసంగిన బహుమతి] స్వార్జితములో కుమారునికి భాగముకోరుహక్కు లేదు. 1930 లో అమలులోనికివచ్చిన 'హిందూ గెయిన్స ఆఫ్ లెర్నింగ్' చట్టము క్రింద పాండిత్యమువలన ఆర్జించిన ఆస్తి స్వార్జితము. ఎలిమెంటరీస్కూలులో చదువుకొను విద్యయుండి, ఉన్నత సాంకేతికవిద్యలవరకు అన్నివిధముల విద్యలమూలముగా వర్తకములోగాని, పరిశ్రమలలోగాని, వృత్తులలోగాని సంపాదించినది పాండిత్యముచే సంపాదించినదిగా గణింపబడును.

కుటుంబకర్తయొక్క అధికారములు :-

కుటుంబపుఆస్తి కర్తస్వాధీనములో ఉండును. కర్త ఆస్తియొక్క రాబడిని కుటుంబపుఖర్చులకు వినియోగించును. అతనికి కుటుంబపుఅవసరములనిమిత్తము ఆస్తిని అన్యాక్రాంతము చేయుహక్కు కలదు. తండ్రియే కర్తయగునచో, ఇంక కొన్ని అధికారములుకూడ అతనికి ఉండును. తన సొంతఅప్పుల తీర్మానము నిమిత్తము కుటుంబపు ఆస్తిని తండ్రి అన్యాక్రాంతముచేయవచ్చును. ఆ అప్పులు దుర్నీతి, దుష్ప్రవర్తనల ఫలితముగా నున్నచో, తండ్రికి ఈ అధికారము

ఉండదు. కర్త మితవ్యయము చేయవలెననిగాని, జమ ఖర్చు పద్దులు వ్రాసియుంచితీరవలెననిగాని నియమములేదు. భాగస్థులకు తృప్తికరముగా లేనిచో విభక్తులు కావచ్చును..

విభాగము :-

(1) ఆస్తులవిభాగము : విభాగమును కోరినపుడు ఉన్న కుటుంబపుఆస్తిని పంచుకొనవలెను. ఒకభాగస్థుడు తనభాగమును పంచుకొని, విభక్తుడైనను తక్కినభాగస్థు లేకకుటుంబముగా నుండవచ్చును. పై వంశవృక్షములో పేరయ్య చనిపోగా, అతనిస్వార్జితము కుమాళ్ళకు ముగ్గురకు సమముగా వచ్చును. ఈ ఆస్తి కుమారులచేతిలో పిత్రార్జితముకదా. దానియందు చిట్టిబాపయ్య తనభాగమును కోరిన, అతనికి ఎంత ఆస్తి వచ్చును? ఆస్తిని ఎన్ని పురుషసంతతి శాఖలు గలవో అన్నిభాగములను చేయవలెను. విభాగముకోరిన భాగస్థుడున్నశాఖకు ఒకభాగము వచ్చును. చిట్టిబాపయ్య ఉన్న శాఖకు 1/3 భాగము వచ్చును. ఆశాఖలోఉన్న తండ్రి కొడుకులు సమానముగా పంచుకొందురు. కనుక, చిట్టిబాపయ్యకు 1/6 భాగము వచ్చును. సుబ్బయ్యభాగ మెంత? పెదవీరయ్య భాగము 1/3 లో పెదవీరయ్య, అతని కుమారుడు పెదబాపయ్య చెరిసగము తీసికోవలెను. పెదబాపయ్య శాఖభాగము 1/6. దీనిలో పెదబాపయ్య! అతనికుమారుడు సుబ్బయ్య చెరిసగము తీసికొందురు. కనుక సుబ్బయ్య భాగము 1/12. ఈవిధముగా ఏభాగస్థుని భాగమైనను తెలిసికొనవచ్చును.

2. అప్పుల పంపకము :—

ఆస్తి పంపకము చేసికొనునపుడు కుటుంబపు అప్పులను తీర్చుటకు ఏర్పాట్లుచేయవలెను. అప్పులవారి హక్కులు విభాగమువలన భంగపడవు. విభక్తులైన భాగస్థులయొద్ద ఉన్న కుటుంబపు ఆస్తులనుండి తమకు రావలసిన మొత్తము అప్పులవారు రాబట్టుకొనవచ్చును. తండ్రియొక్క సొంతఅప్పులను, దుర్నీతి దుష్ప్రవర్తనలవలన చేయబడినవికానిచో, అతని కుమారులకు లబ్ధమైన భాగములనుండికూడ అప్పులవారు రాబట్టుకొనవచ్చును. విభాగానంతరము తండ్రిచే చేయబడిన అప్పులకు విభక్తకుమారులు బాధ్యులుకారు.

## 8. మరణశాసనము (విల్లు)

చట్టము :—

హిందువులకు :—1. ఇండియన్ సక్సెషన్ ఆక్టు, 1925 (ఇండియా వారసత్వపు శాసనము)

2. హిందూ సక్సెషన్ఆక్టు, 1956 (హిందువుల వారసత్వపు శాసనము)

క్రైస్తవులకు : ఇండియా వారసత్వపుశాసనము 1925.

మహమ్మదీయులకు: ఖొరాను(మహమ్మదీయమతగ్రంథము)

మరణశాసనమునకు నిర్వచనము :—

చనిపోయినతర్వాత తనఆస్తులను ఏవిధముగా వినియోగింపవలెనో నిర్దేశించు న్యాయసమ్మతమగు ప్రకటనకు 'మరణశాసనము' లేక 'విల్లు' అని పేరు. మరణశాసనములో ఆ విల్లు

అనులుజరుపు హక్కుగలవారిని నిర్ణయింపవచ్చును. విల్లు క్రింద ఆస్తి సంక్రమించువారిని రిక్తగ్రాహి అందురు. వారికి వచ్చు ఆస్తి ఉత్తరభాగమందురు.

విల్లువ్రాయు అధికారముగలవారు :-

వ్యవహారదక్షత కలిగి, మనస్సు స్థిమితముగాగలవారు ఎవరైనను విల్లును వ్రాయవచ్చును. పిచ్చిపట్టినవాళ్ళ కప్పు డప్పుడు మనస్వాస్థత యుండవచ్చును. అట్టిసమయములందు వారు విల్లును వ్రాయవచ్చును.

విల్లుచే అన్యాక్రాంతనుచేయదగిన ఆస్తి :

హైందవులు తమ స్వార్జితపుఆస్తికి మరణశాసనము వ్రాసికోవచ్చును. అవిభక్తకుటుంబములోని భాగస్థులు ఇతర భాగస్థులు ఉన్నచో, ఆ అవిభక్తభాగమునకు విల్లు వ్రాయ లేరు. 1956తర్వాత హిందూవారసత్వపుచట్టముక్రింద కొన్ని సందర్భములలో (ఉదా॥ కూతురు ముందుగా చచ్చిపోయిన, కూతురి కుమారుడున్నపుడు) అవిభక్తకుటుంబముఆస్తికికూడ విల్లు వ్రాయవచ్చును.

మహమ్మదీయులలో అప్పులు, అంత్యక్రియల ఖర్చులు పోను, శేషించిన ఆస్తిలో 1/3వంతు ఆస్తికి మాత్రము విల్లు వ్రాయవచ్చును. అంతకుమించినచో ఆస్తిదారుడు చనిపో యినతర్వాత వారసులు అంగీకరించినచో ఆ హెచ్చు ఉత్తర దానము చెల్లును.

విల్లువ్రాయుహక్కుపై ఇతర అంశములు :-

మహమ్మదీయులలో వారసుడు అనురిక్త భాగికారాడు.

అట్లు అగుటకు ఇతరులవారసులు ఆ స్త్రీదాయుని మరణానంత రము అంగీకరింపవలెను. హిందువులకు, క్రైస్తవులకు ఈ ఆంక్ష వర్తింపదు. వీరు తమవారసులకుకూడ విల్లుద్వారమున ఆ స్తిని ఇయ్యవచ్చును.

విల్లువ్రాయుపద్ధతి :-

మహమ్మదీయులు లిఖితపూర్వకముగాగాని, నోటి మాటద్వారమునగాని మరణశాసనమును ఏర్పాటుచేయ వచ్చును. ఇతరమతస్థులు (1) సాధారణమైన విల్లు లిఖిత పూర్వకముగా ఉండవలెను. కనీసము ఇద్దరుసాక్షులు కావ లెను. విల్లుపై చేవ్రాలుగాని, గుర్తుగాని యుండవచ్చును. తనతరఫున ఇతరునిచే తనకుగా చేతివ్రాలు చేయింపవచ్చును. (2) అసాధారణమైనవిల్లును యుద్ధములో పనిచేయునపుడు సైనికుడు, వైమానికుడుకాని, నావికుడు సముద్రముమీాద పయనించునపుడుగాని గూాపొందింపవచ్చును. తనదస్తూరి తోనే వ్రాసిన విల్లుపై సంతకముకాని సాక్షిసంతకముగాని అవసరములేదు. ఎవరిచేత వ్రాయబడినను అతనిసంతకము ఉన్నచో సాక్షిసంతకము అనావశ్యకము. ఇద్దరు సాక్షుల యెదుట తనఅనంతరము ఆ స్తిని ఏవిధముగా వినియోగింప వలెనో చెప్పినచో అదే మరణశాసనముగా ఎంచవచ్చును.

నిష్పాదనకర్త (ఎగ్జిక్యూటర్) :-

విల్లునామాను అమలుజరుపుట నిష్పాదనకర్తయొక్క విధి. నిష్పాదనకర్తగా విల్లులో ఉదాహరింపబడినవారు ఆ పని అంగీకరింపకపోవచ్చును. కాని, అంగీకరించి విల్లు భంగమును

కాదు. కోర్టువారు విల్లును అమలుజరుపుటకు "ఎడ్మినిస్ట్రేటర్" ను నియమింతురు.

నిష్పాదనకర్తను, ఎడ్మినిస్ట్రేటరును విల్లు వ్రాసినవారి స్వీయస్థానీయులు అందురు. వీరు విల్లునామా వర్తించే ఆస్తిని స్వాధీనపరచుకొని, విల్లుదారుని అప్పులు తీర్చి, మిగిలిన దానిని మరణశాసనమున కనుగుణముగా రిక్తభాగులకు పంచిపెట్టుదురు.

ఒక నిష్పాదనకర్తనుగూర్చిన పూర్వగాథ :-

ఒక జమీందారునకు మైనరుకుమారుడు మాత్రము గలడు. అతడుచనిపోవుచు మరణశాసనములో తనమిత్రుడగు "ఆశపోతు శరభయ్యను" నిష్పాదనకర్తగా ఏర్పాటుచేసెను. మరణశాసనములో ఇట్లుండెను. "ఈ యావదాస్తి నా స్వార్జితము. నా గురువుగారు ఆశీర్వాదపూర్వకముగా ఒకరూపిక నిచ్చిరి. అప్పటినుండి నా అదృష్టరేఖ పండి, ఈ జమీందారీని సంపాదించితిని. ఈ విల్లునామద్వారమున ఆ అదృష్ట రూపికను, యావదాస్తిని ఒసగుచున్నాను. నా కుమారునికి మైనారిటీ తీరేవరకు నా మిత్రుడు శరభయ్య ఆస్తిని జాగ్రత్త పరచవలెను. మైనారిటీ తీరగానే శరభయ్య తనకిష్టమువచ్చినది నా కుమారుని కిచ్చి, తక్కినది తాను నుంచుకొనునది. ఇది నా మనస్ఫూర్తిగా వ్రాసిన మరణశాసనము." శరభయ్య జాగ్రత్తగా ఆస్తిని వృద్ధిచేసెను. పిల్లవానికి మైనారిటీ తీరగానే "అబ్బాయి! నీ తండ్రిగారి విల్లుప్రకారము నా యిష్టమువచ్చినది నీకిచ్చి మిగిలినది నేను తీసికొనవచ్చును. నీ తండ్రిగారి అదృష్టసాప్యమును నీకు ఇచ్చుచున్నాను.

తక్కినది నేను స్వాహాచేస్తాను." అని చెప్పెను. జమీందారు కుమారుడు కోర్టులో న్యాయ మభ్యర్థించెను. జడ్జీగారు ఇట్లు తీర్పునొసగిరి: "విల్లుప్రకారము శరభయ్య 'తనకిష్టమైనది' జమీందారుకుమారునకిచ్చి మిగిలినది తాను తీసికొనవలెను. జమీందారీని తాను స్వాహాచేయదలచినందున, అదే 'తన కిష్టమైన'దని విశదమగును. కనుక అతనికిష్టమైన జమీందారీ ఆస్తిని పిల్లవానికిచ్చి మిగిలిన అదృష్టగూపికను తాను ఉంచుకొనవలెను."

## మూడవభాగము

# ఆస్తులు : అన్యాక్రాంతములు

## 1. విక్రయము

నిర్వచనము :-

విక్రయమనగా మూల్యమునకు స్వత్వమును అన్యాక్రాంతముచేయుట. మూల్యము పూర్తిగా చెల్లింపబడవచ్చును. లేదా చెల్లించుటకు ఒప్పందము జరుగవచ్చును. లేదా, కొంత చెల్లింపబడి, మిగిలినదానికి ఒప్పందము జరుగవచ్చును.

విక్రయపద్ధతి :-

స్థావరరూపకమైనఆస్తి 100 రూ॥గాని అంతకుమించిగాని విలువగలది రిజిష్టరుదస్తావేజుద్వారముననే విక్రయింపనగును. నూటికి తక్కువవెలగలదానిని రిజిష్టరుపత్రమువలనగాని, ఆ స్తిని స్వాధీనముచేయుటవలనగాని విక్రయము జరుపవచ్చును. రామయ్య భీమయ్యకు 5 సం॥లకు భూమిని కౌలునకిచ్చినాడు, భూమివెల 50రూ॥ మాత్రమే. రామయ్య రిజిష్టర్ దస్తావేజు లేకుండ విక్రయింపగలడా? వీలులేదు. భూమిని స్వాధీనపరచుటకు వీలుకానందున రిజిష్టరుదస్తావేజే శరణ్యము.

వేరే ఒప్పందములేనప్పుడు అమ్మినవానిహక్కులు, విధులు :-

(1) విక్రయపుదస్తావేజు అమలులోనికి వచ్చువరకు :-

ఆస్తిని చూచినమాత్రాన తెలియని ముఖ్యమైన అంతర్లీన లోపములను అమ్మినయాతడు కొనువానికి తెలియ

జేయవలెను. తన ఆస్తిహక్కు దస్తావేజులను చూపి, తనకు అమ్మదగ్గ హక్కు కలదని చూపవలెను. ఈ వెల చెల్లింపగానే విక్రయపుదస్తావేజును పూర్తిచేయవలెను. స్వామ్యము కొన్న వానికి చెందువరకు మక్తాను లేక అద్దెను తానే తీసికొన వచ్చును.

(2) విక్రయపుదస్తావేజు అమలులోనికివచ్చినఅనంతరము :-

అమ్మినవారు ఆస్తిని కొన్నవారికి స్వాధీనపరచవలెను. అమ్మినతారీఖువరకు ఆస్తిపై పన్నులను చెల్లింపవలెను. ఆస్తిపై తనఖాలుండి, విక్రయము తనఖాలకు లోబడకుండా జరిగినచో ఆ తనఖాలకు విక్రయదారుడు చెల్లింపవలెను. తాను అమ్మినహక్కు తనకుండి, తనకు దానిని అన్యాక్రాంతముచేయు అధికారముగలదని ఒప్పందము (కొవెనెంట్)చేయవలెను. వెలఅంతయు ముట్టగానే ఆ స్తికిచెందిన దస్తావేజులను కొన్నవారికియ్యవలెను. కొంత వెల ముట్టనిచో, వెలను రాబట్టుకొనుటకు అమ్మినవారికి అమ్మబడిన ఆస్తిపై "ఛార్జి" హక్కుండును. దీనినే 'రావలసినవిక్రయధనపు ఛార్జి' యని వ్యవహరింతురు.

వేరే ఒప్పందములేనిచో, కొన్నవానిహక్కులు; విధులు :-

(1) విక్రయము పూర్తికానంతవరకు :-

ఆస్తివిలువను అధికముచేయునట్టియు, కొనువానిహక్కునకు సంబంధించినసంగతులు అతనికి తెలియనిచో, వానికి తెలిసియున్న కొనువారు వానిని బహిరంగపరచవలెను. ఒక భూమిని భీమయ్య అమ్ముచున్నాడు. ఆ భూమిలో ఒక బొగ్గు గని యున్నదని కొనువానికి తెలియును, భీమయ్యకు ఈసంగతి

తెలియదు. కొనువాడు భీమయ్యకు చెప్పవలెనా ? భూమిలో భీమయ్యకున్న హక్కుకు సంబంధించినవిషయము కానందున కొనువారికి చెప్పవలెననేవిధిలేదు. భీమయ్యకు ఆ ఆస్తిలో సంపూర్ణమైన హక్కుండగా తనకు మరణానంతమువరకు మాత్రమే దానిని ఉపయోగించుకొను హక్కు గలదని అతడు తలచుచున్నాడు. కొనువానికి వాస్తవపరిస్థితి తెలియును. అతడు ఈసంగతి అమ్మువానికి తెలుపవలెనా ? ఈ సంగతి భూమిలోని హక్కునకుసంబంధించినదిగాన తెలుపవలెను.

కొన్నవారు సకాలములో విక్రయధనమును చెల్లింపవలెను. మరలవిక్రయపుదస్తావేజునువ్రాయించి, అమ్మినవారిచే రిజిష్టరుచేయించుకొనుటకు ఇయ్యవలెను.

బయానా :-

విక్రయమునకు ఒప్పందముజరిగినపుడు సాధారణముగా కొనువారు కొంతపైకమును బయానాగా చెల్లించెదరు. తాము తప్పక క్రయమును పూర్తిచేయించికొందుమని తెలుపుటకు చెల్లించు సొమ్ము బయానా. కొనువారితప్పులేకుండ విక్రయము పూర్తిగానిచో, బయానాను వారికివాపస్ చేయవలెను. బయానాను తిరిగి రాబట్టుకొనుటకు ఆ ఆస్తిపై "ఛార్జి" యుండును. కొనువారిలోపమువలన విక్రయము పూర్తిగానిచో, బయానాను తీసుకొన్నవారు రద్దుపఱచవచ్చును. బయానా వాపస్ఇయ్యవలసినపనిలేదు. బయానా కాకుండ విక్రయధనముక్రింద కొంతసొమ్మును ఇచ్చినచో, దానిని విక్రయము పూర్తికానిచో తిరిగి యిచ్చివేయవలెను.

తనతప్పులేదని రుజువుచేసుకొనినచో, ఈ మొత్తమునకు ఆ స్తిపై "ఛార్జి" యుండును. దీనినే "కొనువాడు నుంచుగా ఇచ్చిన విక్రయధనపుఛార్జి" అందురు.

(2) విక్రయము పూర్తిఅయినతర్వాత :-

కొన్నవాడు ఆస్తి నాశనమైన లేక భగపడిపోయిన వచ్చునష్టమును భరించుకొనవలెను. ఆస్తిపై చెల్లింపవలసిన పన్నులను చెల్లింపవలెను. ఆస్తివలననచ్చు ఫలితమును లేక అద్దెను తీసికొనవచ్చును. ఆస్తిపై గల తనఖా వగైరాలను, వానికిలోబడి ఆస్తిని ఖరీదుచేసినచో, చెల్లింపవలెను.

లాభదాయక క్రయసిద్ధాంతము :-

పేరయ్యకు 20 ఎకరముల ఆస్తి గలదు. దానివిలువ 60,000 రూ॥లు. దానిపై 30,000కు తనఖా కలదు. పేరయ్య యీ ఆస్తిని వీరయ్యకు అమ్మెను. తనఖాకు లోబడకుండ అమ్మిన పేరయ్యకు 60,000 రావలెను. కాని, అందులో 30,000 వీరయ్య తనఖాను పేరయ్యతరపున చెల్లించుటకు ఉంచుకొనవచ్చును. పేరయ్యకు ముట్టినది 30,000. ఏకారణమువలనైన తనఖారద్దయిన, దానిని చెల్లించుటకు వీరయ్య తనవద్ద ఉంచుకొన్న 30,000ను పేరయ్యకు ఇయ్యవలసి యుండును. తనఖాకులోబడి అమ్మినపక్షములో పేరయ్యకు 30,000 వచ్చును. తనఖా చెల్లించుకొనుబాధ్యత వీరయ్యకు ఉండును. తనఖా చెల్లకపోయిన లేక గవర్నమెంటువారి శాసనముచే రద్దయినచో ఆలాభము వీరయ్యదే. పేరయ్యకు 30,000 ఇయ్యనవసరములేదు. ఇది వీరయ్యకు తలవనితలంపుగా వచ్చినలాభము. ఇదే లాభదాయక క్రయసిద్ధాంతము.

## 2. దానము

నిర్వచనము :-

ప్రతిఫలశూన్యమగు అన్యాక్రాంతము దానము.

పద్ధతి :-

స్థావరరూపమగు ఆస్తిని దానముచేయుటకు రిజిష్టరు దస్తావేజు అవసరము. కనీసము ఇద్దరుసాక్షులు సంతకములు చేయవలెను. దాత బ్రతికియుండగనే ప్రతిగృహీతచేగాని, అతనితరఫునగాని, అంగీకరింపబడిన దానము పూర్తి అగును. దానపత్రము వ్రాయబడి, దాతచే సంతకముచేయబడి, ప్రతిగృహీతచే అంగీకరింపబడినది. రిజిష్టరీకాలేదు. ఈ సందర్భములో దాత మనస్సుమార్చుకొని దానమును త్రిప్పివేయవచ్చునా ? వీలులేదు. ప్రతిగృహీత ఒప్పుకొనగానే దానము పూర్తి అయినది. కాబట్టి మాటత్రోసివేయుటకు వీలులేదు. దాతచనిపోయినను రిజిష్టరీ తర్వాత చేయించుకొనవచ్చును. ప్రతిగృహీత అంగీకారముతో దానము సమాప్తమగును. దానపత్రమును 6 నెలలలోగా రిజిష్టరీచేయించుకొనవచ్చును.

ప్రతిగృహీత అనంగీకారము :-

దానము పేరయ్యకు వీరయ్యకును జేయబడినది. పేరయ్య అంగీకరించలేదు. వీరయ్య అంగీకరించినాడు. దానము చెల్లునా లేదా? వీరయ్య అంగీకరించిన అర్ధభాగము అతనికివచ్చును. పేరయ్యకురాదు. కనుక దానము పేరయ్య భాగమువరకే చెల్లదు.

దానముచేయబడిన ఆస్తిని తిరిగి పొందుట :-

తన యిచ్ఛానుసారముగా తిరిగి పొందవచ్చునను షరతుతో యిచ్చు దానము చెల్లదు. పేరయ్య 4 ఎకరములు దానముచేయుచు, అందు 2 ఎకరములు తనయిష్టము వచ్చినపుడు తిరిగి తీసికొనుషరతుపెట్టెను. అప్పుడు దానము 2 ఎకరములకుమాత్రము చెల్లుబడిఅగును. తిరిగి తీసికొను షరతు మేరకు దానము చెల్లదు.

దానమును త్రోసివేయుట :-

అక్రమమైన ఒత్తిడివల్లగాని, అబద్ధాలుచెప్పుటవల్లగాని, దాతప్రతిగ్రహీతల ఇద్దరిపొరపాటువలనగాని, దానము జరిగినదానిని త్రోసివేయవచ్చును. దాతయొక్క ఇచ్ఛాశక్తికి అతీతమగు ఏదేని నిర్దిష్టసంఘటన జరిగినచో, దాతకు తిరిగి ఆస్తి రావలెననుషరతు చెల్లును. ఆ షరతుప్రకారము తిరిగి ఆస్తిని దాత పొందవచ్చును. పేరయ్య వీరయ్యకు ఆస్తినిచ్చి, వీరయ్యకు సంతానములేనిచో తనకు తిరిగి ఆస్తి రావలెనని షరతుపెట్టెను. వీరయ్య నిస్సంతతిగాచనిపోయెను. పేరయ్యకు ఆస్తి తిరిగివచ్చును.

## 3. వినిమయము

నిర్వచనము :-

ఒక ఆస్తియొక్కస్వత్వమును వేరొక ఆస్తిస్వత్వమే ప్రతిఫలముగా బదలాయింపుచేయుట వినిమయము. ప్రతిఫలము డబ్బుగామాత్రమే యుండరాదు. ప్రతిఫలము డబ్బే అయిన సిద్ధించునది విక్రయమగును; వినిమయము కాదు.

పద్ధతి :-

విక్రయమునకు పైన చెప్పినపద్ధతినే వినిమయమునకు కూడ ఉపయోగింపవలెను.

హక్కులు; విధులు :-

తానుఇచ్చు ఆ స్తిలో వినిమయకర్తకు అమ్మువాని హక్కులు, విధులు నుండును. తానుపొందు ఆ స్తిలో కొను వానిహక్కులు, విధులు నుండును.

## 4. కౌలునకు లేక బాడిగకిచ్చుట

నిర్వచనము :-

కౌలు లేక బాడిగకిచ్చుట అనగా ఆ స్తిని అనుభవించు హక్కును మూల్యమునకు ఇతరునికి యిచ్చుట. మూల్యము ఒకే మొత్తముగా చెల్లింపవచ్చును. లేదా నియమితకాల ములో (నెల నెలకు, లేక సంవత్సరమునకొకసారిగా) దఫాల వారీగానైన ఇవ్వవచ్చును.

వివిధములైన కౌళ్ళు :-

(1) శాశ్వతకౌలు.

(2) నియమితకాలపుకౌలు. ఉదా॥ పదిసంవత్సరాలకు

(3) ప్రాతిమాసికమైన లేక ప్రాతిసాంవత్సరికమైన కౌలు. వ్యవసాయమునకు, సామానులుచేయుటకు కౌలునకు తీసి కొన్నచో ప్రాతిసాంవత్సరికమైన కౌలుగ పరిగణింపబడును. ఇతరములైన పనులకు (ఉదా॥ కాపురమునకు) తీసికొనినచో ప్రాతిమాసికమైన కౌలుగానే పరిగణింపబడును.

(4) ఐచ్ఛికమైనకౌలు: ఎప్పుడైనను ఈ కౌలును నిల్పివేయవచ్చును. కౌలుదారుడుగాని, కౌలుకిచ్చినవారు గాని ఒకరు రెండవవారికి కౌలు ఇంక అవసరములేదని తెల్పినచో కౌలు నిల్చిపోవును.

(5) కౌలుఐపోయినను స్వాధీనములో ఉంచుకొన్నందున ఉద్భవించు కౌలు. నియమితకాలపుకౌలులో నిర్దిష్ట కాలము పూర్తికాగానే ఆ స్తికామందునకు కౌలుదారుఆ స్తిని స్వాధీనముచేయవలెను. అట్లుచేయక తనస్వాధీనములోనే యుంచుకొని, బాడిగ చెల్లించికాని యితర విధముగాగాని ఆ స్తికామందుయొక్క అంగీకారముపొందిన, కౌలు పొడిగింపబడును. పొడిగింపబడిన కౌలు ప్రాతిమాసికమైన లేక ప్రాతిసాంవత్సరికమైనదిగా ఉండును. వ్యవసాయమునకు లేక సామానులు చేయుటకు నిర్దేశించినకౌలు అయినచో ప్రాతిసాంవత్సరికము; లేనిచో ప్రాతిమాసికము అని గ్రహింపవలెను.

పద్ధతి :-

బాడిగదస్తావేజు భూస్వామి, బాడిగకుతీసికొన్నవారు కలిసి వ్రాసికొనవలెను. అది ప్రాతివార్షికముగాని, ఒక సంవత్సరమునకు మించిన నియమితకాలపుదిగాని, సంవత్సరమునకు బాడిగ యింత అని నిర్ణయించునదిగాని అయినచో రిజిష్టరు దస్తావేజు ఆవశ్యకము. ఈ మూడురకములది కానిచో, రిజిష్టరుదస్తావేజు అక్కరలేదు. ఆ స్తిని స్వాధీనము చేసిన చాలును. ఈ పైనచెప్పినపద్ధతి వ్యవసాయసంబంధమైన కవుళ్ళకు వర్తింపదు. గవర్నమెంటువారు గజెట్‌లో ప్రక

టించి యీ పద్ధతిని వ్యావసాయకమైన కవుళ్ళనుకూడ వర్తింప జేయవచ్చును.

కౌళ్ళను అంతమొందించుట :-

(1) నియమితకాలముకాగానే: నియమితకౌలపుకౌలు గడువుకాగానే ముగియును. ఒక కౌలు 1-1-1950 న 10 సంవత్సరములకు ఇవ్వబడినది. కౌలులో 1-1-50 తారీఖున కౌలు ప్రారంభించినట్లు వ్రాసిన, ఆ తారీఖును వదలవలెను, కనుక కౌలు 1-1-1960 (అర్థరాత్రి)న ముగియును. ఫలానా తారీఖున ప్రారంభమగునని వ్రాయనిచో, 1-1-50ని కూడ కౌలుగడువులో గణింపవలెను. అప్పుడు కౌలు 31-12-59 (అర్థరాత్రి)కి ఆఖరగును.

(2) నోటీసువల్ల: ప్రాతిమాసికమైనకౌలు 15 రోజుల నోటీసుతో అంతమొందింపవచ్చును. ప్రాతిసాంవత్సరికమైన కౌలును అంతమొందించుటకు 6 నెలల నోటీసు కావలెను. ఒక ప్రాతిమాసికమైనకౌలు 2-6-1950 న మొదలయ్యెను. మొదటి నెల 1-7-1950 కి ముగియును. 2-7-50న మరియొక నెల ప్రారంభమగును. ఈవిధముగా ప్రతినెలా 2 వ తారీఖున కౌలుకు నెల ప్రారంభమగును. 1-2-1955 న ఇంటియజమానుడు అద్దెకున్నవారిని 2-3-1955 కు ఖాళీచెయ్య వలెనని నోటీసునిచ్చెను. ఈ నోటీసు సరియైనదా ? కాదు. ఏలనన నోటీసు కౌలు నెల ముగింపుతో అంత మొందింపవ లెను. కౌలు నెల 1 తారీఖున ముగింపుకనుక ఏ నెలలోనైనా 1 వ తారీఖున అంతమొందింపవలెనేకాని, మరియొక తేదీని అంత మొందించుటకు వీలులేదు.

స్థానిక చట్టాలు :-

చాల దేశములలో భూస్వామికి, కౌలుదార్లకు సంబంధించిన చట్టాలు గలవు. ఇష్టమువచ్చినపుడు కౌలుదార్లను తొలగించుహక్కు, అద్దెను పెంచుహక్కు భూస్వాములకు లేకుండా జేయుటనే ఈ చట్టముల ఉద్దేశము. ఈ చట్టములు కౌలుదారును బలపఱచినవి.

## 5. తనఖా (తాకట్టు)

నిర్వచనము :-

తనఖాయొక్క ముఖ్యలక్షణములు :

(1) స్థావరరూపమగు ఆస్తిలో కొంతహక్కు తనఖాదారుపరము చేయబడును.

(2) ఆస్తి ఫలానిది అని నిర్దేశింపవలెను.

(3) సాధారణముగా తనఖాఆస్తి అప్పునుతీర్చుటకు హామీగా ఉండును.

తనఖాప్రయోజనము :-

ప్రామిసరీనోటుమీాద చేయబడిన అప్పును రాబట్టుకొనుటకు అప్పు ఇచ్చినవాడు కోర్టులో డిక్రీ తెచ్చుకొని, అప్పుచేసినవాని ఆస్తిపై అసలు జరిపి తనకు రావలసిన బాకిని వసూలుచేసికొనును. బాకీదారుడు తన ఆస్తిని అన్యాక్రాంతముచేసినచో అప్పును రాబట్టుకొనుటకు అవకాశము లేకపోవచ్చును. బాకీదారు దివాలాతీసిన అప్పు ఇచ్చినవాడు నష్టపడును. ఇటువంటి ఇబ్బందులు లేకుండ

టకు అప్పుఇచ్చునపుడు కొంతఆ స్తినిహామీగాతీసుకొందురు. తనఖావలన ఇటువంటి హామీచేకూరును. తనఖాఆ స్తి తనఖాదారు అప్పునుతీర్చుటకు నిర్దేశింపబడును. ఈవిధముగా తనఖాపై అప్పుఇచ్చినవారికి రక్షణ కల్గును.

తనఖాల భేదములు :-

అనేకవిధములైన తనఖాలు కలవు. మూడింటిని ఇచ్చట ప్రస్తావించెదము.

(1) అస్వాధీనపుతనఖా (మామూలుఆయకము) (సింపుల్ మార్ట్ గేజ్) :- ఈ రకపు తనఖాలలో ఆ స్తి అప్పుతీసికొనినవాని స్వాధీనములోనేయుండును. తనఖాదారు వసూలుచేయుటకుహక్కు. అవసరమగుచో ఆ స్తిని కోర్టుద్వారమున వేలము వేయించుట, వేలము సొమ్ము బాకీకి సరిపోకపోయిన తనఖాదారు తనఖాపెట్టినవారిపై డిక్రీనిపొంది సదరు ఇతర ఆస్తులనుండి రాబట్టుకొనవచ్చును. ఇటువంటి 'మామూలు ఆయకము'నకు రిజిష్టర్ దస్తావేజు అవసరము. ఇద్దరుసాక్షుల సంతకములు దస్తావేజుమీద నుండవలెను. తనఖాఆ స్తిని కోర్టుద్వారమున వేలమువేయించు పరిహారమునకు అప్పును తీర్చవలసిన తేదీనుండి 12 సం॥లలోగా దావా వేయవచ్చును. ఇతరమైనఆస్తులనుండి రాబట్టుకొనుటకు దావాచేయుటకు 6 సం॥ మాత్రమే గడువుకలదు.

(2) స్వాధీనపుతనఖా :-

తనఖాఆస్తి తనఖాదారునకు స్వాధీనము చేయబడును. తనఖాదారే దానిఫలితమును తీసికొనును. ఈ రాబడిని ఒప్పందము ప్రకారము వడ్డీక్రింద, లేక అసలు క్రింద,

లేక కొంత వడ్డీక్రింద, కొంత అసలు క్రింద జమ కట్టు యేర్పాటు వ్రాసికొనబడును. రాబడి మొత్తమును వడ్డీక్రింద గాని, అసలులో కొంత నిర్ణీతభాగమునకు వడ్డీకిని, అనిగాని ఏర్పాటున్నచో తనఖాదారుడు రాబడికి జమ ఖర్చుల పట్టికను, లెక్కలను జాగ్రత్తగా నేర్పరచి చూపవలెను. తనఖాదారుడు ఆస్తిని జాగ్రత్తగా అజమాయిషీచేసి, అద్దెలను వసూలుపరచి, గవర్నమెంటువారలకు చెల్లింపవలసిన పన్నులను చెల్లించి, ఆస్తిని పరిరక్షింపవలెను. తనకు రావలసిన బాకీ తీరగానే ఆ స్తిని భూస్వామికి స్వాధీనముచేయవలెను. రాబడి తన చేతిలోనే ఉన్నందున స్వాధీనపు తనఖాదారుడు కోర్టుకుపోవలసిన అగత్యములేదు. ఆస్తి స్వాధీనముకానిచో, తనఖాదారుడు ఆస్తిని స్వాధీనముచేసికొనుటకు దావా వేయవచ్చును. అంతేకాక, వెంటనే తనఖామొత్తమును రాబట్టుకొనుటకు దావావేయవచ్చును.

(3) హక్కుదస్తావేజులను కుదువపెట్టు తనఖా :-

మద్రాసు, బొంబాయి, కలకత్తా, నగరములలోను, గవర్నమెంటుచే గెజిటులలో ఈ నిమిత్తము ప్రచురింపబడిన ఇతరపట్టణములలోను (ఉదా॥ అహమ్మదాబాద్, కాన్పూర్ కోయంబత్తూరు, గుంటూరు, మధుర, మచిలీపట్టణము, అలహాబాద్, ఆగ్రా మొదలగు ఇతరపట్టణములలో) మాత్రమే ఇట్టి తనఖాలు అనుమతింపగలవు. ఋణగ్రస్తుడు ఋణదాతకుగాని, అతని ప్రతినిధికిగాని తనహక్కును స్థాపించు దస్తావేజులను, ఆ దస్తావేజులకు చెందిన ఆస్తిపై తనఖాపెట్టు ఉద్దేశ్యముతో ఇచ్చినచో తనఖా సిద్ధించును. దీనిమూలముగా చెల్లని

లేకుండ, తనఖాపెట్టవచ్చును. నోటిమాటలతోగాని, స్పష్టపరచకుండ ఈరకపు తనఖా సిద్ధించునుగాన వల్లనేయుండును.

### తనఖాపెట్టినవాని హక్కులు

తనఖా ఆస్తివిమోచనపుహక్కు :-

తనఖాసొమ్ము ఇయ్యవలసినకాలము రాగానే, తనఖా ఆస్తిని తనఖానుండి విమోచనను చేయుహక్కు కల్గును. ఆ సొమ్మును చెల్లింపగానే తనఖాకు సంబంధించిన హక్కులు రద్దగును. ఇదే తనఖాఆస్తి విమోచనపుహక్కు. ఈ హక్కును భంగపఱచు ఒడంబడికలు చెల్లనేరవు. అట్టి ఒడంబడికలకు ఉదాహరణములు కొన్ని ఇచ్చట పొందుపఱుపబడినవి.

(1) తనఖావిమోచనవిరోధకపు ఒడంబడికలు :-

తనఖాపెట్టినవారు మాత్రమే ఆ ఆస్తిని తనఖానుండి విడిపింపవచ్చును. అతని వారసులకుగాని, స్థానీయులకుగాని ఈ హక్కు ఉండరాదు. ఇటువంటి ఒడంబడిక తనఖాలోఉన్నను అది చెల్లదు. వారసులు, స్థానీయులు తనఖాబాకీని తీర్మానము చేయవచ్చును.

(2) తనఖాపెట్టినవారు ఇంకొకరివద్ద అప్పుతీసికొనకుండ సొంతడబ్బుతోనే తనఖాను తీర్మానముచేయవలెనను ఈ ఒడంబడిక తనఖాలో ఉన్నను చెల్లదు. వేఱుగా అప్పుతెచ్చికొనియైన తనఖాబాకీని తీర్చవచ్చును.

(3) తనఖాఆస్తిని అమ్మకుండ తీర్చవలెనను ఈ ఒడంబడికకూడ చెల్లదు. అట్టి ఒడంబడికయున్నను తనఖా ఆస్తిని అమ్మి తీర్చవచ్చును.

(4) తనఖాదారునికి తీర్చినను తనఖాపెట్టినవారు కొంత ఆస్తిని మాత్రమే విడిపించుకొని, మిగతఆస్తిని తనఖాదారునకు వదలవలెనను ఈ ఒడంబడికయు చెల్లదు.

(5) తనఖామొత్తమును తనఖాలో నిర్దేశించినరోజున తీర్పనిచో, 10 సం॥లవరకు తీర్చుహక్కుండదను ఇట్టి ఒడంబడికయు చెల్లదు. తనఖాలో నిర్దేశించినరోజున చెల్లింపక పోయినను దానిని చెల్లించుహక్కు పోదు. 60 సం॥లలో ఎప్పుడైనను చెల్లింపవచ్చును. ఈ హక్కును భంగపరచు ఒడంబడిక చెల్లదు.

ఈ తనఖావిమోచన నిరోధకపు ఒడంబడికలను త్రోసివేయు సిద్ధాంతమునలన తనఖాపెట్టినవానిహక్కును కోర్టువారు కాపాడుచున్నారు. తనఖా ఆస్తివిమోచనపు హక్కును అప్పు తీర్చవలసిన కాలమునుండి 60 సం॥లలో ఉపయోగించుకొనవచ్చును.

ఒకసంశయము : తనఖాదారుడు తనఖాసొమ్మును తీసికొనుటలేదు. లేక కనబడుటలేదు. ఈ పరిస్థితిలో వడ్డీ పెరుగకుండ అరికట్టుటకు తనఖాపెట్టినవారు ఏమిచేయవలెను ?

సమాధానము : తనఖాసొమ్మును కోర్టులో తనఖాదారుని పేర జమకట్టవచ్చును. అప్పుడు కోర్టువారు తనఖాదారునకు నోటీసును పంపుదురు. అతనిమీద నోటీసు జారీకాగానే వడ్డీ ఆగిపోవును. తనఖాదారు అప్పుతీరినదని ఒప్పుకొని, పైకమును కోర్టునుండి తీసికొనవచ్చును

# 5. ట్రస్టు (న్యాసము)

ట్రస్టు ఉద్దేశము :-

పేరయ్య తనఆ స్తిని అప్పటికింకను పుట్టని మనుమలకు ఇయ్యవలెనని యోచింపవచ్చును. లేదా రామాలయమునకు కల్పింపవలెనని యెంచవచ్చును. అప్పుడు ఆ పుట్టనివారికిని విగ్రహాలకును ఆ స్తిని ఏ పద్ధతిలో చేయవలెను? ట్రస్టు పద్ధతి యిక్కడ అక్కఱకువచ్చును. ఆ స్తిని ఒక నమ్మకస్థుడైన వ్యక్తి పేర పెట్టవలెను. ఇతనినే ట్రస్టీ అందురు. ఈ ట్రస్టీ ట్రస్టు ఆ స్తిని స్వాధీనపర్చుకొని, అజమాయిషీచేసి, రాబడిని ట్రస్టుప్రకారము అనుభవింపవలసినవారికి లేక ట్రస్టు నిర్దేశించిన కార్యకలాపాలకు వినియోగించును. ఏ కారణమువలననైన ఆ స్తిని అనుభవింపవలసినవారు ఆ స్తిని స్వయముగా చూచుకొని, అజమాయిషి చేసికొనుటకు అసమర్థులైనపుడు, ట్రస్టువలన పనిని జరుపుకోవచ్చును. అనుభవింపవలసినవారు ఇంక పుట్టనప్పుడు, దూరదేశములో ఉన్నపుడు, చాలమంది యున్నయెడల, మైనరుగానున్నపుడు ట్రస్టుపద్ధతి చాల అక్కఱకు వచ్చును.

పెండ్లి సమయములో ట్రస్టులు :-

సాధారణముగా ట్రస్టులు పెండ్లి సమయములో వ్రాయుదురు. పెండ్లివలన కలుగబోవు పిల్లలకు, వారిసంతతికి ఆ స్తిలో హక్కులు ట్రస్టుమూలముగా కలిగింపవచ్చును. క్రొత్తకాపురమునుపెట్టబోవు నూతనదంపతులకు ఇది సహా

కాలిగా ఉండును. పెద్దతనమునచ్చుచున్న ఒక గొప్పధనికునికి తీరని కోరిక యుండెను. మనుమలను ఎత్తుకొనవలెనని అతని ఆశ. కొడుకులు, కోడళ్లు, కూతుళ్ళు, అల్లుళ్ళు హాయిగా కాపురాలు చేసికొంటున్నారు గాని, ముసలివాని కోరికను తీర్పకుండిరి. ముసలివాడు తన న్యాయవాదిమిత్రునితో ఆలోచించి ఒక పథకము వేసెను. తన షష్టిపూర్తినాడు కొడుకులను, కోడళ్ళను, కూతుళ్ళను, అల్లుళ్ళను విందునకు పిలిచెను. అందరు విందుకు హాజరై ముసలివాని చుట్టూ కుర్చీలలో కూర్చుండిరి. విందునకు పదార్థములు వడ్డింపబడెను. భోజనమున కుపక్రమించుటకుముందు ఆ వృద్ధుడు : "పిల్లలారా ! ఈ సమయములో మీకొకసంగతి చెప్పవలెనని అనుకొన్నాను. నా ఆస్తిఅంతయు 10 లక్షలది ఉన్నది. దానిని ట్రస్టుగా ఏర్పరచినాను. నాకు మొట్టమొదట పుట్టు మనుమనికి ఈ ఆస్తిఅంతా దక్కును. నేనుచెప్పదలచుకొన్నది చెప్పినాను. ఇక ఒకనిముసము దైవప్రార్థనచేసి, భోజనము ప్రారంభింతము." అని చెప్పి దైవప్రార్థనకై కొద్దిసేపు కనులుమూసికొనెను. ఒకనిమిషములో ప్రార్థన పూర్తిచేసి, కనులు తెరచెను. తక్కినవారు ఆ చోటులోనుండి తాను ప్రార్థించుచున్నప్పుడే కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు మాయమైనట్లు తెలిసికొనెను. అతడు అందరి అంతరార్థమును గ్రహించి సంతోషించెను !

ట్రస్టు నెట్లు వ్రాయవలెనో దానివలనకలుగుహక్కులు అందులకు విధులు ఏమో తెలిసికొందము.

వర్తించుచట్టము : ఇండియన్ ట్రస్టు ఆక్టు, 1882
ట్రస్టును రూపొందించుపద్ధతి :-

ట్రస్టీ ఆస్తికి యజమానుడుగా వ్యవహరించును. అనుభవింపవలసినవానికై ట్రస్టీ తనయాజమాన్యమును వినియోగించునను నమ్మకమువలన ట్రస్టు ఏర్పడబడును. ట్రస్టునకు ఈ క్రిందివి స్పష్టముగా నిర్దేశింపబడవలెను.

(1) ట్రస్టును ఏర్పఱచుటలో అభిప్రాయము
(2) ట్రస్టు ఉద్దేశము
(3) అనుభవింపవలసినవారు.
(4) ట్రస్టులోఉండు ఆస్తి.

ఈ నాల్గింటిని విస్పష్టముచేయనియెడల ట్రస్టు చెల్లదు. ట్రస్టుచేసినవారే ట్రస్టీగా ఉండవచ్చును. ఇంకొకరిని ట్రస్టీగా నేర్పరచుచో మరణశాసనముద్వారమున ట్రస్టును చేసిననే తప్ప, లేనిచో ట్రస్టీకి ఆస్తిని స్వాధీనపఱపవలెను. స్థిరాస్తికి ట్రస్టులు మరణశాసనముద్వారమునగాని, లేక రిజిష్టరు దస్తావేజుమూలానగాని చేయవచ్చును. చరాస్తికి ఈవిధముగానే ట్రస్టును కల్పింపవచ్చును. లేదా నోటిమాటతో ట్రస్టు ఉద్దేశాలను చెప్పి, ఆస్తిని ట్రస్టీకి స్వాధీనముచేసినను చాలును.

న్యాయశాస్త్ర నిర్దిష్టమైన ట్రస్టులు :-

న్యాయశాస్త్రమువలన ఆస్తియజమానుని అంగీకారముతో నిమిత్తములేకుండ రెండురకములైన ట్రస్టులు గలవు.

(1) తిరిగివచ్చు ట్రస్టు.

(2) ఆరోపితమైన ట్రస్టు.

తిరిగివచ్చుట్రస్టు :-

ఆస్తికిసంబంధించిన వ్యక్తులకు ట్రస్టును ఏర్పాటుచేయవలెననెడి అభిప్రాయముగలదని కోర్టువారిచే ఊహింపబడినపుడు ఇట్టి ట్రస్టు జనించును. దీనికి ఉదాహరణలు:

(1) పేరయ్య వీరయ్యకు తనఆస్తిని ప్రతిఫలశూన్యముగ అన్యాక్రాంతము జేసెను. అప్పుడు పేరయ్యకు బాకీలుగలవు. బాకీదార్లు తొందరపెట్టుచుండిరి. ఆ పరిస్థితిలో వీరయ్యపేర ఆస్తిని ఉంచెను. తర్వాత పేరయ్య బాకీలుతీర్చుకొని, ఆస్తిని తిరిగి తనపేరపెట్టుమని వీరయ్యను కోరెను. పరిస్థితులను గమనించిన పేరయ్యకు తనఆస్తిని వీరయ్యకు దానముచేయవలెనను ఊహలేదని తెలియుచున్నది. ఆస్తిని అనుభవించుహక్కు తానే ఉంచుకొనదలచినట్లు ద్యోతకమగును. కనుక అది తిరిగివచ్చు ట్రస్టుగా కోర్టువారు ఊహింతురు. వీరయ్య పేరయ్యకు తిరిగి ఆస్తిని ఇయ్యవలెను.

(2) పేరయ్య భూమిని కొని, వీరయ్యపేరుతో విక్రయపు దస్తావేజును వ్రాయించికొనెను. వీరయ్యకు ఆస్తిలో హక్కు కల్గించుతలంపు పేరయ్యకు లేదు. ఈ పరిస్థితులలో వీరయ్య ట్రస్టీగామాత్రమే భూమిని ఉంచుకొనవలెనని కోర్టువారు ఊహింతురు. ఇటువంటి విక్రయపుదస్తావేజును 'బినామి' దస్తావేజు అందురు.

ఆరోపితమైనట్రస్టు :-

ఆస్తికి సంబంధించిన వ్యక్తుల అభిప్రాయములో అవసరము లేకుండ, మోసమును అరికట్టుటకు, న్యాయసిద్ధికొరకు కోర్టువారు ట్రస్టును ఆస్తిపై ఆరోపింతురు. ఆస్తిస్వాధీనములో నున్న వ్యక్తికి అనుభవించుహక్కు లేనిచో, ఇటువంటి ట్రస్టు ఉద్భవించును. దీనికి ఉదాహరణలు :

(1) వ్యాపారములో ఒక భాగస్వామి అందరు భాగస్వాములతరఫున కొనుగోలుచేయుటకు, అమ్మినవారిదగ్గర బేరముకుదిర్చినందులకు ప్రతిఫలముగా ఒక లక్షరూపాయలు తాను తీసికొనెను. ఈ లక్షరూపాయలను తక్కిన భాగస్వాములకుకూడ ట్రస్టీగా ఉంచుకొనవలెనేకాని, సొంతమునకు వాడుకొనరాదు.

(2) ఋణదాతలు దివాలా పరిస్థితులలోనున్న ఋణగ్రస్తునితో ఒడంబడికచేసికొని, ఒక్కొక్కరికి రూపాయకు పావలా ఇచ్చునట్లు తీర్మానించుకొనిరి. ఒకఋణదాత రహస్యముగా రూ. 10,000 లు ఎక్కువగా ఋణగ్రస్తునినుండి వసూలుచేసెను. దీనిని అతడు అందరుఋణదాతలకు ట్రస్టీగా నుంచుకొనవలెను. ఇటువంటిట్రస్టు ఆవ్యక్తుల ఇష్టానిష్టాలతో ప్రమేయములేకుండ న్యాయసిద్ధికొరకు కోర్టువారు ఆరోపింతురు.

ట్రస్టీల విధులు :-

ట్రస్టులోని నియమావళిని ట్రస్టీ పాటింపవచ్చును. న్యాయసమ్మతముకాని నియమములను పాటింపవలసిన పని

లేదు. అప్పులను తీర్మానించుటకు చేయబడిన ట్రస్టుక్రింద లిమిటేషన్ పెట్టిన అప్పులను తీర్చరాదు. అటువంటి అప్పులను కూడ తీర్చవలెనని ట్రస్టులోవున్నచో అట్లు చేయవచ్చును. సరియైన హామీలేనందున ఇవ్వబడిన అప్పులను వెంటనే వసూలుపరుపవలెను. ట్రస్టుఆస్తిని సంరక్షించుటకు దావాలు చేయవచ్చును; ఇతరులు దావాలు వేసినచో ప్రతివాదను చేయవచ్చును. ట్రస్టుఆస్తిని అనుభవించు హక్కుదారునకు వ్యతిరేకముగా తనయుండునట్లుగాని ఇతరులయుండునట్లుగాని హక్కును ప్రతిపాదింపరాదు. ఆస్తినుండి ఆదాయమునకు సంబంధించిన లెక్కలను జాగ్రత్తగా విభజింపవలెను. ట్రస్టు ఆక్టులో 20 వ సెక్షనులో చెప్పబడిన సెక్యూరిటీలలోనే ఆదాయమును నిల్వ చేయవలెను. గవర్నమెంటు సెక్యూరిటీలు, స్థిరాస్తిపై మొదటితనఖా మొదలగు భద్రమగు పెట్టుబడులు ఆ సెక్షనులో పొందుపరుపబడినవి.

ట్రస్టీల అసమర్థతలు :– ట్రస్టీయొక్క అసమర్థతలు :

(1) ఒకమారు ట్రస్టీగాఉండుటకు అంగీకరించిన తర్వాత ట్రస్టునుండి తొలగరాదు. ట్రస్టునుండి తొలగుటకు అనుభవించుహక్కుగలవారి అంగీకారముగాని, కోర్టువారి అనుమతిగాని కావలెను.

(2) తనవిధులను ఇతరులకు, తోడిట్రస్టీలకైనను, ఒప్పచెప్పరాదు. అట్లు ఒప్పజెప్పుటకు అనుభవించువాని అంగీకారము లేక ట్రస్టులోనే అనుమతి, లేక సాధారణవ్యవహార సందర్భమైన ఆవశ్యకత ఉండవలెను.

(3) ట్రస్టుతో అనుమతిలేనిచో ట్రస్టీలు విడివిడిగా వ్యవహరింపరాదు.

(4) ట్రస్టుఆస్తిని సంరక్షణచేయుటకు ట్రస్టులో చెప్పబడిన ప్రతిఫలమును తప్ప హెచ్చుగా తీసికొనరాదు. తీసికొనదలచినచో అనుభవపుహక్కుదారునితో ఒప్పందముచేసికొనవలెను.

(5) ట్రస్టుఆస్తిని తనపనులకు వినియోగింపరాదు; అప్పుతీసికొనరాదు.

(6) ట్రస్టుఆస్తిని తాను కొనరాదు. అట్లు కొనుగోలునకు కోర్టువారి అనుమతి కావలెను.

లాభానుభోక్త పరిస్థితి: నిర్ణీతలాభానుభోక్త:

ఆ ఆస్తినుండివచ్చురాబడిని తీసుకొను హక్కు కలదు. మైనారిటీతీరినచో ఆ ఆస్తినే తీసికొనవచ్చును. ట్రస్టుదస్తావేజునకలు తనయొద్దఉంచుకొనవచ్చును. తన అనుభవపుహక్కును ఇతరులకు సంక్రమింపజేయవచ్చును. ట్రస్టీలు లేనప్పుడు, కోర్టువారే ట్రస్టును అమలుపఱతురు. ట్రస్టీలేనంతమాత్రమున ట్రస్టు భగ్నముకాదు. ఏ ట్రస్టీలైనను ట్రస్టునకు భంగకరముగా వ్యవహరించినచో, తానే నష్టమును అచ్చుకొనవలెను. అనగా,(1) ట్రస్టీచేతిలో ఆ ఆస్తి ఎన్ని మార్పులు చెందినను ట్రస్టునకు లోబడియేయుండును. ఒకట్రస్టీ ఆ ఆస్తిని అమ్మి ఆ డబ్బునకు తనపేరుతో ఒక భూమిని కొనెను. అనుభోక్త ఆ భూమిని ట్రస్టులోచేరినదిగానే ఎంచవచ్చును.

(2) ట్రస్టుఆస్తి ట్రస్టీచేతిలోనుండి యితరులచేతులలోనికి పోయినను, లాభానుభోక్త దానిని తనదని వాదింప వచ్చును. ట్రస్టుసంగతి తెలియకుండ ప్రతిఫలమిచ్చి సంక్రమింప జేసికొన్న యన్యునిచేతిలోనికి ఆస్తిపోవునపుడు లాభానుభోక్త ట్రస్టుఆస్తి విషయమై పోరవచ్చును.

ఉదాహరణ : ఒకట్రస్టీ బాంకులో తన పేరుతో ఒక ఖాతాను మొదలిడెను. ఆ ఖాతాలో, ఈ క్రింది జమలు కలవు.

| తారీఖు | జమ | ఖర్చు | నిలవ |
|---|---|---|---|
| 1-1-58 ట్రస్టుడబ్బు | 5000 | | |
| 2-1-58 సొంతడబ్బు | 3000 | | |
| 3-1-58 సొంతఖర్చు | | 6000 | |
| 4-1-58 సొంతడబ్బు | 4000 | | |
| | | | 6000 |

తర్వాత ట్రస్టీ దివాలాతీసెను.

లాభానుభోక్త (బెనిఫిషియరీ) నిల్వ 6000నుండి తన ట్రస్టుడబ్బు 5000 యియ్యవలెనని వాదించును. తక్కిన అప్పులవారు 4-1-58న ఖర్చుపద్దు 6000తో 1-1-58జమలో నున్న ట్రస్టుడబ్బు 5000 పోయినదనియు, అందుచే నిల్వ 6000లో ట్రస్టుడబ్బు లేదనియు వాదింతురు. ఎవరివాదన సబబయినది? రెండువాదనలును చెల్లవు. 6000 రూ॥ల ఖర్చు పద్దులో ట్రస్టీ ముందు తన సొంతపైకమగు 3000 ను తీసు

కొన్నట్లు భావింపవలెను. తర్వాతనే ట్రస్టుడబ్బును అక్రమముగా వాడినట్లు తలపోయవలెను. తర్వాత 4000 రూ॥ల సొంతడబ్బు జమకట్టినపుడు ఇదివరకు చేసినతప్పును దిద్దుకొనుచున్నట్లు భావింపలేము. కనుక నిల్వలోఉన్న 6000లో ట్రస్టు డబ్బు 2000 మాత్రమే. కనుక నిల్వలోనుండి రు 2000/- లాభానుభోక్తకు ఇయ్యవలెను. మిగత 3000 రూ॥ను ఋణదాతలందఱికిని దివాలాలో లాభాంశమునుకూడ ఇయ్యవలెను.

నాలుగవభాగము

# ఖరారు లేక ఒడంబడిక

## 1. సామాన్య సూత్రములు

చట్టము :- ఒడంబడిక చట్టము, 1872

అవతారిక

ఒడంబడికయొక్క పవిత్రత :-

"సమయమ్ అభిరక్షంతి ఆర్యాః" అని ప్రతీతి. ఒడంబడికలను పాలించుట సత్పురుషలక్షణము. మనది సత్య హరిశ్చంద్రుడు జన్మించిన దేశము. హరిశ్చంద్రమహారాజు విశ్వామిత్రమహర్షికి అపారధనము దానముచేసెను. ఋషి ఆ ధనమును రాజుదగ్గరనేయుంచి అడిగినప్పుడు ఇచ్చునటుల వాగ్దానము పొందెను. ఆపైన రాజు తనసర్వస్వము ఆ ఋషికే దానముచేసెను. తర్వాత విశ్వామిత్రుడు తనకు పూర్వము వాగ్దానము నొసగినధనము నిమ్మని నిర్బంధించెను. మహారాజు హానిసగా అమ్ముడుపోయి, ఆ ధనముతో బాకీ తీర్చి, తన సమయమును పాటించి సత్యహరిశ్చంద్రుడని ఆచంద్రార్కము తనకీర్తిని స్థాపించుకొనెను. అటువంటి సత్య హరిశ్చంద్రునిగన్న దేశములో పుట్టిన భారతపౌరులకు వాగ్దానముయొక్క పవిత్రతనుగూర్చి చెప్పుట అనావశ్యకము. అగుచో ఇక్కడ ఉత్పన్నమగు ప్రశ్న ఏమనగా, న్యాయస్థానములలో 'ఎటువంటి వాగ్దానమైన చెల్లునా అని. అన్నివాగ్దానములను కోర్టువారు నిర్బంధముగా జరిపింపరు. వాగ్దానము న్యాయ

మైన ఒడంబడిక అయిననే కోర్టువ్యాగనమును అమలుజరుప వచ్చును. ఎటువంటి వాగ్దానములు ఒడంబడికలుగా చెల్లు బడిఅగునో గమనింతము.

ఒడంబడికను ఏర్పఱచుట :-

న్యాయశాస్త్రము ప్రకారము చెల్లెడు వాగ్దానమును ఒడంబడికయని వ్యవహరింతురు. ఒకడు రెండవవారికి ఉప పాదించినదానిని రెండవవారు అంగీకరించిన వాగ్దానము సిద్ధిం చును. పేరయ్య తనయింటిని భీమయ్యకు వెయ్యిరూపాయ లకు అమ్మెదనని ఉపపాదించెను. భీమయ్య 1000 రు ఆ యింటిని కొనుటకు అంగీకరించెను. అప్పుడు భీమయ్య వెయ్యి యిచ్చుటకును, పేరయ్య యింటిని ఇచ్చుటకును వాగ్దాన ములు జరిగినవి. ఈ వాగ్దానములలో నొకదానికొకటి ప్రతి ఫలము. ఇవి న్యాయశాస్త్రప్రకారము చెల్లెడు వాగ్దానములు. కనుక ఒడంబడిక సిద్ధించును.

ఒడంబడిక చేయుటకు అర్హత :-

ఒడంబడిక చేసికొనువ్యక్తులు సరియైన మనోపటు త్వము గలిగియుండవలెను. మనోజాడ్యముకలవారికి ఒడం బడిక చేసికొను అర్హత లేదు. సరియైన మనోపటుత్వము లేక మనోజాడ్యరాహిత్యము అనగా ఒడంబడికను అర్థముచేసి కొని దానిఫలితములను అవగాహనముచేసుకొనగల్గు సామ ర్థ్యము. పిచ్చివానికి ఇట్టి మనోపటుత్వము ఉండదు. కనుక అట్టి మనోజాడ్యపీడితునితో ఒడంబడిక చెల్లదు. త్రాగుడు వలన మనోపటుత్వము తప్పును. అట్టిసమయములో చేయు

బడిన ఒడంబడిక చెల్లదు. భారతన్యాయశాస్త్రరీతిని 18 సంవత్సరములు నిండనివారు అప్రాప్తవ్యవహారదశులు. వారి ఒడంబడికలు చెల్లవు.

సమస్య :-

కామయ్యకు 18 సంవత్సరములు నిండలేదు. అయినను తాను వ్యవహారయోగ్యుడనని చెప్పి రామయ్యగొద్ద 5000 రూ॥లు అప్పుజేసెను. రామయ్య యీ అప్పును కామయ్యనుండి రాబట్టుకొనవచ్చునా?

వ్యవహారయోగ్యతిరానివారి వాగ్దానములు చెల్లవు. వ్యవహారదశుడనని చేసిన ప్రతిజ్ఞ అతనిని బాధింపదు. నిజస్థితిని ఋజువుపరచుటకు ఆటంకము రాదు. కనుక రామయ్యకు కామయ్యగొద్ద వసూలుచేసికొనుటకు కోర్టునుండి డిక్రీ ఇయ్యరు. కాని కామయ్య ఆసొమ్ముతో కొంత ఖర్చుపెట్టక, బ్యాంకులో దాచియుంచినాడని అనుకొందము. ఆ సందర్భములో అట్లు నిల్వఉన్న పైకమునుమాత్రము వాపసు చేయించుటకు కోర్టువారికి అధికారము గలదు. వీలయినంతవరకు యథాస్థితి ప్రతిష్ఠాపనకు కోర్టు ప్రయత్నించును.

ప్రతిఫలము :-

ఒడంబడికకు శాస్త్రీయమైన ప్రతిఫలము ఉండవలెను. పేరయ్య వీరయ్యకు 10 ఎకరములను దానమిచ్చెదనని వాగ్దానముచేసెను. ఈ వాగ్దానము ప్రతిఫలశూన్యముగాన చెల్లదు. పేరయ్య వీరయ్యకు తన ఇంటిని 1000రూ॥లకు విక్రయించుటకు వాగ్దానముచేసెను. ఈ వాగ్దానమునకు ప్రతిఫలము కలదు. కనుక చెల్లును. ప్రతిఫలమును వాగ్దత్తము

పొందినవాడే యియ్యవలెనను నియమము లేదు. 1000 రూ॥ లను వీరయ్యగాక కామయ్య యిచ్చునట్లున్నను, వీరయ్యతో చేసికొనిన ఒడంబడిక చెల్లును.

ప్రతిఫల మెప్పు డనావశ్యకము :-

ప్రతిఫలము లేకపోయినను ఈ క్రింది ఒడంబడికలు సశాస్త్రీయములే :

(1) ప్రకృతిసిద్ధమగు ప్రేమచేత సన్నిహితబంధువులకు రిజిష్టరుపత్రముమూలాన చేయబడిన ఒడంబడిక.

(2) లిమిటేషన్ పట్టిన అప్పు తీర్చుటకు, వాగ్దానము చేయువారి, లేక వారిగొరకు ప్రతినిధిగనుండువారి చేవ్రాలుతో లిఖితపూర్వకమగు ఒడంబడిక.

ప్రతిఫలపు అశాస్త్రీయత :-

ప్రతిఫల మీ క్రింది సందర్భములలో అశాస్త్రీయ మని పరిగణింపబడును.

(1) న్యాయశాస్త్ర నిషిద్ధమైనది : భీమయ్యయొక్క గడ్డివామిని వీరయ్య తగలపెట్టినచో అతనికి వీరయ్య 1000 ఇచ్చెదనని వాగ్దానముచేసెను. వీరయ్య ఆ గడ్డివామును కాల్చి తనకు రు. 1000 లు ఇమ్మని అడుగును. ఈ వాగ్దానము చెల్లదు. ఇతరుల గడ్డివామిని తగులబెట్టుట తగులబెట్టించుట న్యాయశాస్త్ర నిషిద్ధములగుటయే కారణము.

(2) న్యాయశాస్త్రనియమములకు భంగము కల్గించు నవి : భార్యను పుట్టింటినుండి తీసికొనిపోవని భర్త భార్యకు చేసిన వాగ్దానము చెల్లదు. లిమిటేషన్ కాలమును పొడిగించు టకు చేసికొనిన ఒడంబడిక చెల్లదు.

(3) మోసపూరితములగునని : పేరయ్య తన అప్పు లను ఎగగొట్టు దురుద్దేశముతో తనమిత్రుడగు వీరయ్యపేర తన స్థావరగూపకమైన ఆస్తి అన్యాక్రాంతమైనట్లు దస్తావేజు వ్రాయించెను. ఇట్లు సహాయము చేసినందులకు వీరయ్యకు రూ॥ 1000లు ఇచ్చెదనని చెప్పెను. ఈ వాగ్దానము చెల్లదు. పేరయ్య ఈ 1000ని ఎగవేయవచ్చును. "లీల గుడి మింగు వానికి లింగ మెంత ?"

(4) ఇతరులకుగాని, ఇతరులఆస్తికిగాని హానికలుగ జేయునవి: వీరయ్యకు కాలు విఱుగగొట్టినచో భీమయ్యకు 1000 రూ॥లు ఇచ్చునట్లు పేరయ్య వాగ్దానముచేసెను. ఈ వాగ్దానము చెల్లదు.

(5) దుర్నీతికరమైనది : పేరమ్మ తన కుమార్తెను కామయ్యకు ఉంపుడుకత్తెగా నుంచుటకు ఒడంబడిక చేసి కొనెను. ఇది చెల్లదు. ఉంపుడుకత్తెను ఇకముందు చేయు బోవు నిషిద్ధసంభోగమునకై అప్పుపత్రమును వ్రాసియిచ్చి నచో అది చెల్లదు. ఇదివరకే జరిగిన నిషిద్ధసంభోగమునకు అప్పుపత్రము వ్రాసియిచ్చిన అది చెల్లునా? మద్రాసు కోర్టు వారు చెల్లదనియు, బొంబాయి కోర్టువారు చెల్లుననియు తీర్పు నిచ్చియున్నారు.

మనస్ఫూర్తియగు అంగీకారము :-

ఒడంబడిక చెల్లుటకు ఒడంబడిక చేసికొన్నవారు మన స్ఫూర్తిగా దాని కంగీకరించియుండవలెను. ఈ క్రింది దోష ములు లేనిచో ఒడంబడిక మనస్ఫూర్తిగా చేయబడినదని భావింపబడును.

(1) బలాత్కారము :-

శిక్షాస్మృతిచే నిషేధింపబడిన పనిని చేసెదనని భయపెట్టి యింకొకనిని ఒడంబడికను ఒప్పించిన ఆ ఒడంబడికను బలాత్కారదోష మాపాదిల్లును. తన అప్పును కొట్టివేయక పోయిన ఆత్మహత్యచేసికొందునని భయపెట్టి అప్పును వదలుకొనుటకు ఋణదాతతో ఒడంబడికచేసికొనిన ఆ ఒడంబడిక చెల్లునా? ఆత్మహత్యకూడ శిక్షాస్మృతిచే నిషేధింపబడిన కార్యమగుటచే, ఈ ఒడంబడిక చెల్లదు. అటువంటి ఒడంబడిక కలుగు అంగీకారము మనస్ఫూర్తిగా ఒసగినదికాదు కొట్టి వేయించికోవచ్చును.

(2) పలుకుబడి దుర్వినియోగము :-

ఒడంబడిక జేసుకొను వ్యక్తులలో నొకడు రెండవ వాని పలుకుబడికి లోబడియున్నపుడు ఆ పలుకుబడి దుర్వినియోగముతో ఒడంబడికను ఏర్పాటుచేసికొన్నచో ఆ ఒడంబడిక చెల్లదు. అటువంటి పరిస్థితులు న్యాయవాది అతని కక్షిదారుని నడుమ, మతగురువు అతని శిష్యులనడుమ, సంరక్షకుడు తన పోషితులనడుమ, వైద్యుడు రోగినడుమను మొదలగు సందర్భములలో ఏర్పడును. అటువంటివారిమధ్య ఏర్పడిన ఒడంబడికలను కోర్టువారు అతిజాగరూకతతో పరిశీలింతురు. అటువంటి ఒడంబడిక పలుకుబడి దుర్వినియోగము లేకుండ కల్గినదని ఋజువుచేయుభారము పలుకుబడిగల వ్యక్తిపై ఉండును. రెండవవ్యక్తి తగినసలహాను న్యాయవాదులనుండి పొందెనని ఋజువుచేసిన పలుకుబడి దుర్వినియోగము కాలేదని

నమ్మవచ్చును. దుర్వినియోగదోషయుక్తమగు పలుకుబడి వలన ఏర్పడ్డ ఒడంబడికకు ఆకారణముచే మనస్ఫూర్తిగ అంగీకారమియ్యనివారిచే త్రోసివేయబడవచ్చును. ఒడంబడికను త్రోసివేయునపుడు కోర్టువారు అట్టి ఒడంబడిక క్రింద ముట్టిన పైకము లేక ఇతరలాభమును మరలా ఇచ్చునట్టి షరతులను విధింపవచ్చును.

మోసము :—

మోసము ఈ క్రిందివిధముగా ఉండును.

(1) తనకు నమ్మకములేని ఒక అసత్యపు విషయమును ఇంకొకరిచేత నమ్మించుట.

(2) ఒకవిషయమును తెలియనీయకుండ అణచివేయుట.

(3) వాగ్దానమును నిలుపుకొను అభిప్రాయములేకుండ చేయుట.

(4) రెండవవానిని మభ్యపెట్టుట కేదైన ఒకపనిని చేయుట. మాట్లాడవలసినవిధి లేనిచో మౌనము మోసముగా పరిగణింపబడదు.

ఒడంబడికకు ఎవరి అంగీకారము మోసముచే సంపాదింపబడెనో, వారు ఒడంబడికను రద్దుచేయవచ్చును. ఒడంబడికను తనతో చెప్పిన నిరాధారమైన విషయము సత్యమే అగునో తాను ఏస్థితిలోఉండునో అట్టిస్థితిలోనుంచుచు ఒడంబడికను పూర్తిచేయవలెనని కోరుటకుకూడ అతనికి హక్కు గలదు. పేరయ్య తనఇంటిపై తనఖాలులేవని చెప్పి నమ్మించి ఇంటిని పేరయ్యకు కొనుగోలు ఒడంబడికను చేసెను. నిజముగా ఇంటిపై తనఖా గలదు. పేరయ్య ఒడంబడికను రద్దు

చేయవచ్చును. లేదా తనఖాను తీర్చి యింటిని తనపరము చేయవలసినదిగా కోరవచ్చును.

తప్పుగా తెలియజేయుట :-

తనకు తెలిసిన విషయములవల్ల నిశ్చయముగా చెప్పుటకు వీలులేకపోయినను, ఒక అసత్యవర్తమానమును తాను నిజమని నమ్మి ఇంకొకనికి నచ్చచెప్పినచో, మోసము కాకపోయినను, తప్పుగా తెలియజేయుట క్రిందికి వచ్చును. మోసపుచ్చు విధానముతో ఇది తుల్యము. దీనికిని మోసమునకును ఫలితములో ఒక భేదముగలదు. దీనిలో ఒడంబడికను అంగీకరించినవాడు మామూలు సత్యమును తెలిసికొనుటకు తగినసాధనములు కలిగియుండిన, ఒడంబడికను త్రోసివేయ లేడు. మోసములో రెండవవాడు నిజమును సాధారణముగా కనుగొనగలడో లేడో అను ప్రశ్న రాదు.

## ఒడంబడిక విమోచనము

ఒడంబడిక ఈ క్రిందివిధములుగా అంతమొందును :

(1) ఖరారు బాధ్యతల నిర్వర్తించుట :-

ఒడంబడిక క్రింద తనకుగల బాధ్యతను నెరవేర్చుట వలన ఒడంబడికనుండి విమోచనము కలుగును.

(2) నిర్వర్తించుటకు పూనుకొనుట :-

ఖరారుబాధ్యతలను నెరవేర్చుటకు సంసిద్ధుడుగా రెండవవారు అంగీకరింపకపోయినచో, సంసిద్ధత చూపినవారు ఖరారు నెరవేరకపోయినందుకు బాధ్యులుకారు. న్యాయ

బద్ధమైన సంసిద్ధత బేషరతుగా, సకాలములో, సరియైనస్థలములో, సంసిద్ధతజూపువారు ఖరారును పూర్తిగా నెరవేర్ప జాలుదురని గూహీయగుచున్నుండవలెను.

(3) సమ్మతి :-

(I) పరిత్యాగము : వాగ్దానము పొందినవారు ఖరారును పాటింపవలసినవారిని ప్రతిజ్ఞాపాలననుండి విముక్తుని జేయవచ్చును.

(II) క్రొత్త ఒప్పందము : మొదటి ఒప్పందమును క్రొట్టివేసి, దానిస్థానమున మరొక ఒప్పందముచేసికొనుటవలన మొదటి ఒప్పందము రద్దగును.

(4) నిర్వహించుట అసాధ్యమగుట :-

ఒప్పందము నెరవేర్చుట ఆకస్మిక సంఘటనలవలన అవరోధింపబడవచ్చును. యుద్ధమువచ్చుట, ఒప్పందము చట్టముచే అశాస్త్రీయముగా ప్రకటింపబడుట మొదలగునవి ఆకస్మిక సంఘటనలు. ఒక సినిమాతార ఒకచిత్రములో ఆరు మాసములు నటించుటకు ఖరారుచేసికొనెను. నియమిత కాలములో ఆమెకు జబ్బుచేసెను. అందుచే నటింపలేక పోయెను. ఖరారును నిర్వర్తింపలేదను వ్యాజ్యెమునకు ఈ కారణము సరియైన సమాధానము. పేరయ్య తనయింటిని 15-1-1958 నుండి అద్దెకు యిచ్చుటకు వాగ్దానముచేసెను. 1-1-1958న ఆ ఇల్లు కాలిపోయెను. అందువలన ఖరారు పాలన అసాధ్యమాయెను. దీనిచే ఒడంబడిక రద్దగును. ఖరారును అసాధ్యపరచు కారణాంతరములు సంభవింపకపూర్వము

ఇచ్చిన సొమ్మును ఖరారుపరద్దయినపుడు అంతవరకైన ఖర్చులు పోను మిగతా ముదరాయిచ్చ్యవలసియుండును.

(5) ఖరారుభంగము :-

ఒప్పందముచే జనించిన బాధ్యతలను నిర్వర్తింప కుండుట ఖరారును భంగముచేయుట. దీనివలన రెండవవారు తమబాధ్యతలను అనుష్ఠింపవలసిన అగత్యము పోవును. అంతే కాక రెండవవారికి పరిహారమునుకోరు హక్కును గల్గజేయును.

## 2. ప్రత్యేకములైన ఒడంబడికలు

### ఉపనిధానము

ఉపనిధానముయొక్క స్వభావము :-

ఉపనిధానములో ఒకరు కొన్నివస్తువులను తిరిగి యొప్పజెప్పవలెనన్న షరతుతో మరియొకరికి ఒక నిర్దిష్ట విని యోగముకై యిచ్చెదరు. ఇచ్చినవారిని ఉపనిధాత అనియు, పుచ్చుకొన్నవారిని ఉపనిహిత అనియు వ్యవహరింతురు. వీరయ్య కంసాలికి వజ్రములను కమ్మలుచేయుటకు ఇచ్చెను. వీరయ్య ఉపనిధాత; కంసాలి ఉపనిహిత. ఆ వజ్రములు ఉప నిధానములో నుంపబడినవి.

ఉపనిహిత హక్కులు: వస్తువులపైగల పట్టు :-

ఉపనిహిత, ఉపనిధానపు ఒడంబడికప్రకారము ఏదైన సేవలుచేసినవానికి రావలసిన ప్రతిఫలము ముట్టువరకు ఉప నిధానములోనున్న సామాగ్రిని తన స్వాధీనములోనేయుంచు కొనవచ్చును. కంసాలి నగను తన కూలి చెల్లువరకు తన యొద్దనే యుంచుకొనవచ్చును.

ఉపనిహితనిధులు :-

ఉపనిహిత వస్తువులను జాగ్రత్తగల యజమానునివలె చూచుకొనవలెను. తన సొంతవస్తువులలో జేర్పకూడదు. అనుజ్ఞలేని పనులకు వినియోగింపరాదు. కార్యము పూర్తి కాగానే ఉపనిధాతకు వాపసుఇయ్యవలెను. ఒకఆవు ఉపనిధానములో ఉంచబడెను. నియుక్తకాలములో దానికి దూడ కలిగెను. ఆవును, దూడనుకూడ ఉపనిధాతకు ఇయ్యవలసియుండును. ఉపనిధాత నిజమైన యజమానుడు కాకపోయినను అతనికి తిరిగియిచ్చుటవలన ఉపనిహిత నిజమైన యజమానునికి జవాబుదారికాడు. నిజమైన యజమానుడు వాపసు ఇయ్యకపూర్వమే వచ్చి సరుకు తనకే యియ్యవలెనని అడిగినచో, ఉపనిహిత కోర్టువారికి సంగతి విన్నవించి యెవరికి ఇయ్యవలెనో నిర్ధారణచేయవలెనని కోరవచ్చును. ఉపనిధానము కొంతమంది యజమానులచే కలిసి చేయబడినచో అందులో ఒక్కనికే వాపసు ఇయ్యవచ్చునా? ఇయ్యరాదని ఒడంబడికలేనిచో ఏ ఒకరికైనను వాపసుచేయవచ్చును. అట్టి ఒడంబడికయున్న ఏమగును? ఈ క్రింది మర్యాదరామన్న తీర్పువలన తెలియనగును.

నల్గురు వంచకులకథ :-

నల్గురు వంచకులు తమ అన్యాయార్జితవిత్తమును ఒక పేటికలో వుంచి పూటకూళ్ళయింటి యజమానురాలియొద్ద దాచిరి. ఒకరియందొకరికి నమ్మకములేనందున అందరు కలిసి అడిగినప్పుడే ఆపేటికను వాపసుఇయ్యవలసినదిగా కోరిరి. ఒకరోజున నల్గురువంచకులు కొలదిదూరములోనున్న యింటి

వసారాలో చీట్లపేక ఆడుకొనుచుండిరి. ఒక అందమైన గొల్లది ఆ సందులోనికి పెరుగు అమ్ముకొనుటకు వచ్చెను. పెరుగు బాగున్నందున వీరు కొనదలచి తమలో ఒకనిని దధి పాత్ర తీసికొనివచ్చుటకు పూటకూళ్ళమ్మదగ్గరికి పంపిరి. ఆ మోసకాడు పూటకూళ్ళమ్మతో పాత్ర కొనదలచి చెప్పక తాము ఇచ్చిన ధనపేటికను మరియొకచోట దాచుటకు తెమ్మనిరని చెప్పెను. ఆమె యథార్థము తెలిసికొనదలచి తనయింటిలోనుండియే తక్కినవారికి వినపడునట్లు "దానిని పంపమందురా ?" అని అరచెను. వారు దధిభాండమును గురించి ఆమె అడుగుచున్నదని తలచి "వెంటనే పంపు" మని కేకపెట్టిరి. ఆమెయొద్దనుండి ధనపేటికను తీసికొని మోస గాడు పారిపోయెను. పెరుగుబేరములో ఉన్న మిత్రత్రయము ఈ సంగతిని చాలసేపటివరకు గమనింపరైరి. తర్వాత నిజ స్థితిని గ్రహించి ముగ్గురుమోసగాళ్ళు కలిసి పూటకూళ్ళమ్మపై వ్యాజ్యము తెచ్చిరి. నల్గురముకలిసి అడుగనప్పుడు ఈమెకు ధనపేటికనుఇచ్చు హక్కులేదని వాదించిరి. న్యాయమూర్తి వారివాదనను బలపరచుచు 'ఈదావాను ముగ్గురే తెచ్చినారు గనుక చెల్లదు. ఉపనిధాతలు నల్గురుకలిసి దావా తెచ్చినపుడే ప్రతివాది ధనపేటిక నియ్యవలసియుండు'నని తీర్పుచెప్పెను.

### 3. కుదువబెట్టుట

గిరవుపెట్టుకొన్నవారి, గిరవుంచినవారి హక్కులు :-

(ఆధిగ్రాహీ, ఆధికర్త)

అప్పునుతీర్చుటకు హామిగా చరాస్తిని ఉపనిధాన ములోనుంచుట కుదువబెట్టుట అందురు. దీనికే ఆధి, గిరవు

పర్యాయపదములు. ఉపనిహితను గిరవుపెట్టుకొన్నవాడనియు ఉపనిధాతను గిరవుంచినవాడనియు అందురు. ఒకరు వజ్రాల హారమును 1950లో చేసిన అప్పునకు హామిగాను, ఒక బంగారుగాజును 1951 లో చేసిన అప్పునకు హామిగాను కుదువబెట్టెను. తర్వాత 1950 అప్పును ముందు తీర్చెను. గిరవుపెట్టుకొన్నాతడు వజ్రాలహారమును వాపసుచేయవలెను రెండవఅప్పునకు దీనిని హామిగా ఇయ్యలేదు గనుక దీనిని ఉంచుకొనుటకు హక్కులేదు. అప్పును తీర్మానింపనప్పుడు కుదువసొమ్మును అమ్మి బాకీకి చెల్లువేసికొనవచ్చును. కాని తాను అమ్మబోవుచున్న సంగతిని గిరవుంచినవానికి నోటీసు మూలముగా తెలుపవలెను. ఆ అమ్మకములో గిరవుపెట్టు కొన్నవాడు తానే సొమ్మును కొనరాదు. అమ్మకములో వచ్చిన సొమ్ము అప్పునుతీర్చుటకు చాలనిచో మిగత బాకీని గిరవుంచినవానివలన రాబట్టుకొనవచ్చును. అప్పు తీర్మానము కాగా మిగిలినచో మిగతపైకమును గిరవికర్తకు ఇచ్చివేయవలెను.

## 4. హానిరక్ష లేక నష్టముకట్టియిచ్చు ఖరారు (ఇన్ డెమ్నిటీ)

నిర్వచనము : లక్షణములు:-

తన ప్రవర్తనవల్లగాని, ఇతరుల ప్రవర్తనవల్లగాని సంభవించు నష్టమునుండి కాపాడుటకు చేసికొన్న ఖరారును "ఇన్ డెమ్నిటీ" ఒడంబడిక అందురు. పేరయ్య ఒక భూమిని వీరయ్యకు అమ్మెను. పేరయ్యకుటుంబములో మైనర్లున్నారు. వారు ఏదయిన తగాదా తెచ్చెదరేమోఅని వీరయ్యకు సంశ

యముగలదు. ఈసందర్భములో వేరయ్యగారి అతనిమిత్రుడు సుబ్బయ్యగారి ఆవిధముగా వీరయ్యకు నష్టము సంభవించి నపుడు తానే ఆ నష్టమును భరించెదనని ఒక ఖరారు వ్రాసి యియ్యవచ్చును. నష్టము సంభవించినచో ఈ ఖరారును అసలుజరుపవచ్చును.

## 5. ప్రతిరక్షణ (ష్యూరిటీగాఉండుట) : ప్రతిభూతి.

లక్షణములు :-

మరియొకరుచేసిన వాగ్దానమును వారు నిలుపుకొనని చో తాను నిర్వర్తించెదనని ఖరారుచేయుట ష్యూరిటీగా ఉండుట అందురు. గ్యారంటీ లేక ప్రతిభూతి అని దీని పర్యాయపదములు. వేరయ్య అప్పుపత్రము వీరయ్యపేర వ్రాసెను. వేరయ్య ఆ అప్పును తీర్చనిచో తాను తీర్చెదనని కామయ్య ఖరారుపడెను. కామయ్య ష్యూరిటీఅగుచున్నాడు. వేరయ్య ప్రధానమైన ఋణగ్రస్తుడు. ష్యూరిటీఖరారు నోటి మాటతోగాని, లిఖితపూర్వకముగాగాని యుండవచ్చును. ష్యూరిటీయొక్క బాధ్యత ప్రధానమైన ఋణగ్రస్తునికన్న ఎప్పటికిని ఎక్కువకాదు. ఖరారులో అంతకన్న తగ్గించి వ్రాసి కొనవచ్చును. వేరయ్య 5000 బాకీయున్న, కామయ్య అంతకుతక్కువకు (3000 వరకే) ష్యూరిటీగా ఉండవచ్చును. ఇట్లు తగ్గించుకొననిచో 5000 వరకు కామయ్యకూడ బాధ్యుడగును. వేరయ్య వ్యవసాయముచేయుచున్నాడు. కామయ్యకు వ్యవసాయములేదు. శాసనసభచేసిన చట్టమువలన వ్యవసాయకుల అప్పులు సగమువరకు రద్దయినవి అని అనుకొనుము. అప్పుడు వేరయ్య 2500 మాత్రము చెల్లింపవలసియుండును

కామయ్య 5000 కు బాధ్యుడుగా ఉండునా? ఇతనికి శాసనము రక్షణనొసంగక పోయినను ష్యూరిటీగనుక ప్రధానమైన ఋణగ్రస్తునికిమించి యితనిబాధ్యత ఉండదుగనుక, కామయ్య గూడ 2500 వరకు మాత్రమే బాధ్యుడగును.

ష్యూరిటీకిని ప్రధానాధమర్ణునికిని ఉండు సంబంధము :-

గ్యారంటీయియ్యబడినఅప్పును ష్యూరిటీ చెల్లించినచో, ఉత్తమర్ణునకి ప్రధాన సాధమర్ణునిపైగల హక్కులన్నియు ఆ ష్యూరిటీకి వచ్చును. ష్యూరిటీ తాను న్యాయప్రకారము చెల్లించిన మొత్తమును ప్రధానమైనఋణగ్రస్తునినుండి రాబట్టుకొనవచ్చును.

ష్యూరిటీ-ఉత్తమర్ణుడు : వీరిసంబంధము:-

ష్యూరిటీయొక్క అంగీకారము లేకుండ ఋణదాత ష్యూరిటీకి అపకారముజరుగుపనిని చేయరాదు. ఋణగ్రస్తుని ఋణదాత విముక్తునిచేయుచో, ష్యూరిటీబాధ్యత తీరిపోవును. ఋణదాత తనకు పైకమును చెల్లింపవలసిన కాలపరిమితిని పొడిగించుట, తక్కువ మొత్తమును తీసికొని ఋణగ్రస్తునితో రాజీపడుట చేసిన ష్యూరిటీఅంగీకారము లేనిచో అతనిభాధ్యత తీరిపోవును.

## 6. పార్ట్నర్‌షిప్ (ఉమ్మడివ్యాపారపు ఖరారు)

### చట్టము:- ఇండియన్ పార్ట్నర్‌షిప్ ఆక్టు (1932)

నిర్వచనము :-

కొంతమంది భాగస్థులుగా ఉమ్మడిగా వ్యాపారము చేయుటకు ఖరారుపడినపుడు ఒడంబడికలో ఉండవలసిన నియమములు: (1) లాభమును పంచుకొనుటకు సంబంధించి

నని. లాభమంతా ఒకభాగస్తుడే పొందునట్లున్న అది పార్ట్నర్‌షిప్ కాదు. నష్టముఅంతయు ఒకడే పొందునట్లుసూత్రము ఉండవచ్చును. ఏ నిష్పత్తిలో లాభనష్టములు పంచుకొనవలెనో స్పష్టముగా లేనిచో సమముగా పంచుకొనవలెనని భావము. ఒక క్లబ్బులోని సభ్యులు భాగస్తులుగారు. దీనికి కారణము క్లబ్బు లాభమును సంపాదించుటకు, లాభమును పంచుకొనుటకు ఏర్పడినదిగాక పోవుటచే. (2) అందరుభాగస్తులు వ్యాపారమును ఉమ్మడిగా సాగింపవలెను. ఏ ఒకరయినను అందరికిగాను వ్యవహరింపవచ్చును. ప్రతి భాగస్వామి తక్కినవారి ప్రతినిధి. పార్ట్నర్‌షిప్‌లో ఇదేముఖ్యము. ఒక మెడికల్‌స్టోర్సు ఒకనిని మందులఅమ్మకమునకు నియోగించి, అతనికి లాభములో నూటికి ఇరవైవంతులు ఇచ్చుటకు సమ్మతించిరి. ఇక్కడ లాభమునుపంచుకొనుట గలదు. కాని పార్ట్నర్‌షిప్ లేదు. ఎందుకనగా, వీరిలో ఒకరు నొకరికి ప్రతినిధులుగారు.

ఫరమ్ : (వర్తకసంఘము) :-

భాగస్తులను సంయుక్తముగా సంబోధించునపుడు "ఫరమ్" అందురు. వ్యాపారమును ఫరమ్‌పేరుతో ఉమ్మడిగా జరుపుదురు.

భాగస్తుల గరిష్టసంఖ్య :-

ఉమ్మడివ్యాపారమును చేయువారు 20ని మించరాదు. వడ్డీవ్యాపారమయిన 10ని మించరాదు. అంతకుమించిన, కంపెనీని స్థాపించవలెను.

ఫరమ్‌ను అంతమొందించుట :-

భాగస్థులలో ఒకరిద్దరు తప్పుకొనినను తక్కినవారు ఉమ్మడిగా వ్యాపారమును సాగింపవచ్చును. ఫరమ్‌నే చాలించుటవలన ఉమ్మడివ్యాపారము పూర్తిగా కట్టుబడును. ఇట్లు క్రిందచెప్పబడిన పరిస్థితులలో జరుగును :

(1) తనంతటతానే ఆగిపోవుట : భాగస్థులందరును, లేక ఒకడుతప్ప తక్కినవారందరును దివాలాతీసినచో, లేక వ్యాపారము శాసనవిరుద్ధమగుచో ఫరమ్‌ను చాలించినట్లే యెంచవలెను.

(2) ఒడంబడికవలన : భాగస్థులు అందరిఅంగీకారముతో ఫరమ్‌ను ఎత్తివేయవచ్చును.

(3) కొన్నిసంఘటనలవలన : ఒక నిర్దిష్టకాలపరిమితి వఱకే పార్ట్నర్‌షిప్ పెట్టుకొనిన, ఆ పరిమితికాగానే పార్ట్నర్‌షిప్ అంతమగును. కాలపరిమితిలేనిచోగాని, పరిమితిదాటినను ఉమ్మడివ్యాపారము జరిపినగాని 'స్వచ్ఛందమైన పార్ట్నర్‌షిప్' అగును. అటువంటి పార్ట్నర్‌షిప్‌ను ఏ ఒక భాగస్థుడైనను ఫరమ్‌ను అంతమొందింపదలచినట్లు నోటీసుఇచ్చినచో అంతమొందును. ఒక పార్ట్నర్ చచ్చినను లేక దివాలాతీసినట్లు తీర్పుఇయ్యబడినను; పార్ట్నర్‌షిప్ ఖరారులో మరియొకవిధముగా లేనిచో, ఫరము అంతమొందును.

(4) కోర్టువారిచే : భాగస్థునికోరికపై ఈ క్రింది కారణములున్నచో కోర్టువారు ఫరమ్‌ను అంతమొందింతురు.

(I) భాగస్థునికి ఉన్మత్తత.

(II) వేరొకభాగస్తుడు తనవిధులను నిర్వర్తించుటకు శాశ్వతముగా అసమర్థుడగుట.

(III) వేరొకభాగస్తుడు అక్రమముగా ప్రవర్తించుట.

(IV) వేరొకభాగస్తుడు తనభాగమునంతయును అన్యాక్రాంతపరచుట.

(V) నష్టము లేకుండ వ్యాపారమును సాగించుటకు వీలుగాకపోవుట.

(VI) ఇతర ధర్మసమ్మతమైన కారణములు.

## 8. ఇంకొకనిపేర మార్చదగిన అప్పుపత్రములు

చట్టము :- నెగోషియెబుల్ ఇన్‌స్ట్రుమెంట్సు యాక్టు, 1881.
(అప్పుపత్రములచట్టము)

అప్పుపత్రములు :

వ్యాపారాభివృద్ధికి అప్పుపత్రములు గొప్పసహాయము చేసినవి. మొదట వ్యాపారము సాటా బేరముగా నుండెను. సరకునకు బదులు సరకుఇచ్చుట. ఇట్లు సరకులమార్పిడిని సాటా బేరము. కొంతకాలమునకు డబ్బునాణెముల నొసగి కొనుగోలుచేయుట తెలిసికొనిరి. డబ్బును కాగితపునోట్ల రూపములోనుంచుట తర్వాత కనుగొనిరి. డబ్బును ఒకచోటినుండి మరియొకచోటికి తీసికొనిపోవుట అపాయము. కనుక వర్తకులు నిరపాయమగు అప్పుపత్రములను కల్పించిరి. ఈ అప్పుపత్రములలో "అడగగానే" లేక "చూపగానే", లేక ఒక నిర్ణీతమైన తేదీన, కొంతసొమ్ము చెల్లించునట్లు వాగ్దానముగాని మరియొకరిని చెల్లింపుమని ఆదేశముగాని యుండ

డును. వీటిని డబ్బునకు ప్రత్యామ్నాయముగా ఉపయోగింపవచ్చును. వీనిని ఇంకొకరికి మార్చవచ్చును. వీనిలో స్వత్వము డబ్బులోవలెనే ఆత్మార్థముగ మొనర్చుకొనుటచేతనే సంక్రమించును. ఇటువంటి పత్రములలో ముఖ్యమైనవి చెక్కులు (హుండీలు = ధనాదేశములు), ప్రామిసరీనోట్లు. వీనినిగురించి తెలిసికొందము.

(1) కోశీవ్యాపారములో చెక్కులు :-

పేరయ్య కోశిలో (బ్యాంకులో) ఒక ఖాతాదారయినా డనుకొందము. అప్పుడు కోశీదారు ఒక చెక్కుపుస్తకమును ఇచ్చును. ఈ చెక్కును ఇంకొకనిపేర మార్చదగు అప్పుపత్రముగా ఎట్లు చెలామణీఅగునో తెలిసికొందము. క్రింద ఇయ్యబడిన నమూనా చెక్కును చూడదగును.

నెం. 57/408974 మచిలీపట్నం

............19 .

ఆంధ్రా బ్యాంకు

పేరు.............................లేక వాహకుడు / ఆర్డరుపొందినవాడు

రూపాయలు.......................

రూ॥——

ఈ చెక్కును క్రిందివిధముగా పేరయ్య పూర్తిచేయవచ్చును.

నెం. 57/408974 మచిలీపట్నం
1-1-1959

ఆంధ్రా బ్యాంకు

పేరు: శ్రీపిడుగు భీమయ్యగారికి లేక ఆర్డరుపొందినవారికి
రూపాయలు వెయ్యిమాత్రము ఇయ్యవలెను.

రూ. 1000/- పేరయ్యవ్రాలు.

చెక్కుయొక్క లక్షణములు :

(1) లిఖితపూర్వకమైన, బేషరతైన ఉత్తరువు.
(2) ఒకబ్యాంకుపై వ్రాయబడినది.
(3) బ్యాంకును ఒక నిర్ణీతమైన మొత్తమును యియ్యవలెనని కోరును.
(4) అడిగినప్పుడు ఇయ్యవలెనని తప్ప వేరేవిధముగా ఉండదు.
(5) ఒక నిర్దిష్టవ్యక్తికిగాని, అతని ఆర్డరుపొందినవారికిగాని, తెచ్చినవానికిగాని, ఇయ్యవలసినదిగా ఉండును.

పరిభాష :-

పేరయ్య చెక్కుజారీచేసినవారు(ఆహర్త = డ్రాయర్) పిడుగు భీమయ్య చెక్కువ్రాయించుకొన్నవారు (ఆదాత = పేయీ) చెక్కును భీమయ్యకు ఇవ్వగానే అతడు చెక్కు హక్కుదారుడు (హోల్డర్) అగును. చెక్కును వ్రాయించు

కొన్నవారికి ఇచ్చునవుటకు ప్రయోజనము లేదు. వ్రాయించు కొన్న వారిపరము చేసినపుడు చెక్కును జారీచేసినట్లు ఎంచ బడును.

పృష్టాంకనకరణము :–

'ఆర్డరుపొందినవారికి' అను మాటలవలన చెక్కును దాని వెనుక భాగమున చేవ్రాలుచేసి మరియొకనిపరము చేయ వచ్చును. "తెచ్చినవానికి" అనిమాత్రము ఉన్న చెక్కును వెనుక భాగమున చేవ్రాలుచేయకయే మరియొకనిపరముచేయ వచ్చును. వెనుకభాగమున చేవ్రాలుచేయుట పృష్టాంకన కరణము (ఎండార్సుమెంటు) అని అందురు. పోడి పృష్టాంకన కరణము చేవ్రాలుమాత్రము ఉండును. దీనివల్ల చెక్కును ఎవరు తెచ్చిన వారికి డబ్బు ఇయ్యవలెను. పూర్ణపృష్టాంకనకర ణములో ఎవరికి పైకము చెల్లింపవలెనో వారి పేరును వ్రాసి, దానిక్రింద సంతకముచేయుదురు. అప్పుడు ఆ నిర్దిష్టవ్యక్తికే పైకము చెల్లింపవలసియుండును. అతడు మరల పృష్టాంకనకర ణముచే చెక్కును ఇతరులపరము చేయువచ్చును.

పూర్ణపృష్టాంకనకరణమునకు నమూనా :

చెక్కు వెనుక వైపున

| |
|---|
| ఎల్లప్పకు చెల్లించవలెను<br>పిడుగు భీమయ్య |

ఎల్లప్పను చెక్కు "హోల్డరు" (పట్టుకొన్నవాడు = హక్కుదారుడు) అని అందురు.

హోల్డరు : సక్రమగతిలో హోల్డరు :-

హోల్డర్ చెక్కు హక్కుదారుడు అనగా తన పేరిట చెక్కును వశములో ఉంచుకొని, చెక్కుమూలముగా రావలసిన మొత్తమును వసూలుపరచుకొను అర్హతగలవ్యక్తి. చెక్కు వ్రాయించుకొన్నవారు, పృష్టాంకితగ్రహీతగా పొందిన వారు, తెచ్చినవానికి ఇయ్యవలసినదిగా చెక్కు ఉండినపుడు, చెక్కును తెచ్చినవారు చెక్కు-హక్కుదారులగుదురు. తాను చెక్కునుపొందినవారి చెక్కు-హక్కు లో దోషములున్నట్లు తలచుటకు సరియైన కారణములు లేనంత, ప్రతిఫలమునకు, పైకమును ఇయ్యవలసినకాలమునకు పూర్వమే, చెక్కునకు హక్కుదారుడయిన ఆతనిని సక్రమగతిలో హోల్డరు అందురు.

సక్రమగతిలో హోల్డర్ కుగల ప్రత్యేకమైన హక్కులు :-

సాధారణమైన హోల్డరుకన్న సక్రమగతి హోల్డరుకు కొన్ని ప్రత్యేకహక్కులు గలవు. వీనివలన చెక్కునుపొందిన వానికన్న మేలైనహక్కులు సాధింపవచ్చును.

వ్యాజ్యమునకు ప్రతివాదికిగల సమాధానములలో హోల్డరుకు వర్తించునవి కొన్ని సక్రమగతి హోల్డరునకు వర్తింపవు. ఈ క్రింది ఉదాహరణలవలన ఇది విశదమగును.

(అ) పూర్తికాని, స్టాంపు వేసిన పత్రమును పూరణచేయుట :

పేరయ్య ఒక చెక్కుపై తన సంతకముపెట్టినాడు. ఎంత పైకము ఇయ్యవలెనో తాను వ్రాయలేదు. చెక్కును వీరయ్య

కచ్చి జరూరునుబట్టి రు. 1000లకు మించకుండ వేసికొనమని చెప్పెను. వీరయ్య ఆ చెక్కుపై రు. 5000 లు వేసికొని, చెక్కును పృష్ఠాంకీకరణముచే కామయ్యాపరము చేసెను. ఆ చెక్కుతో కామయ్య రు. 5000లు బ్యాంకినుండి తీసికొనెను. పేరయ్య తాను 1000లు వఱకే చెక్కుపై వేసికొనుమని చెప్పితినని, కామయ్యనుండి రు. 4000లు ఇప్పింపుమని వ్యాజ్యేము తెచ్చెను. కామయ్య రు. 4000లు॥ ఇయ్యవలెనా? హోల్డరుఅయినచో ఇయ్యవలెను; సక్రమగతి హోల్డరయినచో అట్టి యావశ్యకత లేదు.

(అ) మరతుపై వశేము చేయుట :–

పేరయ్య ఒక చెక్కును వీరయ్యకు ఇచ్చి, బ్యాంకుకు పోయి డబ్బు తెచ్చి తనకు ఇమ్మని చెప్పెను. వీరయ్య పృష్ఠాంకీకరణముచే చెక్కును కామయ్యాపరము చేసెను. కామయ్య వసూలుపఱచుకొని తానే డబ్బును ఉంచుకొనవచ్చునా? సక్రమగతి హోల్డరయినచో అట్లు చేయవచ్చును.

(ఇ) చెక్కుపోవుట; మోసము మొదలగునవి :–

పేరయ్య ఒక చెక్కును తీసికొనివచ్చినవానికి వసూలు ఇచ్చునట్లు వ్రాసెను. దానిని వీరయ్య దొంగిలించి కామయ్యాపరము చేసెను. కామయ్యకు చెక్కునువసూలుచేసికొనుఅర్హత గలదా? హోల్డరయిన లేదు; సక్రమగతి హోల్డరయినచో కలదు. చెక్కు పోయినదనికాని, మోసముగా గైకొనబడినదనికాని, చెప్పినచో సక్రమగతి హోల్డరుహక్కులకు భంగము లేదు.

చెల్లింపకపోవుట :-

చెక్కును బ్యాంకులో చూపినప్పుడు వసూలుగాక పోయిన, చెక్కు హోల్డరుడు తనకంటె ముందుగా చెక్కుతో సంబంధముగల వ్యక్తులకు చెక్కు చెల్లింపలేదని తెలియపఱపవలెను. ఆ వ్యక్తులు అతనికి పూటగా (జామీను) ఉందురు. ఈసంగతి తెలిసిన చెక్కుతో సంబంధముగల వ్యక్తులు తమకంటెముందే సంబంధముగలిగి తమకుపూటగా ఉండవలసినవారికి నోటీసు ఇయ్యవలెను. అనగా సమాచారము తెలియపఱపవలెను. పేరయ్య చెక్కును జారీ చేసెను. వీరయ్య, కామయ్యలు పృష్ఠాంకనకరణకర్తలు, భీమయ్య హోల్డరు. చెక్కు చెల్లలేదు. కామయ్య భీమయ్యకు చెక్కుడబ్బు చెల్లించెను. అప్పుడు కామయ్య వీరయ్యయొద్దగాని పేరయ్యయొద్దగాని పైకమును వసూలుచేసికొనవచ్చును. వీరయ్య పైకమును చెల్లించిన, పేరయ్యయొద్ద తాను వసూలు చేసికొనవచ్చును.

పృష్ఠాంకనకరణకర్త తర్వాత హోల్డర్లకందఱికి చెక్కు చెల్లని యెడల జవాబుదారీ గలిగియుండును. అట్టి జవాబుదారీకపోకుండ జేసికొనదలచిన పృష్ఠాంకనకరణములో "నా జవాబుదారిలేకుండ" అని వ్రాయవలెను.

చెక్కు విమోచనము :-

చెక్కుపై తుదిజవాబుదారీగలవారు తనువిధిని నిర్వర్తించినప్పుడు చెక్కుకు విమోచనముగల్గును. బ్యాంకువారు సక్రమగతి చెల్లించిన ఈ ఫలితము సిద్ధించును. సక్రమగతి చెల్లిం

చుట యనగా : (1) చెక్కుపై కనబడుచున్న విధముగా (2) అజాగ్రత్తలేకుండ విశ్వాసముతో (3) చెక్కు వశముతో ఉన్నవారికి (4) పైకము చెల్లించినవారికి తీసికొను హక్కు లేదని అనుకొనుటకు తగిన కారణములులేకుండు సందర్భములో చెల్లించుట.

అడ్డముగా గీతలుగీయుట (క్రాసింగ్ = రేఖిత హుండీ):-

చెక్కును హోల్డరు బ్యాంకులో ఇచ్చి వసూలుచేసికొనును. హక్కులేనివారిచేతిలో చెక్కు పొరపాటున పడి అతనిచేత వసూలుపరచుకొనబడు అవకాశముగలదు. ఈ పరిస్థితిరాకుండ నివారించుటకు రక్షణోపాయమే "క్రాసింగ్". సాధారణమైన క్రాసింగ్ పై చెక్కులో రెండు అడ్డగీతలు సమాంతరముగా గీయుదురు. ఆ అడ్డగీతల మధ్యమందు "అండ్ కంపెనీ" అని గాని "అండ్ కో" అని గాని వ్రాసిన వ్రాయవచ్చును. కాని యిది అంత ముఖ్యముకాదు. దీని వలన చెక్కును వసూలుపరచుహక్కు ఒక బ్యాంకికి మాత్రమే ఉండును. ఏదో ఒకబ్యాంకిలో ఖాతాలో జమ కట్టుకొని వసూలుపరచుకొనుట ఆవశ్యకమగును. నేరుగా చెక్కును బ్యాంకుకు తీసికొనిపోయి హోల్డరే వసూలు పరచుకొనుటకు వీలుండదు. దీనివలన హక్కులేనివారు దగాగా చెక్కును వసూలుపరచుకొను అపాయము తగ్గును. క్రాసింగ్‌లో రెండు అడ్డగీతలకు నడుమ ఒకబ్యాంకువారి పేరు వ్రాసిన ఆ బ్యాంకువారే దానిని వసూలుపరపవలెను. దీనిని "ప్రత్యేకక్రాసింగ్" అందురు.

## క్రాసింగ్‌ల నమూనాలు

సాధారణమైన క్రాసింగ్:

| | |
|---|---|
| అండ్ కో | నం. బి. 15374 ఢిల్లీ 1-1-59 |
| | ఆంధ్రా బ్యాంకు |
| | పే (చెల్లించు) భీమయ్య లేక తెచ్చినవారు |
| | రూపాయలు వెయ్యి మాత్రము |
| | రూ. 1000/- పేరయ్య. |

ప్రత్యేకమైన క్రాసింగ్:

| | |
|---|---|
| నం. బి. 15374 ఢిల్లీ 1-1-59 | |
| ఆంధ్రా బ్యాంకు | ఇండియన్ బ్యాంక్ |
| పే (చెల్లించు) భీమయ్య లేక ఆర్డరుపొందినవారు | |
| రూపాయలు వెయ్యిమాత్రము | |
| రూ. 1000/- పేరయ్య. | |

నాట్ నెగోషియబుల్ (వేరొకరికి మార్చరాదు):-

చెక్కును క్రాసుచేసినపుడు అడ్డగీతలనడుమ "నాట్ నెగోషియబుల్" అని వ్రాసినచో చెక్కును "పృష్ఠాంకీకరణము"చే ఇంకొకరికి ఇచ్చినను పుచ్చుకొన్నవారికి ఇచ్చినవారి హక్కులు రావు.

| | | |
|---|---|---|
| నెం. 15375 | | ఢిల్లీ 1-1-59 |
| ఆంధ్రా బ్యాంకు | | |
| పే (చెల్లించు) భీమయ్య | పేరయ్య భీమయ్య & కో | లేక తెచ్చినవారు |
| రూపాయలు వెయ్యిమాత్రము | | |
| రూ. 1000/- | | పేరయ్య. |

దొంగసంతకముల (ఫోర్జరీ) ఫలము :-

ఒకచెక్కును తనసంతకముతో పేరయ్య భీమయ్య కిచ్చెను. కామయ్య చెక్కును దొంగిలించి, తానే పేరయ్య సంతకముచేసి బ్యాంకులో పైకముతీసికొనెను. సక్రమముగా బ్యాంకువారు ఫోర్జరీసంగతి తెలియక పైకమునిచ్చిన, వారికి జవాబుదారీయుండదు. తాను ఇచ్చినపైకమును పేరయ్య ఖాతాలో ఖర్చు వ్రాయనచ్చును. పేరయ్యకూడా భీమయ్యకు పైకము చెల్లించినట్లే గణింపవచ్చును. అగుచో పేరయ్య చెక్కులో సంతకమేచేయలేదనుకొందము. భీమయ్య చెక్కును దొంగిలించి, పేరయ్యపేరు దొంగసంతకముచేసి పైకమును బ్యాంకిలో తీసికొనెననుకొందము. అప్పుడు పేరయ్యఖాతాలో ఆ మొత్తమును బ్యాంకువారుఖర్చువ్రాయవచ్చునా? వీలులేదు. బ్యాంకువారు తమ ఖాతాదారగు పేరయ్యచేవ్రాలు సరిగా గుర్తుపట్టవలెను. ఖాతాదారుసంతకమునే దొంగచేవ్రాలుచేసి ఎవరైన బ్యాంకును మోసగించిన పేరయ్యకు ఆ నష్టము రాగూడదు. బ్యాంకువారే భరింప

పలెను. అందుచేత బ్యాంకువారు "చెక్కు పుస్తకమును భద్రముగా ఉంచుకొనుడు" అని హెచ్చరింతురు.

## 4. ప్రామిసరీనోటు (అప్పుపత్రము)

### మాదిరి అప్పుపత్రము

| | |
|---|---|
| రూ. 1000/- | గుంటూరు 1-1-59 |

తెనాలి కొత్తపేటలో నెం॥ 2 గృహములో నివసించు పిడుగు భీమయ్యగారికి 1000 రూ॥లు నెలకు నూటికి రు 0-8-0ల చొ॥న వడ్డీతో అడిగినప్పుడు ఇయ్యగలవాడను. ఇది నా సమ్మతిని వ్రాసి యిచ్చిన ప్రామిసరీనోటు.

పేరయ్య.

అప్పుపత్రముయొక్క ముఖ్యలక్షణములు :

అప్పుపత్రమునకు ఈదిగువ వివరింపబడినవి ముఖ్యలక్షణములు.

(1) లిఖితపూర్వకముగా ఉండును.

(2) బేషరతుగా పైకమును చెల్లించుటకు ప్రతిజ్ఞ యుండును. షరతుఉన్న ప్రామిసరీనోటు గాదు. ఒక పత్రములో "నా వీలునుబట్టి యియ్యగలవాడను" అని గాని "కామయ్య నాకు రావలసిన బాకీ చెల్లించినచో ఇయ్యగలవాడను" అని గాని వ్రాసినచో ప్రామిసరీనోటుగా భావించుటకు వీలులేదు.

(3) అప్పుతీసికొనినవారు ప్రామిసరీనోటుపై సంతకము చేయవలెను. లేక ఆనవాలు ఉంచవలెను. ఆనవాలుగా బొటనవ్రేలిముద్ర సాధారణముగా ఉంతురు.

(4) ప్రతిజ్ఞ డబ్బునే యిచ్చునటుల ఉండవలెను. "20 బస్తాలవడ్లు అడిగినపుడు ఇయ్యగలవాడను" అని యున్నచో ప్రామిసరీనోటుకాదు.

(5) డబ్బు ఎంత యియ్యవలసినది స్పష్టముగా అసందిగ్ధముగా ఉండవలెను.

(6) అప్పుపత్రము ఎవరిపేర వ్రాసినది నిశ్చయముగా ఉండవలెను. అతడు ఎవరయినదీ తెలిసికొనుటకు వీలుగా ఉండవలెను. అందుకే తండ్రిపేరు, కులము, మతము, విలాసము మొదలగునవి చేర్చుట మామూలు.

వర్తించువిధులు :—

ప్రామిసరీనోటునకు, చెక్కునకు కొద్ది భేదములు మాత్రము కలవు. ఇందు అప్పుతీసికొనినవ్యక్తి చెల్లించునట్లుండును. చెక్కులో అతని కోశి (బ్యాంకు) చెల్లించునట్లుండును. ప్రామిసరీనోటువ్రాసినవ్యక్తి చెక్కును చేవ్రాలు చేసియిచ్చినవానిస్థానముననుండును. చెక్కును పృష్ఠాంకన కరణముచే ఇతరులపరముచేసినట్లే ప్రామిసరీనోటునుకూడ చేయవచ్చును. "నాట్ నెగోషియబుల్" అని యున్నచో ప్రామిసరీనోటును ఇతరులకు పృష్ఠాంకనకరణము చేయరాదు.

# ఐదవభాగము

# దండశాస్త్రము

## చట్టము :- పీనల్ కోడ్ (శిక్షాస్మృతి)

## 1. సాధారణ సూత్రములు

**నేరము :-**

హత్య, దొంగతనము మొదలగునవి నేరములు. ఇవి హత్యగావింపబడినవాడు, సొత్తు దొంగిలింపబడినవాడు, నేరముచే పీడింపబడినవాడును మాత్రమేకాక, రాజ్యములోని జనసామాన్యమందరికి భయోత్పాతకరములు. అందుచే నేరము రాష్ట్రమునకే జరిగిన అపరాధముగా గణింపబడును. నేరస్థులపై రాష్ట్రముతరఫున "రాజ్యాంగ నిర్వాహకుడు" (పబ్లిక్ ప్రాసిక్యూటరు) ఫిర్యాదుచేయుచున్నాడు. ఫిర్యాదు ఆరోపింపబడినవాడు ముద్దాయి. నేరము ఋజువైనప్పుడు అపరాధి(నేరస్థుడు)ని న్యాయస్థానముశిక్షించును. మన దేశములో ప్రస్తుతము అమలులోఉన్న శిక్షలు : ఉరితీయుట; జన్మాంతర నిర్బంధము; నియమితకాలనిర్బంధము; కఠినమైనపని (చాకిరి చేయింతురు); సామాన్యనిర్బంధము; ఆస్తిని స్వాధీనముచేసి కొనుట; జరిమానా విధించుట. కొరడాతో కొట్టుట 19-12-55 నుండి చట్టమూలముగా నిషేధింపబడినది.

**శిక్షయొక్క ప్రయోజనము :-**

నేరములనుచేయ సాహసించువారికి భయముగల్గించి నేరములను అరికట్టుటయే శిక్షయొక్క ముఖ్యప్రయోజనము.

ఈ ప్రయోజనమును సాధించుటకై ఘోరాతిఘోరమైన శిక్షలను పూర్వకాలములో విధించుచుండిరి. పూర్వము కుంభీపాకమనే శిక్ష ఉండెడిది. అపరాధిని సలసలకాగుచున్న నూనె అండాలో ముంచి క్రూరముగా వండునారు. ఈ ఘోరశిక్ష రాణితో వ్యభిచరించిన నేరమునకే విధించుచుండెడివారు. జారజులు సింహాసనమధిష్ఠింపకుండ కాపాడుకొనుటకు ఈ శిక్షను ఉపయోగించుచుండిరి. నేటికాలములో అపరాధిని సంస్కరించి, సన్మార్గవర్తిగా చేయుటకూడ శిక్షాస్మృతియొక్క లక్ష్యమైయున్నది.

నేరమునకు జవాబుదారి :-

శిక్షను విధించుటకుముందు గమనింపవలసిన ముఖ్య విషయములు (1) చేయబడిన కార్యము శిక్షాస్మృతిచే నిషేధింపబడినదా ? (2) ముద్దాయికి దుష్టమనస్సు కలదా ? నిషేధింపబడిన పనిని ఉద్దేశపూర్వకముగా చేయుట లేక నిర్లక్ష్యమువలన చేయుట దుష్టమనస్సునకు నిదానములు. శిక్షాస్మృతిలో ఏ అపరాధమునకు ఎట్టి దోషయుతమనస్సు కావలెనో అపరాధనిర్వచనములోనే సాధారణముగా ఉండును.

(అ) జవాబుదారి లేమి :

దోషయుతమనస్సు లేనిచో నేరమునకు జవాబుదారి లేకపోవచ్చును. ఇది సంఘటించు సందర్భములు:

(1) పొరపాటు :-

న్యాయశాస్త్రము తెలియనందున పొరపాటు జరిగి

నదని కోర్టువారు మన్నింపరు. ప్రతి మానవునకు న్యాయశాస్త్రము తెలిసియుండవలెనని భావము. పరిస్థితి వలన, పొరపడితినను ప్రతివాదము కొన్ని నిబంధనలకులోబడి అంగీకరింపబడవచ్చును.

నిబంధనలేవన: (I) పొరపాటు సహేతుకముగా నుండవలెను. పేరయ్య ముద్దాయి. రంగయ్యగారి ముక్కును కత్తితో కోసెనని ఇతనిపై నేరారోపణ చేయబడెను. తన కత్తి మాంత్రికమైన కత్తియనియు, అందుచే దానితో ఒక ముక్కునుకోసిన ఇంకొక సొంపయిన నాసిక కోయబడిన దానిస్థానము నాక్రమించునని తాను నమ్మియుంటినియు, ఆ నమ్మకముతో పొరపాటు జరిగినదని పేరయ్య ప్రతివాదించెను. పొరపాటు సహేతుకముగా లేదు గనుక, ఈ ప్రతివాదము నంగీకరింపవీలులేదు.

(II) పొరపాటుగా నమ్మినది నిజమైయున్నచో చేసిన పని శిక్షార్హమైనదిగా ఉండరాదు. ఒకడు వెండిగిన్నెను దొంగిలించెను. ఫిర్యాదునకు ఇతడు చెప్పినట్టి సమాధానము: "ఇది పొరపాటువల్ల జరిగినది. గిన్నె బంగారుదని భ్రమపడితిని." ఈ ప్రతివాదము నిష్ఫలము. గిన్నె బంగారుదైనను దొంగతనము శిక్షార్హమే కదా. పేరమ్మభర్తయైన పేరయ్య నౌకాయాత్రకు పోయెను. నడిసముద్రములో నావ మునిగెను. కొంతమందిని వేరొకనావ తీరమునకు చేర్చెను. ఈవిధముగా బ్రతికినవారి పేరులు దినపత్రికలలో ప్రకటింపబడెను. పేరమ్మభర్తపేరు ఈ జాబితాలో లేదు. పేరమ్మ చాల దుఃఖించి, దుఃఖోపశమనమునకు మరియొకనిని వివా

హాము చేసికొనెను. కొంతకాలమునకు పేరయ్య తిరిగి వచ్చెను. పేరమ్మ ఇద్దరుభర్తలను పెండ్లాడిన నేరమునకు గురి యయ్యెను. అపరాధారోపణము నిలుచునా? నిలవదు. పేరమ్మచేసినది పొరపాటు. ఆమె భర్త మరణించెనని భావించెను. అదే నిజమైనచో ఆమె రెండవవివాహము దోషము కాదు. కనుక ఆమెపైన నేరమునారోపించుటకు తావులేదు.

(2) ఆకస్మిక ప్రమాదము :-

ఒక పనిని చేయుటలో దానిపర్యవసానములు ఉద్దేశ పూర్వకములుగానిచో ఆపని ఆకస్మిక ప్రమాదముగా గణింపవలెను. దశరథుడు బుడబుడమను శబ్దమును విని అడవిఏనుగ నీళ్ళుత్రాగుచున్నదని ఊహించి, బాణమువిడువగా ఒక ముని కుమారునకు తగిలి అతడు మరణించెను. బాణము వేయుటలో దానిపర్యవసానమగు మునికుమారుని మరణము ఉద్దేశింపబడ లేదు. కనుక ఇది ప్రమాదము. ఆ పరిస్థితులలో ఏమరుపాటు అజాగ్రత్త లేనియెడల, ఇది ఆకస్మికప్రమాదము. ఆకస్మిక ప్రమాదమునవలన గలిగిన సంఘటనకు న్యాయశాస్త్రములో జవాబుదారీ లేదు.

(3) బాల్యము :-

7 సంవత్సరములునిండనివారు నేరముచేసినను శిక్షకు అనర్హులు. 7 సంవత్సరములకుపైన 12 సం॥ల లోపుగల అపరాధి తాను చేయుచున్నపనిని దానిపర్యవసానములను అర్థముచేసికొనగల మనోసామర్థ్యమున్ననే శిక్షకు పాత్రుడగును.

చిన్నవయస్సుగల నేరస్థులు :-

చిన్న నేరస్థులను వయస్సుముదిరిన సాధారణ నేరస్థుల వలె చూడదగదు. మామూలు జెయిలులలోను వారిని పంపిన, వారు మొండితేలిన నేరస్థులుగా తయారగుదురు. కనుక వారికి ప్రత్యేకచికిత్స అవసరము. రిఫార్మేటరీస్కూల్సు ఆక్టు (1897) క్రింద 15 సం॥లునిండని అపరాధులను రిఫార్మేటరీ స్కూలు (సంస్కరణాత్మకపాఠశాల)కు పంపవచ్చును. ఈ పాఠశాలలు రాష్ట్రీయగవర్నమెంటుచే ఏర్పాటుచేయబడి, ఒక సూపరింటెండెంటు అధికారముక్రింద ఉండును. పరిశీలక సంఘము నెలకొకసారి పాఠశాలలకువచ్చి, అక్కడ నివసించు వారి మొఱలనుఆలకించి నివారణోపాయములనుఆలోచింతురు. వివిధరాజ్యాలలో చిన్నవయసువారిని విచారించుటకు ప్రత్యేక న్యాయస్థానములు, వారికి క్రమశిక్షణనిచ్చుటకు బార్‌స్టల్ స్కూళ్ళును గలవు.

(4) వెఱ్ఱి :-

అపరాధి వెఱ్ఱివాడయినచో శిక్షాస్మృతిక్రింద బాధ్యత యుండదు. తానుచేయుచున్న పని యెటువంటిదో తెలిసికొనుటకు అసమర్థతగాని, తానుచేయుచున్న పనితప్పనియు, న్యాయశాస్త్రవిరుద్ధమనియు తెలిసికొనజాలని మనోదౌర్బల్యము వెఱ్ఱి. ఒక్కొక్కప్పుడు మతిభ్రమముచేత చేయుచున్న పని ఎట్టిదో సరిగా తెలియకుండును. అటువంటిపనులకు, చేయుచున్నవాడు ఏ మతిభ్రమములోనుండెనో ఆ భ్రమయే సత్యమైనచో ఎటువంటి బాధ్యతయుండునో అట్టిబాధ్యతమాత్రమే ఉండును.

భీమప్ప, జోగప్ప అను ఇరువురు వెఱ్ఱివాళ్ళు వారి ముసలిసేనమామయొద్ద ఉండిరి. ఒకరోజున వారిద్దరు ఆ ముసలివానిని చంపిరి. భీమప్ప తనమామయ్య ఒక విషసర్ప మన్న మతిభ్రమము కలుగగా అతనిని చంపెను. విష సర్పమును చంపుట తప్పుకాదు. అందుచే ఇట్టి మతిభ్రమము భీమప్పపక్షమున ఋజువైనచో అతనిని శిక్షాస్మృతిక్రింద శిక్షింపరు. జోగప్ప మతిభ్రమముచే తన మామ చందా వసూలుచేయుటకువచ్చిన సంఘసంస్కరణసంచాలకుడని తల చెను. అందుచే అతనిని చంపెను. మతిభ్రమముచే తలపోసి నది సత్యమైనను చేసినపని అపరాధమే. అందుచే జోగప్ప మతిభ్రమము అతనిని శిక్షాస్మృతినుండి రక్షింపలేదు.

అపరాధ మతిభ్రమమును ఋజువుపరచిన శిక్షాస్మృతి నుండి రక్షింబడును. కాని ఆ ఉన్మాదుని పిచ్చివారివైద్య శాలలో ఉంచునటుల తీర్పుచెప్పుదురు.

(5) త్రాగుడు :-

కొన్ని రాష్ట్రములలో త్రాగుట నేరము. అట్లుకాని చోట్ల త్రాగియున్నప్పుడు చేసిన అపరాధములకు త్రాగి యున్నపుడు చేయబడుట ఒకసమయములో రక్షణమార్గ మగును. కావలెనని త్రాగి అపరాధముచేసినచో అది శిక్షణీ యమే. మైకముకలిగించు సారాను సందితునకు తెలియకుండ అతని అంగీకారంలేకుండా వేరొకడు సందితునిచే త్రాగించిన ఆ మైకములో అతడు చేసిన అపరాధము క్షంతవ్యము.

(6) నిర్బంధము :

అపరాధమునుచేయకున్నచో చంపెదమని భయ

పెట్టి ఒకనిచేత అపరాధమును ఇతరులు చేయించిన అతడు శిక్షకనర్హుడు. చేసిన నేరము హత్యకుగాని, రాష్ట్రమునకు కీడాపాదించి, మరణశిక్షవిధించుటకు ఆస్పదమగు అపరాధమునకుగాని గుఱిఅయినచో యీ సూత్రము వర్తింపదు.

(ఆ) ఇతర ప్రతివాదములు :

దుష్టమనస్సుఉన్ననూ, కొన్నిపరిస్థితులలో ఇంకే ప్రయోజనకరమైన పరిస్థితులుంటుటచేగాని శిక్షనుండితప్పించుకొనవచ్చును.

(I) న్యాయశాస్త్రచోదితమైన కర్మముగా భావించి చేయబడిన అపరాధము : ఒక పోలీసుఉద్యోగి చెంచయ్యను పట్టుకొని నిర్బంధములో ఉంచియుండవలసియుండెను. పొరపాటున గంగయ్యనుచూచి అతడే చెంచయ్యఅని తలపోసి అతనిని నిర్బంధములో ఉంచెను. అతనిఅపరాధము శిక్షింపబడదు.

(II) న్యాయమూర్తి న్యాయవిచారణసందర్భములో చేసినది.

(III) క్లిష్టపరిస్థితి : జోగయ్యఇంటికి నిప్పంటుకొనెను. మంటలు వ్యాపించిన ఇతరులప్రాంగణమునకు లేక ఆస్తికి నష్టముసంభవించుస్థితి ఏర్పడెను. ఆస్థితిలో భీమయ్య జోగయ్య ఇంటిని కూలద్రోసెను. భీమయ్య చేసినది నేరము కాదు.

(IV) అంగీకారము :– 18 సంవత్సరములుదాటిన వ్యక్తి తనకు హాని సంభవించు ఒకపనికి అంగీకరించిన, ఆ పని నేరముకాదు. ఆ పని అతనికి మరణముకలిగించుటకుగాని,

ఉపద్రవకరమయిన గాయముకలుగజేయుటకుగాని ఉద్దేశింపబడినది కారాదు. ఒక వస్తాదు ప్రతికక్షిని ముష్టియుద్ధంలో గాయపరచిన అది నేరముకాదు. విషయముల నిజస్థితి గ్రహింంపక ఇచ్చినఅంగీకారము నిష్ప్రయోజనము. ఒక పాముమంత్రగాడు తనమంత్రశక్తిచే పాముకాటు కుదర్చగలనని చెప్పి నమ్మించి, ఒప్పించి జోగయ్యను పాముచే కరపించెను. జోగయ్య చనిపోయెను. పాముచే కరపించుకొనుటకు ఒప్పుకొనినను, మంత్రముచే విషమును అరికట్టగలడను తలంపుతో అతడు ఒప్పుకొనెను. అందుచే జోగయ్య అంగీకారమువలన మాంత్రికుని బాధ్యత పోదు. అందుచే శిక్షకు పాత్రుడగును.

(5) అల్పహాని :-

సామాన్యమానవుడు పాటించని హాని అపరాధము గాదు. క్రిక్కిరిసియున్న రైలుపెట్టెలో భీమయ్య జోగయ్య కాలుపై త్రొక్కెను. తనపై అపరాధిచే బలప్రయోగము చేయబడినదని జోగయ్య ఫిర్యాదుచేయుట హాస్యాస్పదము.

(6) ఆత్మరక్షణ :-

ఆత్మరక్షణార్థముకలుగజేసినహాని నేరముకాదు. పోలీసువారి సహాయమర్థించుటకు అవకాశములేని పరిస్థితులలో ఆత్మరక్షణయే తరుణోపాయము. ఆత్మరక్షణకు అవసరమగు వరకే హాని చేయవచ్చును. సర్కారుఉద్యోగి తన ఉద్యోగ ధర్మమును నిర్వర్తించుచున్నానని విశ్వసించి ప్రవర్తించు నప్పుడు, అతనివలన మరణముగాని, ఉపద్రవమగు గాయము

కాని కలుగుచున్న భయమును లేనప్పుడు, ఆత్మరక్షణహక్కు-వర్తింపదు.

ఈ హక్కును వినియోగించునప్పుడు తన శరీరమును గాని, ఇతరులశరీరమునుగాని మనుష్యశరీరమునకుసంబంధించిన నేరములనుండి రక్షింపవచ్చును. అట్టి రక్షణలో క్రింది పరిస్థితులలో పైబడ్డవాని ప్రాణమునుకూడ హరింపవచ్చును.

(I) స్త్రీని చెఱపట్టుటకుగాని, ప్రకృతి విరుద్ధముగా కామేచ్ఛను తీర్చుకొనుటకుగాని, మనుష్యాపహరణమునకు గాని, అక్రమనిర్బంధములో నుంచుటకుగాని ప్రయత్నము జరిగినప్పుడు, సినిమాలను చూచువారికి, డిటెక్టివ్ కథలు చదువువారికి, కథానాయకి దుష్టునిచేతిలోపడి మానము గోల్పోవు పరిస్థితిలో చిక్కుకొనినప్పుడు కథానాయకుడు రంగముమీదికి సింహమువలె నురికి దుష్టుని వధముట్టించి, కథానాయకిని రక్షించుట పరిపాటియని తెలిసియేయుండును. కథానాయకుని ప్రతిక్రియ ఆత్మరక్షణక్రింద సరియైనదే. ఆత్మరక్షణహక్కును తనదియొక్క లేక పరులదియొక్క స్థిర చర రూపములయిన ఆస్తులను దొంగిలింత, కుచేష్ట, అక్రమ ప్రవేశము నెదుర్కొనుటలలో ప్రయోగింపవచ్చును.

ఆ స్తిని రక్షించుకొనుటలో దోషకారికి ప్రాణాపాయము కల్గించుటకూడ. ఈ క్రిందిపరిస్థితులలో క్షంతవ్యము:

(I) బందిపోటును అరికట్టుటలో

(II) రాత్రివేళ కన్నపుదొంగతనమును అరికట్టుటలో

(III) మనుష్యులు నివసించు ప్రదేశములో లేక

చరమగుఆ స్త్రీని భద్రముచేయు స్థలములో అగ్నితోడి తుంటరి తనముచేయుటను ఆపుటలో

(IV) చాం.గో, ఉపద్రవమగుగాయమో కల్గునను భయమునుకల్గించు దొంగతనమునుగాని, తుంటరితనమును గాని, ఇంటిపై అతిచారమునుగాని ఆపుటలో.

ఇతరపరిస్థితులలో ఆ స్త్రీనిసంరక్షించుకొనుటలో దోష కారిప్రాణమును తీయరాదు. ఒక చాతుర్యము లేని దొంగ ఇంటిగోడలో కన్నము వేసి, లోనికిప్రవేశింప ప్రయత్నించెను. తల ఆ కన్నములో ఇరుకుకొనిపోయి ఎటుపోవుటకును వీలు లేకపోయెను. ఇంటివారు లేచి వానిని బడితెలతో కొట్టి చంపిరి. ఆత్మరక్షణహక్కు ఇక్కడ వర్తించునా? వర్తింపదు. ఆత్మరక్షణలో తనపై ప్రయోగింపబడిన అపరాధిక బలమును ఎదుర్కొనుట కనబడవలెను. ఎదుర్కొనుటలో ఉపయోగించిన బలము అపరాధికబలముకన్న ఎక్కువా తక్కువా అని బంగారుత్రాసుతో తూచినట్టు కాకపోయినను, ఆత్మరక్షణకు ఉపయోగింపవలసిన శక్తిని కలహమునకు కాలు దువ్వుటలో దుర్వినియోగముచేయరాదు.

నేరమునకుప్రయత్నము :-

నేరముచేయుటకు ప్రయత్నించుటకూడ నేరమే. ప్రయత్నమునకు నేరముచేయుతలంపు నేరముచేయుటకు సిద్ధపడుటను మించినదిగా ఉండవలెను. పేరమ్మ భర్తతో కలహించి, బావిలోపడుదునని బావివైపునకు పరుగెత్తెను. భర్త బేజారై ఆమె వెంట పరుగెత్తి బావిలోపడకుండ పట్టుకొనెను. ఆత్మహత్యాప్రయత్నపు నేరమును ఆమెపై

ఆరోపింపవచ్చునా? వీలులేదు. ఆత్మహత్యకు సంసిద్ధత మాత్రమే కలదుగాని, ప్రయత్నమువరకు రాలేదు. ఆమె భర్తయొక్క ప్రేమను పరీక్షించుటకు ఈ నాటకమాడిన దేమో! నేరపు ప్రయత్నమునకు అపరాధిక దుష్టబుద్ధి చేసినపనియందు స్పష్టముగా గోచరింపవలెను. నేరముచేయు ఉద్దేశముగాదని వేరొక వివరణము చెప్పుటకు ఆస్పదము లేకుండ ఉండవలెను. జోగయ్య భీమయ్యపైన తుపాకిని కాల్చెను. గుండు గురితప్పుటచే భీమయ్య బ్రతికెను. ఇది హత్యాప్రయత్నము. ఒక జేబుదొంగ ఆశతో ఒక మార్గస్థుని జేబులో దూర్చెను. ఆ జేబులో సంచిలేదు. దొంగ పట్టువడెను. ఇది దొంగతనముచేయుటకు ప్రయత్నము. సాధారణముగా ప్రయత్నమునకు శిక్ష పూర్తిఅయిన నేరమునకుగల ఖయిదుశిక్షలో సగము ఉండును.

## అమోఘాపరాధములు

(I) నరహత్య :-

(అ) ఖూనీ (లేక) వధ (శిక్షాస్మృతి సెక్షను 300)

(ఆ) ఖూనీ కాని దురాగతపుహత్య (సెక్షను 299,300)

(ఇ) దుడుకుతనము నిర్లక్ష్యములవలన చావును కల్గించుట (సెక్షను 304ఎ)

అన్నిటికన్న గురుతరమైన నేరము నరహత్య. ఇది ఖూనీఅయిన ఉరిశిక్ష లేక జన్మాంతపు ద్వీపాంతరవాస జరిమానాయు విధింపబడును. ఖూనీకాని హత్యఅగుచో జన్మాంతపు

ఖైదు లేక 10 సంవత్సరములఖైదు మరియు జరిమానా విధింప బడును. దుడుకుతనము, నిర్లక్ష్యమువలన కల్గిన చావయిన 2 సం॥ల ఖైదు. నరహత్య వీనిలో ఏదైనదియు పరిస్థితులపై ఆధారపడియుండును.

(1) భీమయ్య జోగయ్యను హత్యచేయుటకు తలపై ఒక బడితెతో మోదెను. జోగయ్య స్మృహతప్పి పడిపోయెను. జోగయ్య మరణించెనని భావించి, ఆత్మహత్యచేసికొన్నట్లు కనబర్చుటకై ఒక తాడుతో మెడకు జారుముడివేసి ఇంటి దూలమునకు వ్రేలాడదీసెను. దీనివలన జోగయ్య ప్రాణము పోయెను. భీమయ్యపై ఖూనీనేరము మోపవచ్చునా ?

ఖూనీనేరమునకు హత్యచేయు సంకల్పముండవలెను; ఆ సంకల్పము ఈడేరవలెను. జోగయ్యను బడితెతో మోదినపుడు ఈ సంకల్పముండెనుగాని, అది ఈడేరలేదు. కనుక ఈ దశలో ఖూనీ లేదుగదా! రెండవదశలో జోగయ్య వ్రేలాడదీయుటచే ప్రాణమును గోల్పోయెను. కాని ఇదివరకే అతడు చనిపోయినాడని భావించుచున్న భీమయ్యకు అతనిని ఇంక చంపవలెనన్న సంకల్పము ఎట్లుండును ? కనుక ఈ దశలోకూడ ఖూనీకాదనియేకదా తేలును. కాని జరిగినసంఘటనను ఈవిధముగా దశలుగా విభజింపక అంతటిని కలయ జూచినచో హత్యాసంకల్పము, అది కొనసాగుట రెండును ఉన్నట్లు తేలును. కనుక ఖూనీనేరము భీమయ్యపై ఆపాదింప వచ్చును.

(2) వెంకయ్య ఇంటికివచ్చునప్పటికి ఆతనిభార్య పాపమ్మ ఒకవిటునితో సంభోగించుచుండెను. వెంకయ్య

పాపమ్మనుగాని, ఆమెవిటునిగాని, ఇద్దరినీగాని ఆవేశములో చంపిన, అతను ఖూనీచేసినట్లేనా? హఠాత్తుగా కోపమును రేపుపరిస్థితులు ఖూనీని ఖూనీకాని హత్యగా నేరమును తగ్గించును. భార్య ఇతరునితో సంభోగించుటను చూచుట అట్టి కోపమును రేపు పరిస్థితి గనుక నేరమును ఖూనీగా తలపరాదు. పరునితో సంభోగించుచున్న స్త్రీ భార్యగాక నేరస్తునికి తోబుట్టువు, తల్లి, తనసంరక్షణలోనున్న సోదరునిభార్య అయినచోగూడ ఇదేసూత్రము వర్తించును. ప్రత్యేకముగా ఉంచుకొనిన ఉంపుడుగత్తెకుకూడ యీసూత్రము నన్వయింపవచ్చును. కాని దూరపుబంధువులకు అన్వయింపదు.

(3) వీరబసవయ్య తన మోటారుశకటమును రోడ్డునకు తప్పువైపున తోలి, ఒక పాదచారిపైకెక్కించి అతనిమరణమునకు కారణమయ్యెను. అతనినేరము ఖూనీకాదు; హత్యకూడ కాదు. దుడుకుతనము, నిర్లక్ష్యము, అశ్రద్ధవలన చావును కల్గించిననేరము అతనిపై మోపవచ్చును.

(4) జోగమ్మ తనభర్తచే హింసింపబడెను. అతనికి తనపై ప్రేమజనించుటకు ఒక మరులమందును పెట్టెను. దీనివలన ఆమెభర్త మరణించెను. జోగమ్మ దుడుకుతనము, అశ్రద్ధవలన చావునుగల్గించిననేరము జేసినది.

(II) బలాత్కారముగా నెవరినైనా అపహరించుట. ఇది రెండువిధములు :

(అ) ఇండియానుండి ఎత్తికొనిపోవుట :–

ఒకవ్యక్తిఅంగీకారములేకుండ లేక అతని తరఫున

అంగీకరింప హక్కుగలవారి ఒప్పుదల లేకుండ ఇండియాయొక్క సరిహద్దులను దాటించునట్లు చేయుట.

(ఆ) సంరక్షణకర్త అధీనములోనుండి తీసికొనిపోవుట :-

16 ఏళ్ళు నిండని మగవానిని, 18 ఏళ్ళునిండని ఆడ దానినిగాని, ఉన్మాదినిగాని, పోషణకర్త అనుమతి లేకుండ అతని అధీనములోనుండి తీసికొనిపోవుట.

తల్లి 18 ఏళ్లునిండని తనపిల్లను తండ్రి అధీనములో నుండి అతని అనుమతిలేకుండ తీసికొనిపోయెను. ఇది బలాత్కారముగా ఎత్తికొనిపోవు నేరమే అగును. సంరక్షణకర్త అధీనములోనుండి స్వయముగానే తప్పించుకొని తిరుగుతున్న 18 ఏళ్లునిండని స్త్రీనిచేసి తన ఇంటిలో వుండనిచ్చినంతమాత్రమున, తిరిగి రక్షణకర్తయొద్దకు పొమ్మని సలహానియ్యనంత మాత్రమున, సంరక్షణకర్త అధీనములోనుండి తీసికొనిపోయినట్లు ఎంచుటకు వీలులేదు.

(III) మానవహరణము (అబ్‌డక్షన్)

బలాత్కారముగాగాని, మోసముగాగాని ఎవరెనయినను ఒకచోటునుంచి పోవునట్లుచేయుట మనుష్యాపహరణమను నేరము. అతనిని చంపుటకు ఈ పనిని చేసిన శిక్ష యావజ్జీవకారావాసము, లేక 10 సం॥ల కఠినశిక్ష మరియు జరిమానా. అతనిని అక్రమముగా బంధించుటకు ఈపని జరిగిన 7 ఏండ్లు కారావాసము. ఒక ఆడుదానిని ఆమెకు ఇష్టములేని పెండ్లి జరుపుటకుగాని, ఆమెతో నిషిద్ధ సంభోగనుచేయుటకుగాని ఈ పని చేసిన 10 సం॥ల కారావాసము మరియు జరిమానా.

(IV) స్త్రీని చెఱచుట.

(I) ఆమె అనంగీకారమును త్రోసిపుచ్చి లేక అంగీకారమును తీసికొనకుండ నిద్రపోవుచున్న స్త్రీతో సంభోగించుట ఇట్టిదే. ఒక స్త్రీ వైద్యునివద్దకు తన జబ్బునుగూర్చి సలహా పొందుటకు వచ్చెను. వైద్యుడు ఆమెకు వైద్యముచేయుట యను మిషతో ఆమెతో సంభోగించెను. అది వైద్యముచేయుటలో ఒక పరిక్రియ అనే ఉద్దేశముతోనే ఆమె దానికి అనుమతించినప్పటికి వైద్యుడు స్త్రీని చెఱచిన నేరమునకు గురియగును.

(II) చంపెదనని లేక గాయముచేసెదనని బెదిరించి ఒప్పించినను,

(III) ఆమె తనభర్తతోనే క్రీడింపనున్నట్లు నమ్మనుపుచ్చి అంగీకారమునుపొందినను,

(IV) ఆమెకు 16 ఏళ్ళు నిండనిచో ఆమె అంగీకరించినను అంగీకరింపకపోయినను, స్త్రీతో సంభోగించుట నేరమైతీఱును.

## 3. వివాహమునకు సంబంధించిన నేరములు

1. ద్వివివాహము.

భర్తగాని భార్యగాని బ్రతికియుండగా వేరొకవివాహము నిషిద్ధమయినపుడు వేరొకరిని వివాహముచేసికొనుట ద్వివివాహాపరాధము. అందులకు శిక్ష 7 సం||ల కారావాసము మరియు జరిమానా. క్రైస్తవులు, 1955 లో చేసిన హిందూ వివాహపుచట్టము అమలులోనికి వచ్చినతర్వాత హిందువులు

ఈ నేరమునకు గురికావచ్చును. మహమ్మదీయులకు బహు భార్యాత్వము నేరముగాదు. మహమ్మదీయుడు భార్య యుండగా మరొకభార్యను స్వీకరించినను నేరము లేదు.

భార్యగాని భర్తగాని 7 సంవత్సరములు కనబడకుండా పోయి బ్రతికియున్నట్లు తెలియకుండిన చో, ఆమెభర్త లేక అతనిభార్య మరొక వివాహము చేసికొనుట ద్వివివాహ నేర మగునా? వివాహము చేసికొనువారితో పరిస్థితులను యథా తథముగా ముందుగానే చెప్పిన ఈ నేరము సిద్ధింపదు. అట్లు యథాస్థితిని వివరింపనిచో 10 సం॥ల కారావాసము మరియు జరిమానా.

2. వ్యభిచారము.

ఒక స్త్రీ పరభార్యయని తెలిసి, లేక, అట్టి నమ్మకము నకు తగిన ఆధారమున్నపుడు ఆమెభర్త అంగీకారము గాని ఉద్దేశపూర్వక ఉపేక్షగాని లేకుండ ఆమెతో రమిం చుట వ్యభిచారమను నేరము. (శిక్ష: 5 సం॥ల కారాగార వాసము మరియు జరిమానా).

ఆ స్త్రీని శిక్షించుటకు వీలులేదు.

పాపమ్మ పాపయ్య భార్య. వీరయ్య ఆమెతో రమిం చెను. ఆమెఅంగీకారము లేకుండ బలాత్కారముగా ఈ పని జరిగిన, అది 'స్త్రీని చెఱచుట' అను నేరమగును. ఆమె అంగీకరించినను పాపయ్య అంగీకారము లేనిచో 'వ్యభిచార' మను నేరమగును. పాపయ్యఅంగీకారము సూచనప్రాయ ముగా వున్నను, వ్యభిచారమను నేరము వుండదు. ఉపే క్షించుట, నిర్లక్ష్యము, అట్లు జరుగునన్న భయము లేమిచే

తెలిసికొనకుండుట, ఔదాసీన్యములో కనిపెట్టకుండుటలనుబట్టి అంగీకారము సూచింపబడినదని తలంపరాదు. వీరయ్యలో పాపస్మరణము చేయుటకు తన అభ్యంతరములేదని తెలియజేయు ప్రవర్తన స్పష్టముగా ఉన్ననే అతని అంగీకారము ఊహింప వచ్చును. వ్యభిచారపునేరము మోపుటకు సాధారణముగా భర్తనుండియే ఫిర్యాదు రావలెను.

౫. ఆస్తికి సంబంధించిన నేరములు.

(I) దొంగతనము (స్తేయము - చోరీ)

నిర్వచనము :- చరాస్తిని, అధీనములో వున్న వాని అనుమతిలేకుండ, అక్రమముగా తీసికొను ఉద్దేశములో వున్న చోటునుండి కదిలించిన చో దొంగతనమగును.

ఆస్తి తనదే అయినను కొన్ని పరిస్థితులలో దొంగ తనము కావచ్చును. పాపయ్య తన గడియారమును భీమయ్య యొద్ద కుదువపెట్టెను. తాను చెల్లింపవలసిన బాకిని చెల్లింప కుండ భీమయ్యదగ్గరనుండి గడియారమును అపహరించెను. గడియారము తనదేఅయినను యిది చోరీనేరమే. నారయ్య తన కోటును చాకలివానికి వేసెను. ఒక జేబులో చిన్న గడియారముండెను. చాకలి దానిని తీసికొనెను. ఇది చోరీ. అక్రమముగా తీసికొను దురుద్దేశము ఈ నేరమునకు ఆవశ్య కము. వెంకయ్య తన మిత్రుని సైకిలును అతడు లేనప్పుడు స్కూలుకుపోయి తిరిగి యిచ్చివేయుదమను సంకల్పములో తీసికొనిపోయెను. ఇది చోరీకాదు. ఒక హాస్టలుగదిలో ఇద్దరు విద్యార్థులు నివసించుచున్నారు. ఒకనిది చాల - అజాగ్రత్త స్వభావము. తన జేబుగడియారమును బల్లమీద అశ్రద్ధగా

విడిచిపెట్టి యెచ్చటికో పోయెను. అటువంటి అజాగ్రత్త అపాయకరమని బుద్ధివచ్చునట్లు చేయుటకై అతని మిత్రుడు ఆ గడియారమును దాచి, కొంతసేపయిన తర్వాత తిరిగి దానిని యిచ్చివేసెను. ఇది చోరీగాదు. ఒక ఋణదాత తన ఋణగ్రస్తునియొద్ద సంచిలో డబ్బువుండుట చూచెను. అతని డబ్బుసంచిని తన అప్పు రాబట్టుకొను వుద్దేశముతో కాజేయవచ్చునా ? కూడదు. ఇది దొంగతనమగును.

## (II) బెదరించి తీసికొనుట

దొంగతనముతోడి తారతమ్యము :-

దొంగతనములో వస్తువు స్వాధీనములోవున్నవాని అనుమతిలేకుండ గ్రైకొనబడును. బెదరించి తీసికొనుటలో అంగీకారము కలదు గాని, ఆ అంగీకారము భయపెట్టుటవల్ల సంపాదింపబడినదే. పాపయ్యపై అపకీర్తికరమగు దూషణను ప్రకటించెదనని భీమయ్య భయపెట్టెను. ఈ ఒత్తిడిని తప్పించుకొనుటకు పాపయ్య భీమయ్యకు డబ్బుయిచ్చెను. ఇది బెదరించి తీసికొనుట అను నేరమగును.

## (III) అక్రమ వినియోగము

నిర్వచనము :- అక్రమముగా చరాస్తిని వశపరచుకొనుట, లేక, తనపనులకు వినియోగించుకొనుట 'అక్రమ వినియోగ'మను నేరము (శిక్ష : 2 సం॥ల కారాగారవాసము లేక జరిమానా లేక రెండును). ఒక షాపులో గుమాస్తా యజమానుని సరకును అమ్మి, వచ్చిన వెలను యజమానునికి అందజేయక తన సొంతఖర్చునకు వాడుకొనెను. ఇది అక్రమ వినియోగము. పైకమును తన సొంతఖర్చుకు తాత్కాలి

కముగా వినియోగించి తర్వాత యజమానునికి భద్రీ చేసి యివ్వదలచినను అది అక్రమువినియోగపు నేరము.

దొంగతనముతో తారతమ్యము :-

దొంగతనములో అక్రమముగా తీసికొను సంకల్పము తీసికొనుటకుముందుకల్గును. అక్రమువినియోగములో తీసికొన్న తర్వాతకల్గును. పాపయ్య ఒకకవరులో పేరయ్య పేర చెక్కును పెట్టి సేవకునిచేతికిచ్చిపంపెను. సేవకునికి పేరయ్యపరిచయము లేదు. సోమయ్య ఈసంగతిగ్రహించి సేవకునియొద్దనుండి ఆ కవరును తీసికొనెను. సోమయ్యకుఆ చెక్కు మరొకరికి ఉద్దేశింపబడినదని తెలిసియు, దానిని అక్రమముగా తీసికొను ఉద్దేశముతో ఈ పనిని చేసెను. ఇది దొంగతనము. ఈ సంగతి తెలియక పొరపాటున సోమయ్య కవరును తీసికొని, తర్వాత దానిలోని చెక్కును చూచి దానిని సొంతము చేసికొనిన దొంగతనము కాదు; అక్రమువినియోగపు నేరమగును.

## పోయిన ఆస్తి మరిఒకరికి దొరకుట:

దొరకినవానివిధులు :-

రోడ్డుమీద వెంకయ్యకు ఒక బంగారు ఉంగరము కనబడెను. దానిని తీయవచ్చునా? అది ఎవరిస్వాధీనము లోను లేదు గనుక తీయవచ్చును. ఆ సొత్తు చెందినవానికి ఒప్పజెప్పు ఉద్దేశముతో దానిని భద్రము చేయవచ్చును. ఆ సొమ్మెవరిదో తెలిసినచో వానికి ఇచ్చివేయవలెను. అత డెవరో తెలియకున్నచో తెలిసికొనుటకు ప్రయత్నించుచు కొంతకాలము తనయొద్ద పుంచుకొనవచ్చును. ఇట్లు చేయక

వెంటనే సొంతమునకు వినియోగించినచో అక్రమ వినియోగపు నేరము చేసినట్లు యెంచబడును.

## (V) న్యాసద్రోహము

నిర్వచనము :- అక్రమ వినియోగముచేసిన ఆస్తి తనమందు విశ్వాసముతో తనకు ఒప్పజెప్పబడిన ఆస్తిఅయిన న్యాసద్రోహమను నేరము సిద్ధించును. సర్కారు రెవిన్యూ శాఖలోని ఉద్యోగి సర్కారు డబ్బును బొక్కసములో పెట్టక తనభార్యకు వజ్రాల కంఠాభరణము చేయించెను. ఇది న్యాసద్రోహము. రామదాసు సర్కారు డబ్బుతో రాములవారి గుడిని కట్టించెను. ఇదియు న్యాసద్రోహమే.

## (V) మోసము

1. వంచనచే ఆస్తిని (1) అధీనము చేయించుకొనుట, లేక (2) అధీనములోవున్న ఆస్తిని వుంచుకొనుటకు సమ్మతింపజేయుట. లేక 2. వంచింపబడినవానికి ఉద్దేశ పూర్వకముగా శారీరకముగానో, మానసికంగానో బాధ కలిగించుట, లేక అతని గౌరమునకో, ఆస్తికో నష్టము కలుగజేయుట. (శిక్ష : 1 సంవత్సరము లేక జరిమానా లేక రెండూనూ.)

వంచనచేయుట అనగా అసత్యమును నమ్మునట్లు చేయుట. పేరయ్య తన యింటిని సీరయ్యకు అమ్మెను. దానినే మరల అమ్ముటకు పేరయ్యకు హక్కు లేదు. ఈ సంగతి తెలిసియుండియు మరల సోమయ్యకు అమ్మి వెలను వసూలు చేసికొనెను. పేరయ్య మోసముచేసెను. తాను వేరొకడుగా

భ్రమ కల్గించుట లేక వాస్తవమునకు భిన్నముగా ఒకగిని మరియొకరని చెప్పుట ఒక ప్రత్యేకమైన తరగతికి చెందిన మోసము. దీనికి శిక్ష : 3 సం॥ల కారాగారవాసము, లేక జరిమానా లేక రెండూను.

పేరయ్య తాను కళాయిపనివాడనని అబద్ధము చెప్పి వంచించి పాత్రసామగ్రిని పోగుచేసికొని అపహరించెను. పాత్రసామగ్రిని యజమానుడు అంగీకారముతోనే పేరయ్యకు స్వాధీనముచేసెను. కనుక యిది దొంగతనము కాదు. అక్రమ వినియోగపు నేరములోను, న్యాసద్రోహములోను దురుద్దేశము వస్తువు చేతికివచ్చినతర్వాత కలుగును. ఇందు ముందే అట్టి దురుద్దేశము కలదు. కనుక యిది అక్రమవినియోగము కాదు, న్యాసద్రోహము కాదు. మొదట తీసికొనుటే దురుద్దేశపూరితమై, యజమానునిసమ్మతముతో తీసికొనిన అది మోసము అను నేరమగును. పేరయ్య నేరము మోసము చేయుట.

## (VI) తుంటరితనము ( కుచేష్ట )

జనసామాన్యమునకుగాని, ఒక ప్రత్యేకవ్యక్తికిగాని (1) నష్టము లేక చెరుపుచేయు నుద్దేశముతో (2) లేక అక్రమ నష్టము, చెరుపుకలుగునని తెలిసియు, ఒకవస్తువును ధ్వంసముచేయుట, ఆ వస్తువుయొక్క ధరనుగాని ప్రయోజనమునుగాని పోగొట్టుటలు, లేక తక్కువచేయుటలు, ఆ వస్తువును మార్చిన లేక అదివున్న స్థలములో మార్పు చేసినను తుంటరితనము అను నేరమగును. (శిక్ష : 3 నెలలు

కారాగారవాసము, లేక జరిమానా లేక రెండును. నేరము యొక్క తీవ్రతనుబట్టి శిక్ష వృద్ధియగును.

పేరయ్య వీరయ్యకు అక్రమనష్టము కలుగజేయుటకు వీరయ్యబంగారుఉంగరమును నదిలో పారవేసెను. ఇది తుంటరితనము. పేరయ్య తన ఋణదాతలకు డిక్రీల అమలు క్రింద దక్కకుండ జేయుటకు తనయింటిని తగులబెట్టెను. ఇది కూడ తుంటరితనమే. పేరయ్యకు తపాలాబంట్రోతు రిజిష్టరు కవరు నిచ్చెను. ముట్టినట్లు తెలియజేయు తపాలా రసీదును పేరయ్య ఆ బంట్రోతుకు యియ్యకుండ చించివేసెను. ఇది తుంటరితనము. వీరయ్యగడ్డివామిని పేరయ్య తగులబెట్టెను. ఇది తుంటరితనము. పేరయ్య వీరయ్యభూమిలో గోడను గట్టెను. వీరయ్య గోడను కూలద్రోసెను. తన స్వామ్యపు హక్కును ఉపయోగించుచు చేసిన పని కనుక తుంటరితనము కాదు.

## (VII) అతిచారము

ఇతరుల అధీనములోవున్న ఆస్తిపైకి అక్కడ నేరము చేయుటకొరకు లేక అక్కడవున్నవారి నెవరినైనను బెదరించుటకుగాని, అగౌరవపరచుటకుగాని, కలవరపరచుటకుగాని పోయినచో అతిచారమను నేరము సిద్ధించును. మొదట సదుద్దేశముతో పోయినను, తర్వాత యిట్టి దురుద్దేశము కలిగినచో అతిచారమే. (శిక్ష : 2 నెలలు, లేక 500 దాక జరిమానా లేక రెండును)

యజమానుని అంగీకారములేకుండ అతని ఆస్తిని చొచ్చుట సివిల్ అపరాధమగును. పైన చెప్పిన దురుద్దేశము

జోడింపబడిన అతిచారమును నేరమగును. పేరయ్య తన ప్రియురాలితో ఒక ఇంటిలో నివసించుచుండెను. పేరయ్య ఇంటిలో లేనప్పుడు అతని ప్రియురాలి ఆహ్వానముపై వీరయ్య ఆ ఇంట చొచ్చెను. ఆమెతో విలాసముగా కాలముగడపి రహస్యముగా నిష్క్రమించుటే అతని ఉద్దేశమగునుగాని, ఆ ఇంట్లో వారిని బెదరించుట, అగౌరవపరచుట, కలవరపరచుట అతని ఉద్దేశము కానే కాదు. పేరయ్య హఠాత్తుగా వచ్చి ప్రియురాలినుండి విడదీసి, వీరయ్యపై అతిచారపు నేరము మోపెను. అతిచారపు నేరమునకు కావశ్యకమగు దురుద్దేశము లేనందున ఈ ఫిర్యాదును త్రోసిపేయవలెను.

## 4. దస్తావేజులకు సంబంధించిన నేరములు

ఫోర్జరీ ( = కూటకర్మము)

జనసామాన్యమునకు లేక ఒకవ్యక్తికి నష్టమైన, హానియైన కలిగించు దురుద్దేశముతో, లేక ఏదైన లేనిహక్కును స్థాపించుటకొరకు, లేక ఒడంబడికకు ఒప్పుకొనునట్లు చేయుటకు, మోసము చేయుటకు, తప్పుడు దస్తావేజును సృష్టించుట ఫోర్జరీ నేరము. (శిక్ష : 2 సం॥లు, లేక జరిమానా, లేక రెండును).

పేరయ్య తన విల్లును వీరయ్యచేత వ్రాయించెను. తన ఆస్తి బుచ్చయ్యకు చెందునట్లు వ్రాయమని పేరయ్య చెప్పగా, వీరయ్య ఉద్దేశపూర్వకముగా పిచ్చయ్యకు చెందునట్లుగా వ్రాసి సరిగా వ్రాసితినని నమ్మించి, పేరయ్య వ్రేలి ముద్ర విల్లుపై వేయించెను. ఇది ఫోర్జరీ. చలమయ్య చని

పోగా శవముగాఉన్న అతని బొటనవ్రేలిముద్రను, బ్రతికియున్నప్పుడే అతడు వేసినదిగా చెలామణీచేయుటకు, ఒక విల్లుపై కామయ్య వేయించెను. కామయ్య చేసిన నేరము ఫోర్జరీ.

ఫోర్జరీగా తయారైన దస్తావేజును సరియైనదని వంచనగా ఉపయోగించినవానిని ఫోర్జరీ చేసినవానిని శిక్షించినట్లే శిక్షింతురు.

## 5. అపనింద

లక్షణములు :

పరువునష్టమునుగూర్చి విపులముగా వ్యావహారిక విషయకమైన అపకృత్యములనుగూర్చిన అధ్యాయములో చర్చింపబడును. సాధారణముగా అపనింద ధనపరిహారముకోరదగిన అపకృతి. అపనింద ఒకవిధమగు దుష్టబుద్ధితో చేయబడినచో, శిక్షార్హమగు నేరముగా పరిణమించును. (శిక్ష : 2 సం॥ల కారాగారవాసము లేక జరిమానా లేక రెండును) గౌరవహాని కలిగింపవలెననెడి ఉద్దేశము, లేక అట్టి హానికలుగునని తెలిసికొనుటకు అవకాశము ఉన్నయెడల అపనింద నేరమగును.

పేరయ్య ఆకాశరామన్న అనే కల్పితవ్యక్తినిగూర్చి ఒక కథను ప్రకటించెను. ఆకాశరామన్న ఒక దురాచారపరాయణుడని అందు నిందింపబడెను. ఆ పేరును అతనినిగురించి చెప్పబడినసంగతులును చినరామయ్యకు సరిపడినట్లు కాగా అతనినిగురించి చెప్పబడినట్లు పలువురిచే భావింపబడి, అతని

గౌరవము క్షీణించెను. చినరామయ్య నష్టపరిహారమును కోర వచ్చును. కాని పరువునష్టపు నేరము మోపలేము. కారణ మేమన, ఆ నేరమునకు కావలసిన అపరాధ మనోవృత్తి (దుష్టబుద్ధి) పేరయ్యకు లేదు గనుకనే.

పరువునష్టమునకు పరిహారముకోరు దావాలో ఆ గౌరవ హానికరమగు ప్రసంగము నిజమని ఋజువుచేయుట సబబైన ప్రతివాదము. పరువునష్టపు ఫిర్యాదుకు ప్రసంగము సత్యమని ఋజువుచేసినంతమాత్రమున నేరము లేదని స్థిరపడదు. సత్యమే గాక, దాని ప్రకటన ప్రజలకు ఉపయోగకరమైనదిగా ఉన్ననే నేరమునకు బాధ్యత తప్పును.

## 6. రాజ్యవిషయక, ప్రజావిషయికాపరాధములు

### (1) రాజ్యద్రోహము

వ్రాతవలన లేక ప్రసంగములవలన సర్కారువారిపై ద్వేషము, నిరసనభావము కలుగజేయుట లేక అసంతృప్తిని కలిగించుట, కలిగించుటకు ప్రయత్నించుటగాని చేయుట రాజ్యద్రోహము. (జన్మాంత కారాగారవాసము లేక 3సం॥ల శిక్ష మరియు జరిమానా)

బ్రిటిషువారి పరిపాలనలో భారతీయ ప్రజానాయకు లను ఈ చట్టముక్రిందనే శిక్షించుచుండిరి. బాలగంగాధర తిలక్ మహాశయునిపై రాజ్యద్రోహపు అభియోగము తెచ్చినపుడు ప్రీవీకౌన్సిలువారు తీర్పుచెప్పుచు ఈ నేరమునకు హింసాపూర్వకమైన అత్యాచారములు చేయవలసినదని ప్రేరేపించుట అవసరములేదని తీర్మానించిరి. స్వాతంత్ర్యము [illegible]

రినతర్వాత మన సుప్రీముకోర్టువారు సర్కారును, అనగా పరిపాలకులను, వారిచర్యలను విమర్శించుట రాజ్యద్రోహము కాదనియు, రాజ్యభద్రతాకాంక్షులకు ప్రాతికూల్యము సంభవించు పరిస్థితిలోనే ఈ దోషారోపణము చేయదగుననియు తీర్మానించిరి.

(2) విధివిరుద్ధకూటము

సదోషబలప్రయోగముచే సర్కారును బెదరించుటకు లేక విధానసభనో, తన విధినియుక్తచర్యలను పాటించుచున్న లోకసేవకునో భయపరచుటకు లేక శాసనమును నిరోధించుటకుగాని, అమలుజరుగు క్రియలను ఆటంకపరచుటకుగాని, లేక కుచేష్టలు, అనధికారప్రవేశముచేయుట మొదలగువాని కొరకు సామాన్యమైన అభిప్రాయముతో 5గురి సమావేశముగాని అంతకుమించినదిగాని విధివిరుద్ధకూట మగును.

విధివిరుద్ధకూటమందు చేరుట, చెదిరిపోవలసినదిగా అనుజ్ఞఇయ్యబడినతర్వాతకూడ అందు నిలచుట, అట్లు కూడినవారిలో చేరుటకు కూలియిచ్చుట, అట్లు కూలితీసికొన్నవారికి ఆశ్రయమిచ్చుట – ఇవన్నియు శిక్షాస్మృతిక్రింద నేరములే.

దొమ్మి :–

కూటముయొక్క అభిప్రాయానుసారముగా విరుద్ధకూటముచే బలప్రయోగము దొమ్మి. ఆ సమయములో కూటమునందుచేరిన ప్రతి సభ్యుడు దొమ్మినేరము చేసినట్లే. (శిక్ష : 2 సంవత్సరములవరకు కారాగారవాసము లేక జరిమానా లేక రెండును)

గలభా :-

ఇద్దరు, లేక అంతకన్న ఎక్కువమంది రచ్చప్రదేశా లలో కలహించి, ప్రజాశాంతికి భంగము కలిగించుట. (శిక్ష : 1 నెలవరకు చెరసాల లేక 100 రూ॥ల వరకు జరిమానా లేక రెండును)

## 7. న్యాయశాఖకుచెందిననేరములు

(1) కూటసాక్ష్యము :-

కూటసాక్ష్యము ఇచ్చుట, తప్పుడుసాక్ష్యమును కోర్టు వ్యవహారములలో ఉపయోగించుటకై సృష్టించుట. (7 సం॥ల చెర, జరిమానా)

పాపయ్య సాక్ష్యమిచ్చుచు, ఒక విక్రయపు దస్తా వేజుపైనున్న సంతకము చెలమయ్యదని చెప్పను. ఈ వివరణ యందు అతనికి నమ్మకములేదు. పాపయ్య కూటసాక్ష్యపు నేరము చేసెను. చెన్నయ్యపెట్టెలో ఒక వెండిపాత్రను పాపయ్య పెట్టెను. చెన్నయ్యపై దొంగతనము మోపించు టకు ఈ పని చేయబడెను. పాపయ్య తప్పుడుసాక్ష్యమును సృష్టించిన నేరము చేసినాడు.

(2) న్యాయాలయావజ్ఞ :-

న్యాయనిర్ణయ కార్యకలాపాలలో నియుక్తుడైన వాని చర్యలను విఘ్నపరచుటయు, ఉద్దేశపూర్వకముగా అతనిని అవమానించుటయు న్యాయాలయావజ్ఞ అను నేరము. (శిక్ష : 6 నెలలు, 100 రూ॥ల వరకు జరిమానా లేక రెండును) కోర్టుసమక్షములో చేసిన అవజ్ఞకే ఇది వర్తించును. (ఉదా॥

చెప్పును న్యాయమూర్తిపై విసరుట) న్యాయాధిపతి లంచగొండి అని పత్రికలో ప్రకటించిన ఈ నేరము సిద్ధించదు. కాని న్యాయాలయావజ్ఞాశాసనము (1952) క్రింద శిక్షింపవచ్చును. క్రిందికోర్టులకు జరిగిన అవజ్ఞలకు హైకోర్టువారు శిక్షింప వచ్చును. అవజ్ఞ సమక్షములో జరిగినను పరోక్షములో జరిగినను శిక్షించుటకు హైకోర్టునకు సహజమైన అధికార ములుగలవు.

## 8. వ్యావహారికాపకృతులు

### జనశాశాసనసారము

### సాధారణ సూత్రములు

(1) నిర్వచనము :-

ఒప్పందమును భంగపరచుట, న్యాసమును క్రమముగా పాలింపకుండుట అనునవి వినా మిగతా అపకృతులు వ్యావహా రికవిషయకాప్రకృతులందును. వీనికి నేరములకు పోలికలు కలవు.

నేరమును వ్యావహారికాపకృతులతో పోల్చుట :-

ప్రతివిధానపరిక్రియలో భేదము :-

నేరములోను అపకృతిలోను విధిభంగము కలదు. విధి తాను స్వయముగా ఒప్పుకొని అంగీకరింపనిది కాదు. రాజ్య సంస్థచే ఆరోపింపబడినవి. ఈవిధముగా అపకృతి నేరమును పోలును. ఈ రెంటికి భేదము ప్రతివిధానపరిక్రియలో గలదు. అపకృతికి ప్రతివిధానము వ్యవహారన్యాయాలయములో ధన పరిహారము పొందుట. నేరమునకు దండన్యాయాలయములో

శిక్ష విధింపబడును. ఒక దేశములో అపకృతి మరియొక దేశములో నేరము కావచ్చును. జారత్వము (వ్యభిచారము) భారతదేశములో నేరము; ఇంగ్లాండులో అపకృతిమాత్రమే. కనుక భారతదేశములో ఎవరైన పరులకళత్రముతో ఆమెభర్త అంగీకారము లేకుండ మైధునక్రీడ సల్పిన, భారతదేశములో ఆమెభర్త అతనిని దణ్డన్యాయాలయములో అభియోగము తెచ్చి, కారాగారవాసశిక్ష విధించునట్లు చేయవచ్చును. ఇదే దోషమునకు ఇంగ్లండులో ఆమెభర్త వ్యవహారన్యాయాలయములో వ్యాజ్యమును తెచ్చి కొంతధనమును పరిహారముగా పొందవచ్చును. ఒక కాలములో అపకృతి మరియొక కాలములో నేరముగా చేయబడవచ్చును. అపకృతియా నేరమా అనునది ప్రతివిధానపరిక్రియపై ఆధారపడియుండును. దోషము వలనకల్గు హాని పాలకులదృష్టిలో గొప్పదిగా తోచిన దానిని నేరముగా శిక్షింతురు. హాని అంత గొప్పదిగా కన్పింపనిచో, దణ్డన్యాయాలముల జోక్యము లేకుండ వ్యవహారన్యాయాలయములలో హానిపొందినవానికి ధనపరిహారమును కోరుకొను హక్కుమాత్రము నొసంగుదురు. కొన్ని అపరాధములను నేరముగా శిక్షించుచు, అపకృతిగా ధనపరిహారముకూడ ఇప్పింపవచ్చును.

(2) అపకృతిబాధ్యతా నిర్ణయము :-

అపకృతికి కర్తకు బాధ్యతకల్గుటకు రెండునియమములు సరిపోవలెను. అవి యేవనగా :

()I దోషపూరితక్రియ :-

న్యాయశాస్త్ర నిర్ణీతవిధిని ఉల్లంఘించుట దోషము.

ఇతరునిపట్ల నిర్వర్తింపవలసినవిధి నీకులేనిచో అతనికి నీవల్ల హాని సంభవించినను నీవు నిర్దోషివే అతనికి సంభవించినహాని నిర్దోషిజనితహాని. దానిని అతడే అనుభవింపవలెను. పేరయ్య పెద్దబజారులో వ్యాపారి. అదే వీధిలో వీరయ్య తనషాపును పెట్టి ఇదివరకు పేరయ్యషాపునకు పోవు ఖాతాదార్లను నేర్పుగా తనషాపునకు రాబట్టుకొనెను. దీనివలన పేరయ్యకు నష్టము సంభవింపవచ్చును. కాని అతనికి వాదకారణము లేదు. అతడు పొందినహాని నిర్దోషిజనిత హాని.

(II) హాని :-

హానిలేకపోయినను హక్కునకు భంగముకలుగజేసిన వాదకారణము ఏర్పడవచ్చును. ఒకఎన్నికలో పేరయ్యకు ఓటువేయుహక్కు గలదు. అతడు పోటికినిల్చిన అభ్యర్థులలో వీరయ్యకు తనఓటును వేయదలచెను. కాని అధికారి ఇతని ఓటును వేయనియ్యక అభ్యంతరపెట్టెను. ఇతనిఓటు పడక పోయినను ఇతడు వరింపదలచిన అభ్యర్థి జయించెను. కనుక ఇతనికి హానిలేదు. అయినను హక్కునకు భంగముకల్గినందున వాదకారణము గలదు. నామమాత్రముగానయినను కొంత పరిహారము ఇప్పింపవలసియుండును.

సుదూరహాని :-

దోషపూరితక్రియకు హానికి సామీప్యములేనిచో అపకృతికర్తకు బాధ్యతలేదు. ఒక రైలుబండిపెట్టెలో ప్రయాణీకులు క్రిక్కిరిసియుండిరి. అందుచే ఆ పెట్టెలోని ఒక ప్రయాణికుని మూకలసంచిని ఎవరో దొంగిలించిరి. రైల్వేఅధికారుల ఉపేక్షవలన ఆ పెట్టె క్రిక్కిరిసియుండుట సంభవించెను. కనుక

రైల్వే అధికారులనుండి ఈ నష్టమును రాబట్టుకొనవచ్చునా? వీలులేదు. నష్టమునకును ఆరోపించిన అపకృతికిని చాల అంతరము గలదు. అందుచే ఈ నష్టమునకు రైల్వే అధికారులకు బాధ్యతలేదు. బాహ్యదృష్టికి సుదూరహానిగా కాన్పించినను నిజముగా సమీపహాని కావచ్చును. పేరయ్య ఒక టోటా టపాసును ముట్టించి వదలెను. అది భీమయ్య పూరిగుడిసెపై పడెను. పూరికొంప ముట్టుకొనులోగా భీమయ్య టోటాను తీసి పారవేసెను. అప్పుడు అది సోమయ్యకంటిమీద బడి కంటిని పోగొట్టెను. ఒంటికంటి శుక్రాచారిగా తయారైన సోమయ్య తనకుగల్గిన నష్టమునకు పేరయ్యను బాధ్యునిగా చేయవచ్చునా? భీమయ్య టోటాను తాకకుండ ఉండినచో ఈ నష్టము సంభవింపదు. కనుక పేరయ్య అపకృతికిని సంభవించిన హానికిని చాలదూరముగలదని చెప్పవచ్చునా? వీలు లేదు. భీమయ్య తన ఆస్తి సంరక్షణార్థము టోటాను తీసి వేసెను. కనుక ఈ హాని పేరయ్య అపకృతికే చెందును. పేరయ్యయే హానికి బాధ్యుడు.

## 9. ప్రాతినిధిక బాధ్యత

ఒక్కొక్కప్పుడు ఒకని అపకృతికి మరొకనిని బాధ్యునిగా జేయవచ్చును. అట్టిబాధ్యత ప్రాతినిధిక బాధ్యత. నౌకరిలో సేవకునిచే గావింపబడిన అపకృతులకు యజమానునికి బాధ్యతగలదు. సేవకుడు సాధారణముగా బీదవాడు. అతని అపకృతులకు అతనికి బాధ్యతగలదు. కాని అతనివద్ద పరిహారము వసూలుగాదు. అందుచే యజమానికిగూడ బాధ్యత కల్పింపబడినది.

యజమానునికి ఎప్పుడు బాధ్యతయుండును ?

(I) అపకృతిచేసినవ్యక్తి తనసేవకుడుగానే యుండవలెను. పనిచేయువాడు యజమానునియొక్క నియంత్రణలోనున్న సేవకుడగును. ఇంటిపరిచారకులు, కూలిపనివాండ్రు సేవకులు. మోటారుకారుయజమానుని కారునకు చోదకు (డ్రైవర్)ని ఏర్పాటుచేసికొనినప్పుడు చోదకుడు సేవకుడుగానే యెంచబడును. కారుచోదకుడు తోలుటలో ప్రమాదము సంభవించినచో కారు యజమానుడు బాధ్యుడు. టాక్సీలో పోవునపుడు ప్రమాదము సంభవించినచో టాక్సీలో పయనించువాడు బాధ్యుడా ? కాదు. కారణమేమనగ, టాక్సీ చోదకుడు ప్రయాణికుని సేవకుడు కాడు.

(II) నౌకరిచేయు సందర్భములో అపకృతి జరుగవలెను. సేవకుడు నౌకరిచేయు సందర్భములోచేసిన అపకృతులను మాత్రమే యజమానుడు బాధ్యుడు.

సేవకునిచే ఆజ్ఞోల్లంఘనము :-

పేరయ్య తన మోటారుచోదకునితో రైలుస్టేషనునకు కారును తోలుకొనిపోయి, రైలుబండిలో వచ్చుచున్న తన మిత్రుని యింటికి తీసికొనిరమ్మని చెప్పెను. త్రోవలో చోదకుని నిర్లక్ష్యమువలన ఒకప్రమాదము సంభవించి, చిన్నయ్య గాయపడెను. పేరయ్యకు ఈ అపకృతికి ప్రాతినిధికబాధ్యత కలదు. తానుచెప్పినటుల పోవలసిన రాచబాటనువదలి అడ్డత్రోవగుండ చోదకుడు కారును తీసికొనిపోయినను, జరిగిన ఆకస్మిక దుర్ఘటనకు పేరయ్య బాధ్యుడే. మరి చోదకుడు స్టేషనునకు పోకుండ తన ప్రియురాలిని మోటారుకారులో

ఎక్కించుకొని కులాసాగా సార్వజనీన మనోరంజకస్థానములకు ఆమెను గొంపోవుచున్న సందర్భములో ఆకస్మిక దుర్ఘటన సంభవించిన దానికి వేగయ్య బాధ్యుడు కాడు. ఏలనన, సేవకుడు నౌకరిచేయుసందర్భములో ఆ అపకృతి జరిగినట్లు భావింపబడదు. సేవకుని స్వాంతవిహారసమయములో జరిగిన హాని గాని, స్వామి నౌకరిలో కాదు.

## 10. అపకృతికి ప్రతివాదములు

(1) సమ్మతిఉన్నచో అపకృతి లేదు :-

ఒకచో అపాయముఉన్నదని తెలిసి సాహసముగా తెగించి సమ్మతించిన ఆ అపాయమువలన హానిసంభవించినచో పరిహారముకోర వీలుపడదు. సమ్మతి స్పష్టముగానయినను గర్భితముగానయినను ఉండవచ్చును. కుస్తీపట్టువారు, ముష్టియుద్ధముచేయువారు, క్రికెట్ ఆడువారు, సర్కస్ చూడడమునకు వచ్చినవారు, మోటారుకార్ల పందెములు, గుఱ్ఱపుపందెములు చూడవచ్చినవారు అపాయమునకు గర్భితముగా సమ్మతించినట్లు భావింపవలెను.

దీనికి అపవాదము : రక్షణతత్పరతలో జరిగిన అపకృతి :-

ఇతరునిచే కలిగింపబడిన అపాయమునుండి ఎవరినైన కాపాడుటకు తన నైతికవిధిని నిర్వర్తించుటకు సాహసించిన వ్యక్తి తనకుగలిగెడి హానికి పరిహారము కోరవచ్చును. సమ్మతితో అపాయమును స్వీకరించినను, ఇచ్చట పరిహారము పొందవచ్చును. వీరయ్య తనగుఱ్ఱమును, వీధిలో వదలెను. అది పారిపోయి కొంతమంది పసిబాలురు ఉన్నవైపునకు లం

ఘించెను. వారికి హానిజరుగకుండ కాపాడుటకు పేరయ్య తెగించి గుఱ్ఱమునుపట్టుకొని ఆపివేసెను. అట్లుచేయుటలో అతడు క్రిందపడి గాయపడెను. వీరయ్యనుండి ఈ హానికి పరిహారము కోరవచ్చును. వీరయ్య గుఱ్ఱమును వీధిలోగాక ఒక పొలములో వదలెననుకొందము. ఎవరికిని హానిలేని సందర్భములో పేరయ్య అటుపోవుచు ఆ గుఱ్ఱమునుచూచి దానికాలు కుంటిదో కాదో తెలిసికొను ఉత్సాహములో దానిని సమీపించెను. గుఱ్ఱము కాలువిదిలించి పేరయ్య ముందుపండ్లను రెండింటిని ఊడగొట్టెను. ఈ హానికి వీరయ్య బాధ్యుడా? కాదు. పేరయ్య తన అనవసర చేష్టవలన పొందిన హానికనుక వీరయ్య బాధ్యుడుకాడు.

(2) అనివార్య దుర్ఘటన :-

ఒకకృత్యముయొక్క పరిణామములు ఉద్దేశింపబడనిచో ఆ కృత్యము ఆకస్మికదుర్ఘటన అందురు. నిర్లక్ష్యముచే అది సంభవించిన సదోషదుర్ఘటన అగును. ఆ దుర్ఘటనను వివేకవంతుడు చూపవలసిన జాగరూకతతో నివారింపశక్యము కానిచో, అది అనివార్యదుర్ఘటన. పేరయ్య మోటారుకారును చోదకుడు వీరయ్య నడుపుచుండెను. ఆకస్మికముగా వీరయ్యకు హృదయశూలవచ్చి నడుపుచుండగనే మరణించెను. ప్రమాదవశమున కారు చిన్నయ్యను ఢీకొని గాయపరచెను. పేరయ్యను ఈహానికి బాధ్యునిగా చేయవచ్చునా? లేదు. ఇది అనివార్యమైన సాక్షాత్ సంఘటన. దీనికి బాధ్యతలేదు.

## 11. ప్రత్యేకాపకృతులు

### (1) అనధికారప్రవేశము ( = అతిచారము)

నేరమునకు, అపకృతికి భేదము :-

మరియొకని అధీనములోనున్న స్థలముపై అతని అనుమతి లేకుండ ప్రవేశించుట అపకృతి. ప్రవేశములో ఉద్దేశము అక్కడనివసించువారికి భయము, అగౌరవము, కలవరము కలిగించుట, లేక నేరముచేయుట అయినచో ఇది నేరమగును. ఈ ఉద్దేశము లేనిచో వ్యవహారవిషయకాపకృతి మాత్రమే. ప్రాంతవీధులలో అనధికారప్రవేశమును నిరోధించుటకు స్థల యజమానుని సూచికాఫలకముపై "అనధికారప్రవేశముచేయువారు శిక్షకు పాత్రులగుదురు" అని వ్రాసియుంచును. ఇది బెదురుకొఱకేకాని, నిజముకాదు. శిక్షవిధించుటకు అతిచారము పైన తెల్పిన ఉద్దేశముతోకూడిన నేరముకావలెను.

పేరయ్య తన నిచ్చెనను వీరయ్యఇంటిగోడకు ఆనించెను. తన గుమ్మడితీగెను వీరయ్య ఇంటికప్పుపైకి పోనిచ్చెను. ఇది అతిచారమా ? అవును. ఇతరుని స్థలముపైకి తాను పోకున్నను పదార్థములనువైచినను అతిచారమే.

భూమికామందు తన స్థలముక్రింద నరకలోక పర్యంతము, పైన స్వర్గలోకపర్యంతమున్న సర్వముపై హక్కుగల్గి యుండునని ఒకసామెత కలదు. నీ స్థలముపై అంతరిక్షములో గాలివిమానము పోయిన అతిచారమని అభియోగము తేవచ్చునా ? చట్టములచే ఇట్టిచర్యలు అతిచారపు బాధ లేకుండ తప్పింపబడినవి.

## (2) అక్రమముగా బందీనిచేయుట :-

లక్షణములు :-

స్వాతంత్ర్యమును విధివిరుద్ధముగా అరికట్టుట అక్రమపుబందీ అను అపకృతి. అపరాధపరిశోధకనవలలను చదువువారికి డిటెక్టివ్ హంతకుని వెదకుచు పోయి అతని రహస్యమందిరమును శోధించుట; హంతకుని అనుచరులు మందిరద్వారములను మూసి డిటెక్టివ్‌ను బంధించుట మొదలగు సంగతులు తెలిసియేయుండును. ఇట్లు బంధించుట అపకృతి. అతని చలనస్వాతంత్ర్యము పూర్తిగా అవరోధింపబడిననే ఈ అపకృతి కల్గును. మందిర ముఖద్వారము బంధింపబడినను పెరటిద్వారము తెరచియున్నచో అక్రమపుబందీ అపకృతి కాజాలదు. ద్వారములన్నియు బంధించియున్నను, కిటికీ ఇనపచువ్వలను ఊడపెరికి, బయటికి దుమికి తప్పించుకొనవచ్చునుగదా. అప్పుడు ఈ అపకృతి లేనట్లేనా? కాదు. సాధారణప్రమాణములచే ఆలోచించి స్వాతంత్ర్యము పూర్తిగా అరికట్టబడినదా అని చూడవలెను. డిటెక్టివ్ తన దొమ్మివిద్దెనేర్పుచే క్రిందికి లంఘింపగల్గినను, అక్రమముగా బంధీచేయబడిన అప్రకృతి అతనికి జరిగినట్లే. అతడు నష్టపరిహారమును కోరవచ్చును.

బందీ ప్రత్యక్షీకరణలేఖ :-

చెఱలోనున్నవానికి, తప్పించుకొన్నతర్వాత నష్టపరిహారమువచ్చిన ప్రయోజనకారి కాదు. ముందు చలనస్వాతంత్ర్యమును తిరిగి పొందవలెగదా. దానికొరకు న్యాయ

వారులు బన్దీ ప్రత్యక్షీకరణ లేఖ (రిట్ ఆఫ్ హేబియస్ కార్పస్)ను ప్రయోగింతురు. బన్దీగా ఉంచినవ్యక్తి న్యాయస్థానములో, బన్దీ చేయుటకు కారణములను వివరింపవలెను. న్యాయాధిపతి కారణములను పరిశీలించి, అవి సరిగా లేనిచో బన్దీని విముక్తి చేయుటకు ఉత్తరువును ప్రసాదించును. బన్దీ ప్రత్యక్షీకరణ లేఖను మంజూరు చేయుమని బన్దీ మిత్రునిగాని, బంధువుగాని, అతనియందు శ్రద్ధగలవారెవరయినగాని న్యాయస్థానమును కోరవచ్చును.

పోలీసు ఉద్యోగస్థుల బాధ్యత:—

పోలీసు ఉద్యోగస్థులపై అక్రమపుబంధీ అపకృతి వ్యాజ్యములు తరచుగా వచ్చుచుండును. వారు తమ ఉద్యోగధర్మ నిర్వహణ నిమిత్తము అనుమానితులను రక్షకనిరోధములో ఉంచవలసియుండును. అందుచే ఇట్టి వ్యాజ్యములకు గురియగుదురు. తమ అధికారవలయమును దాటక న్యాయముగా ప్రవర్తించిన ఎట్టి బాధయు లేదు. ఉద్యోగధర్మమును చేసినంత మాత్రమున ప్రత్యేకరక్షణ యుండదు. ఉదాహరణకు: ఒక పోలీసు ఇన్స్పెక్టరు బన్దీకరణపు ఆజ్ఞాపత్రమును చూపవలసి యుండగా, అట్టిది లేకుండనే ఒకవ్యక్తిని రక్షకభట నిరోధములో ఉంచెను. ఇది అపకృతి. పరిహారమును చెల్లింపవలసి యుండును.

(2) హద్యాభియోగాపూర్వాభియోగము

లక్షణ వివరణము:—

పేరయ్య రక్షకభట శాఖకు వీరయ్యపై అబద్ధపుఫిర్యాదు చేసెను. వీరయ్యను రక్షకభటులు బందీనిచేసి, తర్వాత విడిచిరి.

పేరయ్యపై అక్రమనిర్బంధ అపకృతికి వ్యాజ్యము తెచ్చుటకు వీరయ్యకు వాదకారణముగలదా? లేదు. ఏలనన పేరయ్య స్వయముగా వీరయ్యను బంధీచేయనందున. మరి పేరయ్యకు బాధ్యతయే లేదా? ఉన్నది. అతనిపై దుర్భావనాపూర్ణాభియోగము అను వ్యాజ్యమును తేవచ్చును. ప్రజలు పోలీసువారిసహాయమును కోరినపుడు సాధారణముగా ప్రోత్సాహపరచవలసియుండును. అందుచే దుర్భావనాపూర్ణాభియోగము తనపై తేబడెనని వ్యాజ్యము తెచ్చుటకు కఠిన నియమములు చేయబడినవి. అవి ఏవనగా :

(I) వాదిపై ఇదివరలో ప్రతివాది అభియోగము తెచ్చియుండవలెను; అనగా వాదిపై దణ్డప్రక్రియాసంహితను ప్రయోగించుటలో ప్రతివాది ముఖ్యపాత్రను నిర్వహించియుండవలెను. వ్యవహారప్రక్రియాసంహితను ప్రయోగించినంతమాత్రమున ఈ అపకృతికి అవకాశము లేదు. పేరయ్య తనవస్తువులు దొంగిలింపబడినవని అబద్ధపుఫిర్యాదు చేసెను. పోలీసులు విమర్శించి, శోధించి పుల్లయ్యపై చోరీ నేరము మోపిరి. పుల్లయ్యపై నేరము ఋజువుకానందున అతనిని విడుదలచేసిరి. పుల్లయ్య అపకృతికి పరిహారము పేరయ్యనుండి కోరవచ్చునా? వీలులేదు. కాని పేరయ్య తనఫిర్యాదులో పుల్లయ్య దొంగిలించెనని చెప్పియున్నచో, అపకృతికి బాధ్యుడగును.

(II) ఫిర్యాదువలన వాదిస్వాతంత్ర్యమునో, గౌరవమునో, ఆస్తినో నష్టపడుపరిస్థితి యుండవలెను. నేరమును ఆరోపించిన సాధారణముగా ఇట్టిపరిస్థితి సంఘటించును.

కొన్ని సాంకేతిక విషయముల నేగములలో శంకమాపాదింపగల పటిమ యుండును. అట్టి దోషారోపణకు ఈ సూత్రము వర్తింపదు.

(III) వాదిపై ప్రయోగింపబడిన అభియోగము నీగిపోయి యుండవలెను. అతడు నిర్దోషియని ఋజువైన అభియోగమును కొట్టివేసిన, ఈ నియమము సార్థకమగును. అభియోగము నిర్ధారణాలేకపూర్వమే ఉపసంహరింపబడినను ఈ నియమము సిద్ధించును.

(IV) అభియోగము దుష్టబుద్ధితో తేబడి యుండవలెను. అనగా వ్యక్తిగత కోపశాంతికై తేబడినదే కాని, న్యాయనిరూపణార్థము తేబడినది కాదు.

(V) అభియోగమును యుక్తయుక్తము లైనసంభావ్యము లైన కారణములు లేకుండ తెచ్చియుండవలెను. అభియోగమును తెచ్చుటకు సరియైన కారణములుగలవను నమ్మకము లేకుండనే ప్రతివాది అభియోగమును తెచ్చెనని వాది ఋజువు చేయవలెను.

ఒక ప్రామాణికనిర్ణయము :-

రెండు రైలుబండ్లు రైల్వేవారినిర్లక్ష్యమువలన ఢీకొనను చాలమంది గాయపడిరి. ఒకప్రయాణికుడు (పీరయ్య అను కొందము) డాక్టరుయొద్ద గాయములకు ప్రమాణపత్రమును సంపాదించి, రైల్వేవారిపై నష్టపరిహారమునకు వ్యాజ్యము వేసెను. ఆ ప్రమాణపత్ర ఆధారమును చూచి రైల్వేవారు నష్టపరిహారము నొసంగి, రాజీగా వ్యాజ్యమును పరిష్కరించుకొనిరి. నిజముగా ఆ ప్రయాణికుడు గాయపడలేదు. డాక్ట

రుణో పరీక్షయి, తానుగాయపడినట్లు డాక్టరుచే వ్రాయించుకొని, ఆ ప్రమాణపత్రసహాయముతో నష్టపరిహారముగా ఎక్కువడబ్బు రాబట్టుకొనెను. ఈసంగతి తర్వాత రైల్వేవారికి తెలిసి, డాక్టరుపై రైల్వేవారిని మోసగించుటకు కుట్రపన్నిననేరమునకు ఫిర్యాదుచేసిరి. తగిన ఋజువులేనందున అభియోగము వీగిపోయెను. అంతట డాక్టరు రైల్వేవారిపై నష్టపరిహారమునకు దావా తెచ్చెను. అతని దావా సారాంశము రైల్వేవారు తనపై దుర్భావనాపూర్ణాభియోగము తెచ్చిరని. రైల్వేవారికి యుక్తియుక్తమైన కారణములుండియే అభియోగము తెచ్చిరని కోర్టువారు భావించి ఈ దావాను త్రోసివేసిరి. పైన చెప్పబడిన అయిదవనియమము సార్థకముకానందున వాదకారణములేదు.

## 12. అపనింద

అపనిందవివరణ:-

గౌరవ ప్రతిష్ఠలు వ్యక్తికి గణింపవీలుగాని ఆస్తి అని చెప్పవచ్చును. వీనికి నష్టముకల్గించిన అపనిందయను అపకృతి సిద్ధించును. అపనిందలో ముఖ్యాంశములు విశదీకరింతము

(I) నిందాప్రసంగము :-

సంఘములో సాధారణవ్యక్తుల దృష్టిలో కుంచివేయునట్టి లేక అసహ్యించుకొనజేయు పరిణామముగల ప్రసంగము నిందాప్రసంగము. ఒక స్త్రీ జారిణిఅనిగాని, ఒక పురుషుడు జారుడనిగాని అనుట అపనిందమోపుట. కుష్ఠము సుఖవ్యాధులు ఒకనికి గలవని అనుటవలన అతనిని ఇతరులు గర్హిం

కాదు. అందుచే అది అపనిందమోపుట. ఒక స్త్రీ బలవంతముగా చెఱుపబడెనని ప్రచారముచేయుటకూడ అపనిందయేనా? ఆమె దోషము లేకున్నను ఇట్టివి సంఘపరిస్థితులలో ఆమెను గర్హించుటగాన, ఇదికూడ అపనిందమోపుటే.

బూతులుతిట్టుట :-

పోట్లాటలలో పరస్పరము బూతులు తిట్టుకొనుచుందురు. వీనిని ఎవరు గమనింపరు. సహింతురు. ఇట్టివి అపనిందగా పరిగణింపరు.

ధ్వని: అన్యాపదేశము :-

పైకి అపనిందగా కాన్పించకపోవచ్చును. కాని కొన్ని సందర్భములలో చెడ్డఅర్థము ధ్వనింపవచ్చును. ఒక దినపత్రిక శరభయ్యగారికుమార్తె సుపుత్రిని ప్రసవించినట్లు ప్రకటించినదని అనుకొందము. దీనిలో అపనిందయేమియు పైకిస్ఫురింపకపోవచ్చును. కాని, శరభయ్యకు ఒకేకుమార్తె, వివాహము కానిది గలదని అనుకొందము. అప్పుడు పై ప్రకటనలో అశ్లీలార్థముగలదని తేలును.

(II) నిందాప్రసంగము వాదినిగూర్చినదిగా ఉండవలెను :-

నిందాప్రసంగము తననుగూర్చినట్టిదని వాదికి వాద కారణముండును. వాదిని పేరుపెట్టి నిందాప్రసంగముచేయ వలసినపనిలేదు. వర్ణనచే ఫలానావ్యక్తికి సంబంధించినదని తెలియదగియుండవచ్చును. చిత్రలేఖనమువలన, వ్యంగ్య చిత్రములవలన వ్యక్తిపేరు వ్రాయకపోయినను ప్రసంగము ఎవరినిగురించియో తెలియజేయవచ్చును. అట్లుకూడ అపనింద కలుగవచ్చును.

వాస్తవముగా అపనిందకలిగిన, ఉద్దేశముతో ప్రమే యములేదు: ఒకవ్యక్తిని ఉద్దేశించి అపనింద మోపబడక పోయినను ఆ వ్యక్తికి అపనిందసోకిన,అతనికి వాదకారణము సిద్ధించును. ఒక దినపత్రికలో ఒకకథను ప్రకటించిరి. ఆ కథలో జోన్సు అను వ్యక్తి లండనులో సత్పురుషునివలెనుండి పారిసునగరములో ఉంపుడుగత్తెలతో త్రైతక్కలాడుచుండునని సారాంశము. లండనులో ఆర్టిమస్ జోన్సు అను లాయరుం డెను. అతనికి తెలిసినవారికి ఆకథలో జోన్సుఅనువ్యక్తి అతడే అను భావము కల్గెను. అందుచే అతనిని ఏవగించుకొనిరి. అతడు ఆపత్రికసంపాదకునిపై పరిహారమునకు దావా తెచ్చెను. సంపాదకునికిగాని, రచయితకుగాని ఆర్టిమస్ జోన్సు అను వ్యక్తి ఒకడు గలడన్నసంగతియే తెలియదు. అయినను నష్ట పరిహారము కోర్టువారు ఇప్పించిరి.

కథకులారా; పత్రికారచయితలారా ! జాగ్రత్తవహింప వలెసుండీ !

పై నిర్ణయమునుబట్టి కథకులకు, రచయితలకు సంకట సమస్య ఏర్పడినది. జోన్సు అనుపేరుగలవారు లండనులో ఎందరో ఉండవచ్చునుగదా. వారిలో ఇంక కొందరికి అప ఖ్యాతికల్గిన వారికికూడ పరిహారము చెల్లింపవలసియుండునని సిద్ధాంతమైనది. వారి అస్తిత్వమే తెలియకున్నను, వారిపై అపనిందమోపు ఉద్దేశము ఈషణ్మాత్రమైన లేకున్నను పరి హారము చెల్లింపవలసినస్థితి ఏర్పడినది. రచయితలు తమ కథలలోని పాత్రలు కేవలము కల్పితములని, ఎవరిని ఉద్దే శించినవికావని వ్రాయుచున్నారు. అయినను, ఎవరికైన నిజ

ముగా అపఖ్యాతికల్గించినచో నష్టపరిహారము చెల్లింపవలసియే యుండును. ఇంగ్లండులో చట్టమునుచేసి నటయితలకు ఈ సదుపాయమును తొలగించినారు. నాటకములలోకూడ అట్లు చేసిన బాగుండును.

(III) ప్రసంగమును ప్రకటింపవలెను :-

అపనింద మోపబడిన వ్యక్తికిగాక ఇతరులకు ప్రసంగము తెలియజేయబడుట ప్రకటన. వేరయ్య వీరయ్యను ఇతరులెవరును లేనప్పుడు "నీవు అబద్ధికుడవు" అనెను. ఇది అపనింద కాదు. భీమయ్యతో : "వీరయ్య అబద్ధికుడు" అని చెప్పిన అపనిందఅగును. ఇతరుల సమక్షములోనే అవమానము కల్గుచున్నది. అందులకే "మగడు కొట్టినందుకు కాదు; తోడికోడలు నవ్వినందుకు దుఃఖిస్తున్నా"నని అన్నదట ఒక సాధ్వీమణి.

అపనిందకు ప్రతివాదములు :-

(1) నిందను న్యాయమని నిరూపించుట : ప్రసంగము యథార్థమయిన వాదికి వాదకారణముండదు.

(2) ప్రత్యేకాధికారయుతసమయము: కొన్ని సందర్భములలో చేసిన ప్రసంగములు అపనిందగల్గించినను వాదకారణ రహితములు. సత్యాసత్యవిచారణ అనావశ్యకము. ఇట్టి సమయములు రెండురకములు : (I) పరమ ప్రత్యేకాధికారయుతసమయము. ఇట్టి సమయములో అపనిందాకరమగు ప్రసంగము దురుద్దేశపూరితమైనను బాధ్యతయుండదు (II) నిర్దిష్ట ప్రత్యేకాధికారయుత సమయము. ఇట్టి సందర్భములలో దురుద్దేశము లేకుండిననే రక్షణయొసగబడును.

ఉదాహరణలు :-

(I) పరస్పరప్రత్యేకాధికారయుత సమయము : విధాన సభలలోని సభ్యులు నిరాక్షేపణీయముగా, నిశ్శంకగా, యథేష్టముగా ప్రసంగించి దేశములోపల కుళ్లును, నైతికపతనమును రట్టునకీడ్చి సంస్కరింపవలసియుండును. వారి ప్రసంగములు కొందరికి అపఖ్యాతిని కల్గింపవచ్చును. కాని, ప్రజానీకముయొక్క మేలుకొరకు విధానసభసభ్యులకు విశేషాధికారము ప్రసాదింపబడినది. విధానసభలో చేసిన ప్రసంగములకు మాత్రమే వారికి రక్షణగలదు.

(II) న్యాయాలయకార్యములలో నిందా వాక్యములు : సాక్షులను విచారించునపుడు వకీలు, సాక్ష్యము చెప్పునపుడు సాక్షి, నిర్ణయముచేయుటలో న్యాయాధికారి నిందావాక్యములను జోనిపినను బాధ్యతయుండదు.

(III) అధికారి తన ఉద్యోగవిధులను నిర్వర్తించునపుడు నురియొక అధికారికి తెలియపరిచిన సంగతులందు ఇతరులకు అపనింద ఆపాదించు ప్రసంగమున్నను అధికారికి బాధ్యత యుండదు.

(2) విశిష్ట ప్రత్యేకాధికారము :-

నిష్కపటముగా, అసూయలేకుండ, పొరపాటుగా చేసిన అసత్యనిందాగర్భితవాక్యములకు ఈ క్రింది సందర్భములలో రక్షణగలదు.

(I) విధానసభయొక్క కార్యకలాపముల యథార్థ కథనము.

(II) న్యాయాలయకార్యకలాపముల యథార్థకథనము.

(III) పత్రికలలో బహిరంగసభల కార్యకలాపముల యథార్థకథనము.

(IV) వ్యవహారరీతిగాగాని నైతికముగాగాని, సామాజికముగాగాని నిర్వర్తింపవలసిన విధులను అనుష్ఠించునపుడు.

(3) ఉచితవ్యాఖ్యానము :-

ప్రజాక్షేమమునకుసంబంధించినవిషయములపై ఉచితవ్యాఖ్యలకు రక్షణగలదు. ప్రజాసేవకుల ప్రవర్తనను విమర్శించుటకు దీనివలన వీలుపడును. మంత్రులను, అధికారులను, రాజకీయవర్గాలకు, సంఘసంక్షేమసంస్థలకు చెందిన వ్యక్తులను విమర్శించుటకూడ ఇదేతరగతికి చెందును. పుస్తకములను ప్రచురించిన రచయితలను, కళనుప్రదర్శించు కళోపాసకులను (నటులు, గాయకులు,చిత్రకారులు మొదలగువారు) విమర్శింపవచ్చును. విమర్శచే విమర్శింపబడినవారిగౌరవమునకు హాని సంభవింపవచ్చును. విమర్శ ఉచితముగాఉన్నచో ఇట్టిహానిని ఓర్చుకొనవలెను. విమర్శనకు పునాదియైనఅంశములను సత్యముగావ్రాయుటయే విమర్శనలో ఔచిత్యము. ఈఅంశములు సత్యేతరములైన విమర్శ అనౌచిత్యదూషితము. ఉచితవ్యాఖ్యానమునకు విశిష్టప్రత్యేకాధికారమునుమాత్రమే కలదు. విమర్శదురుద్దేశముతో ప్రేరేపింపబడినచో ఈ రక్షణను పొందజాలదు.

(4) అజాగ్రత్త

లక్షణములు :-

ఈ క్రింద ఉదాహరింపబడిన సందర్భములలో అజాగ్రత్త అపకృతిఅగును.

(1) న్యాయశాస్త్ర నిర్దిష్టవిధి యుండవలెను:

(అ) వస్తువులను ఫాక్టరీయెస్తున చేయువారికి, వానిని అనుభవించువారికి నడుమను పాటింపవలసిన విధులు :-

ఒక కంపెనీవారు బీర్ అను సారాయిని తయారుచేసి వెలుగుచూరనియ్యని సీసాలలోపోసి చిల్లరవ్యాపారులకు అమ్మిరి. ఒక చిల్లరవ్యాపారినుండి పుల్లయ్య ఒక బీర్‌సీసాను కొని, తన ప్రియురాలు పుల్లమ్మ కిచ్చెను. పుల్లమ్మ కొంత సారాయిని ఒక పాత్రలోపోసికొని త్రాగెను. ఇంక కొంత సారాయిని పోసికోబోగా, ఒక నత్త—చచ్చిపోయినది—ఆ సీసాలోనుండి పడెను. దానినిచూడగానే సుకుమారిఅయిన పుల్లమ్మ అదిరినందున, శాంతిలయి, జ్వరపడెను. ఆమెకు సంభవించిన హానికి పరిహారము బీరును తయారుచేసినకంపెనీనుండి రాబట్టుకొనవచ్చునా? రాబట్టుకొనవచ్చును. యంత్రాగారములో తయారుచేయబడిన వస్తువులలో చెడుపదార్థములు మిశ్రమముకాకుండ చూచుట తయారుచేయువారి విధి. ఈ విధిని ఆ వస్తువులను చివరకు అనుభవించువారియెడ నిర్వర్తింపవలెను.

(ఆ) గృహములోనుండువారివిధులు :-

(I) అక్రమప్రవేశముచేయువారియెడ :-

పాపయ్యనివసించుయింటిలో ఒక నుయ్యి కలదు. ఆ

నూతికిచుట్టు గోడలు లేవు. తెలియకుండా ఎవరయిన ప్రవేశిం చిన, దానిలో పడు అవకాశముగలదు. ఒక దొంగ యింటిలో ప్రవేశించి, చూడక నూతిలోపడెను. అతడు తనకుసంభవించిన హానికి పరిహారము కోరవచ్చునా? వీలు లేదు. అతడు అక్ర మముగా ప్రవేశించినాడు. అతనియెడ నిర్వర్తింపవలసినవిధి ఇంట నివసించువారికి లేదు.

(II) అనుజ్ఞాధారియెడల :-

అనుజ్ఞతో ఇంటప్రవేశించినవానియెడ్ల కొంత బాధ్యతా యుతముగా ప్రవర్తింపవలెను. వానికి ఇంటిలో తనకు తెలిసిన గుప్తలోపములను తెలియజేయవలసిన బాధ్యత కలదు. లోపము బాహాటముగా అందరికి తెలియునదే అయినచో ఇట్టి బాధ్యత లేదు.

(III) ఆహ్వానించినవారియెడ :-

అనుజ్ఞాధారియెడకన్న నిమంత్రితునియెడ హెచ్చు బాధ్యత చూపవలెను. ఉదాహరణకు సొమ్ముననువచ్చు ఖాతా దారు ఆహ్వానితుడు. ఆహ్వానితులయెడ ఇంటనివసించు వానికి తెలిసిన గుప్తలోపములకేకాక, తెలియకపోయినను తెలిసికొనియుండవలసిన గుప్తలోపములకుకూడ బాధ్యత గలదు. ప్రత్యక్షలోపములకు జవాబుదారీ లేదు. ఒక మోటారుకార్లపందెములో రెండుకార్లు ఢీకొనగా, ఒకటి పైకి ఎగిరి, పందెముచూచుచున్నవారిలో ఒకనిపై బడి గాయ పరచెను. పందెములునడుపు క్లబ్బువారినుండి పరిహారమును గాయపడినవాడు కోరవచ్చునా? వీలు లేదు. ఇది ప్రత్యక్షా

పాయను. కనుక ఆహ్వానితుడుకూడ ఇట్టి అపాయమును ఎదుర్కొనుటకు సాహసింపవలసినదే.

(2) విధిఉల్లంఘన :-

ప్రతివాది తనయెడ విధి కలదని చూపుటే కాక, ఆ విధిని ఉల్లంఘించెననికూడ వాది ఋజువుచేయవలెను. శ్రద్ధగల సామాన్యమానవుడు చూపవలసిన జాగ్రత్త చూపనిచో, విధి భంగముకలిగినట్లు ఎంచవలెను. ఒకొక్కప్పుడు జరిగిన సంఘటననుబట్టియే విధిఉల్లంఘనజరిగినట్లు ఊహింపవచ్చును. పాపయ్య వీధిలో నడచుచుండగా ప్రతివాదిషాపుపైఅంతస్తు నుండి ఒక పిండిపీపా అతనినెత్తిమీద పడెను. ప్రతివాదియొక్క అజాగ్రత్త దీనికి కారణమని ఊహింపవచ్చును.

సహాయికమైన అజాగ్రత్తయొక్క ఫలము :-

ఒకని అజాగ్రత్తవల్ల హానికలిగిన, హానిపొందినవాడు కూడ అజాగ్రత్తగావుండి, ఆ హానిజరుగుటకు సహాయకారి అయినచో, పరిహారముకోరవీలులేదు. పాపయ్య వీధిలో రోడ్డునకుఅడ్డముగా ఒకకొయ్యను పాతెను. వీరయ్య గుఱ్ఱముపై అతివేగముగా స్వారీచేయుచు వచ్చి ఆ కొయ్య అడ్డముగాఉండుటచే క్రిందపడెను. ఇతడు పరిహారము కోరవచ్చునా? వీలులేదు. తన అజాగ్రత్తకూడ కలిసియున్నందున వలను పడదు.

సందిగ్ధావస్థలోచూపిన సహాయికమైన అజాగ్రత్త:-

సహాయకమైన అజాగ్రత్తయున్నను సందిగ్ధావస్థలో చూపబడినచో పరిహారము కోరవచ్చును. పాపయ్య బస్సులో స్థలములేక బస్సుపైన కూర్చుండి ప్రయాణము

చేయుచుండెను. షావుకారు వెంకయ్యగారిబస్సు చాలా వేగ ముతో ఎదురుగా వచ్చెను. రెండుబస్సులు ఢీకొనుటనుభయ ముగల్గి పాపయ్య క్రిందికి దూకి గాయపడెను. బస్సులు ఢీకొనలేదు. పాపయ్య బిగబట్టుకొని అక్కడనే కూర్చుండి యుండిన ఏ కీడును వచ్చియుండెడిదిగాదు. అయినను, అతడు ఉన్న భయానకపరిస్థితిలో సామాన్యశ్రద్ధతో ప్రవర్తించినచో అతడు పరిహారమును కోరవచ్చును.

(6) రోత ( = కష్టకరము, న్యూసెన్సు)

లక్షణములు :

అక్రమప్రవేశములేకుండ ఒకని ఆస్తినిగాని, దాని యందలి హక్కునుగాని అనుభవించుటకు అన్యాయముగా అవరోధముగల్గించుట కష్టకరమను అపకృతి.

ఉదాహరణలు :-

, ఇంటిలోనికి సూర్యరశ్మిరాకుండ నిరోధించుట, నీళ్ళను కల్మషపరచుట, పొగ, చప్పుడు, జంతువులు, దుర్వాసన మొదలగువానిని ఇంకొకరిస్థలముపైకి పోయి వారికి అసౌక ర్యముకలుగజేయుంచుట న్యూసెన్సులుగా పరిగణింపబడును.

ఆరవభాగము

# ప్రక్రియాకాండము

## 1. సాక్ష్యము

చట్టము :- ఇండియన్ ఎవిడెన్సు ఆక్టు (1872)

న్యాయాలయములు సాక్ష్యమును పరిశీలించి నిర్ణయింపవలెను. సాక్ష్యముయొక్క ఉద్దేశము కొన్ని విషయముల అస్తిత్వమును ఋజువుచేయుట. సాక్ష్యమునకు సంబంధించిన సమస్యలు మూడు కలవు.

(1) ఋజువుచేయుభారము ఎవరు నిర్వహింపవలెను?

(2) ఏ విషయములను ఋజువుచేయవలెను?

(3) విషయనిరూపణ ఎట్లుచేయవలెను ?

### (1) ఋజువుభారము

ప్రథమబాధ్యత :-

ఏవిషయమునైనను ఋజువుచేయనిచో ఎవరు వ్యాజ్యములో పరాజయముపొందుదురో వారిపై ఋజువుభారముండును. పేరయ్య ప్రామిసరీనోటుబాకీకి వీరయ్యమీద దావా తెచ్చెను. వీరయ్య తాను నోటును వ్రాయలేదని ప్రతివాదనచేసెను. వీరయ్య నోటును వ్రాసినాడని ఋజువుచేయు భారము పేరయ్యది. వీరయ్య నోటును వ్రాసినట్లు ఒప్పుకొని, మూలధనము తనకు ముట్టలేదని ప్రతివాదనచేసినచో, ముట్టనట్లు ఋజువుచేయవలసిన బాధ్యత అతనిదే. శరభయ్యపై

హత్యానేరము మోపబడినది. నేరము మోపిన సర్కారు అభియోక్త నేరమును ఋజువుచేయవలెను. ముద్దాయి హత్యను ఒప్పుకొని, ఆత్మరక్షణకొరకు హత్యచేసినందున నేరముకాదని ప్రతివాదనచేసినచో ఆత్మరక్షణకొరకే జరిపింపబడినదని ఋజువుచేసికొనుబాధ్యత అతనిదే.

## (2) ఏవిషయములను ఋజువుచేయవలెను

తన దావాలో జయముపొందుటకు ఆవశ్యకమగు విషయములన్నిటిని ఋజువుపరచవలెను. కొన్నింటిని ఋజువు లేకుండనే కోర్టువారు అంగీకరింతురు.

ఉదాహరణములు :

(1) ప్రమాణ అనపేక్షసూచన :-

న్యాయస్థానములో అందరికి తెలిసినవిషయములు కొన్ని ఋజువుకోరకుండనే అంగీకరింపబడును. బండ్లు ఎడమప్రక్కగా నడువవలెననియు, ప్రపంచములోని ప్రాంతముల పేర్లు, గవర్నమెంటువారిచ్చిన సెలవుదినములు, కోర్టులోని ఆఫీసర్లయొక్కయు, వకీళ్ళయొక్కయు పేర్లు, విధాన సభచే అంగీకరింపబడిన శాసనములు మొదలగునవి.

(2) పార్టీలచే ఒప్పుకొనబడిన విషయములు :-

వాద, ప్రతివాదపత్రములలో అంగీకరింపబడిన విషయములకు ఋజువు అనవసరము. దావా విచారణకు పూర్వము కక్షిదారులు (వాది, ప్రతివాదులు) వివాదములలో లేని విషయములను నిర్ధారణచేసికొని వానిని ఋజువుచేయవలసిన ఆవశ్యకత లేకుండనే చేసికొనవచ్చును. ఈవిధముగా వ్యాజ్యపుఖర్చులను తగ్గించుకొనవచ్చును.

(3) నిరపేక్షక ప్రమాణము :-

కొన్ని విషయములు ఋజువైనచో మరికొన్ని విషయములను వేరుగా ఋజువుచేయకుండనే ప్రమాణీకరింపవచ్చును. వీరయ్య పేరయ్యగారియొక్క ఔరసపుత్రుడా అనునది సమస్య. వీరయ్యతల్లి పేరమ్మ పేరయ్యను వివాహమాడినట్లును, ఆ వివాహము అవిచ్ఛిన్నముగా ఉన్నపుడు, పేరమ్మ పేరయ్యలు కలిసిఉన్నపుడు, వీరయ్య జన్మించినట్లును ఋజువైనది. దీనిని బట్టి వీరయ్య పేరయ్యగారియొక్క ఔరసపుత్రుడేఅని నిరపేక్షక ప్రమాణమువలన అంగీకరింపబడును. నిరపేక్షక ప్రమాణము వర్తించునపుడు, ఆ విషయమును ఖండించుటకు అవకాశము ఇయ్యబడదు.

(3) ఋజువుచేయుపద్ధతి

ఋజువుచేయు పద్ధతులు రెండు: (1) సాక్షుల వాఙ్మూలము. (2) లిఖితప్రమాణము.

వాఙ్మూలము :-

నిజమునే చెప్పెదనని దైవముమీద ప్రమాణముచేసి సాక్ష్యమునొసంగుదురు. కూటసాక్ష్యము నేరము. పైగా ఈ ప్రమాణమున నైతికశిక్షకుకూడ పాత్రుడగును.

సాక్షి ముఖ్యవిచారణ:-

సాక్షిని హాజరుపరచినవారి వకీలు ముందు పరీక్షించును. ఇది ముఖ్యవిచారణ. సూచకప్రశ్నలను ముఖ్య విచారణలో అడుగరాదు. సూచకప్రశ్నలలో పరీక్షకుడు రాబట్ట దలచిన సమాధానము స్ఫుటముగా కనబడుచుండును.

"పోయిన నెలలో బీచిదగ్గర ముద్దాయి గోతములో శవమునుదాచి తీసికొనిపోవుచుండగా ఆఖుసారిగా చూచి నారా ?" అని ప్రశ్నింపరాదు. ఈ క్రిందివిధముగా ప్రశ్నింప వలెను.

ఫిర్యాదువకీలు ప్రశ్న : మీరు ముద్దాయిని ఆఖుసారి ఎప్పుడు చూచితిరి ?

సాక్షి జవాబు : గతమాసములో.

ప్రశ్న : ఎక్కడ చూచితిరి ?

జవాబు : బీచిదగ్గర.

ప్రశ్న : ముద్దాయి దేనినైన తీసికొనిపోవుచుండెనా ?

జవాబు : అవును.

ప్రశ్న : దేనిని ?

జవాబు : ఒక గోనెసంచిని.

ప్రశ్న : దానిలో ఏమియుండెను ?

జవాబు : ఒక శవము.

ప్రతివిచారణ :-

ముఖ్యవిచారణ కాగానే, ప్రతిపక్షవకీలు ప్రతివిచారణసల్పును. ఇది ఒక కళ. చాతుర్యముగల వకీలు కూట సాక్షిని సులభముగా ప్రతివిచారణలో పట్టుకొనవచ్చును. ప్రతివిచారణలో సూచకప్రశ్నలను అడుగవచ్చును.

ముద్దాయివకీలుప్రశ్న : నీవు ముద్దాయిని చూచినప్పుడు బాగా చీకటిగానుండుటచేత గోనెలో ఏమి ఉన్నదో నీకు కనబడలేదు గదా ?

సాక్షిజవాబు : అప్పుడు పున్నమవెన్నెల ఉండెను.

ప్రశ్న : అయినా, గోనెలోపల ఏముందో నీ కెట్లా కనబడ్డదోయి ?

జవాబు : శవముగొనెయొక్క తల గోనెబయటికి వచ్చియుండెను.

ప్రశ్న : నీవు ఎంతదూరమునుండి చూచితివి ?

జవాబు : నేను చెప్పలేను; చీకటిగాఉండెను.

ప్రశ్న : వెన్నెల ఉందంటివి కదయ్యా ?

జవాబు : అవును.

ప్రశ్న : వెన్నెలలో గోనెలోఉన్నది తెలుస్తుంటే, ఎంత దూరములోఉన్నాదో తెలుసుకోలేవా ?

(మొదలగునవి)

పునఃపరీక్ష :-

సాక్షిని హాజరుపరచినవాడు ప్రతివిచారణ తర్వాత పునఃపరీక్షచేయవచ్చును. ప్రతివిచారణలో బయటపడ్డ విషయములనుగూర్చి మాత్రమే యిట్టి పునఃపరీక్ష ఉండును.

ఫిర్యాదువకీలుప్రశ్న : గోనెలోనిశవమును చూచిన తర్వాత నీకు ఎట్లాఉండెను ?

జవాబు : నాకు తలతిరిగిపోయింది.

ప్రశ్న : వెన్నెలఉన్నప్పటికి దూరములను గ్రహించగలశక్తి నీకు అప్పుడు ఉండెనా ?

జవాబు : లేదు.

సాక్షికి ఎక్కువహక్కులుగల పరిస్థితులు :-

ఎక్కువ హక్కులుగల సందర్భములలో కొన్ని ప్రశ్నలకు సాక్షులు జవాబుచెప్పవలసిన పనిలేదు. అట్టి సందర్భములకు ఉదాహరణలు క్రింద ఇయ్యబడినవి.

(1) న్యాయవృత్తిలో ఉత్తరప్రత్యుత్తరములు :-

ఒక కక్షిదారు వెంకయ్యగారను వకీలుతో "అయ్యా, ఈ పత్రముపై నేను దొంగసంతకము చేసితిని. ఏవిధముగానైనా ఫిర్యాదు వస్తే నాపక్షమును సాధించండి." అని, తర్వాత ఫిర్యాదును రాగా వీరభద్రయ్యగారను వకీలును పెట్టుకొనెను. వెంకయ్యగారిని సాక్షివిచారణచేయుచు పైసంభాషణనుగూర్చి ప్రశ్నించి జవాబు సంపాదింపవచ్చునా? వీలులేదు. వకీలును కుదుర్చుకొనుఉద్దేశముతో చెప్పినసంగతులుగాని, వకీలుయిచ్చిన సలహాలుగాని కక్షిదారుఅనుమతిలేకుండ బహిరంగపరచరాదు. వకీలుదగ్గరనున్న గుమాస్తాకు, పనివాండ్రకుకూడ ఈ విశేషపు హక్కుగలదు.

(2) అధికారిక ఉత్తరప్రత్యుత్తరములు :-

సర్కారుఉద్యోగులు తమకు ఉద్యోగద్వారమున నమ్మకముపై చెప్పినసంగతులను బయల్పరచుట ప్రజాహితమునకు ముప్పని తలచిన బహిరంగపరచనని సాక్ష్యములో చెప్పవచ్చును. పోలీసుఅధికారులు, మేజిస్ట్రేటులు నేరమును గూర్చినవిషయములు తమకు ఎవరుచెప్పిరో బహిర్గతముచేయ నావశ్యకతలేదు.

(2) భార్యాభర్తలనడుమ ఉత్తరప్రత్యుత్తరాలు :-

భార్యాభర్తలు ఒకరొకరికి తెలిపికొనినసంగతులను తెలిపినవారిఅనుమతిలేనిదే సాక్ష్యములో చెప్పరాదు. భార్యాభర్తలు ఒకరొకరిపై దావాగాని, ఫిర్యాదుగాని చేసుకొన్నపుడు, ఆ చర్యలలో ఇచ్చు సాక్ష్యమునకు ఈ సూత్రము వర్తింపదు.

శ్రుతసాక్ష్యనిషేధము :-

ముఖతః చెప్పిన సాక్ష్యము ప్రత్యక్షసాక్ష్యముగా నుండవలెను. చూచుటకు అనువయిన విషయమైన చూచినానని చెప్పగలవారిసాక్ష్యము కావలెను. పేరయ్య వీరయ్యను కొట్టెనా అనునది సమస్య. ఒక సాక్షి: "కామయ్య నాతో వీరయ్యను పేరయ్య కొట్టెనని చెప్పెను." అని సాక్ష్యమిచ్చిన శ్రుతసాక్ష్యమే కాని, ప్రత్యక్షసాక్ష్యము కాదు. శ్రుతసాక్ష్యమును న్యాయాలయములు ఆమోదింపవు. లేనియెడల పుకార్లు, వదంతులు, సాక్ష్యముక్రింద చెలామణీఅగునుకదా!

మరణాసన్న ప్రకథనము :-

పేరయ్యను వీరయ్య హత్యచేసెనా అనునది సమస్య. చనిపోవునప్పుడు పేరయ్య వీరయ్య తనను కత్తితో పొడిచెనని భీమయ్యతో చెప్పి చనిపోయెను. ఈ మరణాసన్నకథనమును ఋజువుచేయవచ్చును. శ్రుతసాక్ష్యనిషేధము ఇచట వర్తింపదు.

## లిఖిత ప్రమాణము

సార్వజనీనములైన దస్తావేజులు; వ్యక్తిగతపు దస్తావేజులు:-

రాజ్యపాలకుని, లేక సర్కారీ అధికారిసంఘముయొక్క లేక న్యాయసభల చర్యల నుద్దేశించు పత్రములు సార్వజనీనములైన దస్తావేజులు. వ్యక్తిగతపత్రములుగను నర్కారు వారు నకళ్ళను తీసిఉంచుచో సార్వజనీనములైన దస్తావేజులుగా ఎంచబడును. తక్కినదస్తావేజులు వ్యక్తిగతములైన దస్తావేజులు.

సార్వజనీనదస్తావేజులబుజువు :—

ధృవపరుపబడిన నకళ్ళ సహాయముననే సార్వజనీనములగు దస్తావేజులలో లిఖింపబడిన సమాచారములను బుజువుపరుప వచ్చును. అట్టినకళ్ళను చెల్లింపవలసిన పణమును చెల్లించి, సంపాదించవచ్చును.

దస్తావేజుల బుజువునకుసంబంధించిన సూత్రములు :—

(1) వ్యక్తిగతపుదస్తావేజును యథార్థమైనదని బుజువు పరచినతర్వాతనే దానియందు లిఖించినవిషయములను సాక్ష్యముక్రింద ఇయ్యవచ్చును. ఎవనిచేత దస్తావేజుపై వ్రాలుచేయబడి, అందలివాక్యలు వ్రాయబడినవో అతడే వ్రాలుచేసినట్లు బుజువయిన, దస్తావేజు యథార్థమైనదని బుజువైనట్లు.

(2) ప్రాచీనపుదస్తావేజు:— కనీసము 30సంవత్సరముల క్రింద వ్రాయబడినవి ప్రాచీనమైనదస్తావేజులు. అవి ఎవరి అధీనములో మామూలుగాఉంచవలెనో వారిఅధీనములో నుండి కనుపఱపబడిన అవి యథార్థమైనవని భావింతురు. అవి సరిగా చేవ్రాలు, సాక్ష్యంకితముచేయబడినవని ఊహింతురు;

(గ) రిజిష్టరుకానందున, రెవిన్యూస్టాంపులు వేయనందున కొన్ని దస్తావేజులు అందలివిషయములను ఋజువుచేయుటకు ఉపయోగింపబడవు.

## ప్రతిపన్నము; అపరాధాంగీకారము

ప్రతిపన్నము (అడ్మిషన్) :-

వివాదములోనున్న విషయమునుగూర్చిగాని, తత్సంబంధవిషయమునుగూర్చిగాని ఊహించుట కనువగు ప్రతిపాదన కక్షిదారు చేసియున్న ఆ ప్రతిపాదనను అతనికి వైరుధ్యముగా ఉపయోగింపవచ్చును. ఇట్టి ప్రతిపాదనలను ప్రతిపన్నము, అనగా అంగీకరింపబడినవిషయము లందురు.

అపరాధాంగీకారము :-

అపరాధపు అంగీకారమనగా ముద్దాయి నేరమును ఒప్పుకొనుట. న్యాయస్థానములో ముద్దాయి తాను నేరము చేసినట్లు అంగీకరించిన, వేరే ఋజువులేకుండానే అతనికి శిక్ష విధింపవచ్చును. కోర్టువారియెదుట చేయని అపరాధాంగీకారములను కొన్నినియమములకులోబడి ఉపయోగింపవచ్చును. ఆ నియమములు: (I) అపరాధపుఅంగీకారము స్వేచ్ఛగా, యథేచ్ఛగా చేయవలెను. అధికారులు భయపెట్టిగాని, ఏదేని లాభముగల్గునని మర్మముపెట్టిగాని సంపాదించినది సాక్ష్యము క్రింద చెల్లదు. యజమానుడు, గురువు, తల్లి-దండ్రులు, పోషణకర్త మొదలగువారు అధికారులలోనివారే. ముద్దాయితో వీరెవరయినను "నీవు అపరాధమును అంగీకరించిన విడుదలఅగుదువు" అని చెప్పి, నేరమును అంగీకరింపజేసిన ఆ అంగీకారము స్వేచ్ఛాన్వితముగాదు.

(II) పోలీసు వారి అధీనములో నున్నప్పుడు పోలీసు వారికి జేసిన అపరాధాంగీకార ప్రతిపాదనలు సాక్ష్యములో నెన్నటికీ రావు. మేజస్ట్రేటు సన్నిధానములో చేసిననే అట్టివి చెల్లును. మేజస్ట్రేటు ముందుగా ముద్దాయి తన అపరాధమును అంగీకరింపవలసిన అగత్యము అతనికి లేదని తెలియజేయవలెను. మేజస్ట్రేటు పరోక్షములో పోలీసు వారికి చెప్పిన సంగతులన్ని పోలీసు శాఖ వారు నేరమునకు సంబంధించిన సంగతి తెలిసిన కనుగొనిన, కనుగొనిన సంగతికి సంబంధించినంతవరకు ఆ ప్రతిపాదనను సాక్ష్యములో ఉపయోగించుకొనవచ్చును. ముద్దాయి: "నేను ఆభరణములను దొంగిలించితిని. ఆ నగలను తోటలో దాచితిని" అని చెప్పెను. దర్యాప్తు చేయగా నగలు తోటలో దొరికెను. "నేను నగలను తోటలో దాచితిని" అన్నంత వరకు సాక్ష్యములో ఉపయోగించుకొనవచ్చును. "నేను దొంగిలించితిని" అన్నదానిని వేరువిధముగా ఋజువు చేయవలెనేకాని, ముద్దాయి చెప్పినమాటవల్ల ఋజువు చేయవీలు లేదు.

## 5. వ్యవహారప్రక్రియలు

### చట్టము :- సివిల్ ప్రొసీజరు కోడు (1908)
### (వ్యవహారప్రక్రియాసంహిత)

### న్యాయస్థాన శ్రేణి

న్యాయస్థానములు :-

వ్యవహారవివాదములను న్యాయస్థానముల ద్వారమున నిర్ణయింపవలెను. న్యాయస్థానముల శ్రేణిలో ఉచ్చత

మున్యాయాలయము (సుప్రీముకోర్టు) అన్నిటికన్న పైస్థాయిలో కలదు. పునర్విచారణన్యాయాలయములలో ఇదే తుదితీర్పు చెప్పగల అధికారముగలది. ప్రతిరాజ్యములోను ఒక ఉచ్చ న్యాయాలయము (హైకోర్టు) కలదు. దీనికిలోబడి ఆ రాజ్యములో ఇతరన్యాయస్థానము లుండును. ప్రతిజిల్లాలో జిల్లా కోర్టు, సబ్ కోర్టు, మున్సిఫ్ కోర్టు నుండును. ఈ న్యాయస్థానముల ఆర్థికఅధికారక్షేత్రము, పునర్విచారణాధికారవ్యవస్థయు క్రింద వివరింపబడినది.

| విచారణ న్యాయాలయము | ఆర్థికాధికార క్షేత్రము | ప్రథమ పునర్విచారణ | ద్వితీయ పునర్విచారణ |
|---|---|---|---|
| మున్సిఫ్ కోర్టు | 5000 రూ॥దాక | సబ్ కోర్టు | హైకోర్టు |
| సబ్ కోర్టు | ఎంతయినను అవధిలేదు | (1) జిల్లాకోర్టు 7500 దాక<br>(2) హైకోర్టు 7500 పైన | హైకోర్టు |
| జిల్లాకోర్టు | ఎంతయినను అవధిలేదు | హైకోర్టు | సుప్రీముకోర్టు<br>(1) దావాఆస్తి 20,000 మించిన<br>(2) క్రిందికోర్టుతీర్పును పడగొట్టిన లేకవిధి ప్రశ్నఉన్న |

షరా : (1) ఇవిగాక లఘుసాధన్యాయాలయములు గలవు. ఇవి స్వల్పమైన దావాలను నిర్ణయించును.

(2) కక్షిదారులు రాజీకి ఒప్పుకొనగా ఇయ్యబడిన రాజీతీర్పుపై పునర్విచారణ లేదు.

## (6) వాదస్థాపన

వకీలును ఏర్పాటుచేసికొనుట :-

వాది వాదపత్రికను(ప్లెయింటును) న్యాయస్థానములో దాఖలుచేసుకొనవలెను. వాది ఒకవకీలును (న్యాయవాదిని) తనప్రతినిధిగా ఏర్పాటుచేసికొనును. ఈ ప్రతినిధిగా ఏర్పరచుకొనుట వకాలత్ ఫారమ్‌పై చేవ్రాలుచేసి కోర్టులో దాఖలు చేయుటచే సిద్ధించును. వకాలత్ వలన కక్షిదారు తనతరఫున హాజరగుటకు, వాదించుటకు, దస్తావేజులను వాపసుపొందుటకు, సొమ్ము వాపసుపొందుటను మొదలగుచర్యలు నడపించుటకు వకీలునకు అధికారమొసంగును. కక్షిదారుగాని, వకీలుగాని చనిపోవువరకుగాని, దావాలో చర్యలు అంతమగువరకుగాని వకాలత్ అమలులోఉండును. వకాలత్‌ను ఉపసంహరించుటకున్యాయస్థానముయొక్క అనుమతి ఆవశ్యకము. వాదించుటకుమాత్రమే వకీలును ఏర్పాటుచేసికొనవచ్చును. అప్పుడు వకీలు ఉపస్థితిజ్ఞాపనము దాఖలుచేసిన చాలును;వకాలత్ అవసరములేదు.

వాదస్థానము :-

(1) స్థిరాస్తికిసంబంధించిన దావాలు: తనఖాదావాలు, విభాగపుదావాలు; నిష్క్రమణనుకోరుదావాలు ఆస్తి యే

కోర్టుయొక్క అధికారక్షేత్రములో ఉండునో అచ్చటనే దాఖలుచేయవలెను.

(2) స్థావరవిషయికాపకృతులకు పరిహారము కోరు దావాలు ఏ కోర్టుయొక్క అధికారక్షేత్రములో అపకృతి జరిగినో లేక ప్రతివాది నివసించుచుండునో అచ్చట దాఖలుచేయవలెను.

(3) ఇతరములైనదావాలు (ఉ॥ ఖరారుపైన ఏకోర్టుయొక్క అధికారక్షేత్రములో వ్యాజ్యమునకు కారణము కలిగినో, లేక అందరుప్రతివాదులు నివసించుచుందురో, లేక కోర్టుఅనుమతితోగాని తక్కినప్రతివాదుల అభ్యంతరములేక పోయినగాని, ఏ ఒక్క ప్రతివాది నివసించుచుండునో, ఆ కోర్టులో దావాలేవలెను.

దావాను విచారించుటకు అనువగు న్యాయస్థానములలో ఏది కనిష్ఠతమమో అందు దావా దాఖలుచేయవలెను. ఉదా॥ 4000 రూ॥ విలువగలదావాను మున్సిఫ్ కోర్టులో వేయవలెనుగాని, సబ్ కోర్టులో గాదు.

వాదపత్రికను తయారుచేయుట :-

వాదపత్రికలో వాదకారణము, వాదికోరుపరిహారము పేర్కొనబడును. వాది తన వాదకారణమును విభజింపరాదు. అనగా, తన పరిహారమునంతయూ ఒకేసారి కోరవలెను. విడిచిపెట్టిన పరిహారముకొరకు తిరిగి దావా వేయుటకు వీలులేదు. ఉదా॥ పేరయ్యకు తన రైతునుండి 3 సంవత్సరముల మక్తా చేరవలెను. ఒక సంవత్సరపుమక్తాకే దావాతెచ్చిన,

మిగత 2 సంవత్సరముల మక్తా వసూలుకై వేరొక దావా తెచ్చుటకు వీలులేదు.

ద్రవ్యవిషయికమైన దావాలలో ఎంతరావలెనో నిశ్చితముగా తెలుపవలెను. లెక్కలు తేల్చుటకు తెచ్చిన దావాలో యెంత రావలెనో ఉజ్జాయింపుగా తెలుపవలెను.

ప్రతివాదులు ఎందరు కలరో అన్ని వాదపత్రము ప్రతులు దాఖలుచేయవలెను. వాది తన అధీనములోనున్న దస్తావేజుమూలముగా దావా తెచ్చిన, ఆ దస్తావేజుగాని దాని నకలుగాని వాదపత్రముతో దాఖలుచేయవలెను. వాది తన హక్కును స్థిరపరచుటకు ఆధారపడే దస్తావేజులపట్టీని దాఖలు చేయవలెను. పట్టీలో లేని దస్తావేజును తర్వాత సాక్ష్యములో ఇయ్యవలసివచ్చినచో కోర్టువారి అనుమతిని పొందవలెను.

రిక్తహస్తునిదావా :-

వాదపత్రికపై చెల్లింపవలసిన న్యాయాలయ శుల్కము చెల్లించుటకు తగిన ఆస్తిలేనివాడు రిక్తహస్తుడు. అట్టి వారికి శుల్కములేకుండనే దావాదాఖలుచేయుటకు సౌకర్యము కలదు.

అల్పవయస్కుని దావా లేక అల్పవయస్కునిపై దావా :-

అప్రాప్తవ్యవహారదశులు (18సంవత్సరములు నిండని వారు) ఆసన్నమిత్రునిద్వారమున వాదపత్రికను దాఖలు చేయవలెను. వారు ప్రతివాదులగుచో వారికి వాదికోరికపై గాని, వారితరఫున దాఖలైన ప్రార్థనాపత్రముపైగాని కోర్టు వారు దావానిమిత్తము సంరక్షకుని ఏర్పాటుచేయుదురు. అల్పవయస్కునికి ఒకరక్షకుడు అధికారయుతముగా ఏర్పా

ంయియున్నచో, అతనికే దావాలో ఆసన్నమిత్రుడుగా గాని, ప్రతివాదికి దావాలో సంరక్షకుడుగా గాని వ్యవహరించుటకు సామర్థ్యముగలదు. అర్హతగలవారు ప్రతివాదికి దావాలో సంరక్షకులుగా వ్యవహరించుటకు విముఖులుగా ఉన్నచో కోర్టువారు ఒక వకీలును సంరక్షకునిగా ఆ పనికి నియోగించెదరు.

ఉన్మత్తులవిషయము :-

పైన అల్పవయస్కుల విషయములో చెప్పిన సూత్రములు ఉన్మత్తులకుకూడ వర్తించును.

తాఖీదుపంపుట :-

వాదపత్రిక దాఖలుకాగానే న్యాయాలయపు ముద్రాంకనుగల తాఖీదు న్యాయాధిపుని చేవ్రాలుతో ప్రతివాదికి జారీ అగును. ఈ తాఖీదులో ఏ తారీఖున ప్రతివాది న్యాయాలయములో హాజరుకావలెనో తెలియబఱచును. న్యాయస్థానపు ప్రారంభిక క్షేత్రాధికారములో నివసించుచున్నచో లేక న్యాయస్థానమునకు 200 మైళ్ళకు తక్కువగుదూరములో ఉండి రవాణాసౌకర్యములున్నచో (ఉ॥ రైలుబండియున్నచో) ప్రతివాదిని స్వయముగా హాజరుకమ్మని తాఖీదు పంపవచ్చును. ఇతరపరిస్థితులలో స్వయముగా హాజరు కానావశ్యకముండదు.

తాఖీదు అందించుట :-

కక్షిదారునికి లేక అతనిప్రతినిధికి తాఖీదుముట్టవలెను. కక్షిదారు కనబడలేదు. అతనికి ప్రతినిధి లేదు. అప్పుడు కక్షిదారు కుటుంబములోనివాడైన ప్రాప్తవయస్కుడగు పురుషు

నికి అందజేయవచ్చును. ఇదికూడ వీలుపడనిచో ప్రతివాది సాధారణముగా నివసించు గృహమునకుగాని, వ్యాపారము చేసికొనుచోటగాని బాగుగా కన్పించునట్లు తాఖీదును అతి కించవలెను. అట్టి సందర్భములో తాఖీదును అందజేయుటకు వెళ్ళిన కోర్టుఅమీనాను ప్రశ్నించి జరిగినసంగతిని కోర్టువారు తెలిసికొందురు. ప్రతివాది తాఖీదును తీసికొనక, ఉద్దేశ పూర్వకముగా జాప్యముచేయుచున్నాడనియు, పై పద్ధతిలో తాఖీదు అందజేయుటకు అవకాశములేదనియు కోర్టువారు విశ్వసించినచో ప్రత్యామ్నాయప్రమాణమును (సబ్స్టిట్యూటెడ్ సర్వీస్) అనుసరించవచ్చును. అప్పుడు కోర్టునోటీసు ఒక బహిరంగప్రదేశములో తాఖీదుసారమును అంటించవలెను. కక్షిదారునికి తాఖీదు అందినట్లే యెంచబడును.

## 7. విచారణ

లిఖితప్రకథనము :-

ప్రతివాది తనమీద తేబడిన దావాలోని అంశములలో దేనికి ఆక్షేపణకలదో తెలుపుచు లిఖితపూర్వకముగా తన కథనమును కోర్టులో మొదటివిచారణ తేదీలోగా దాఖలుచేయవలెను.

ఏకపక్షీయనిర్వర్తన :-

తాఖీదులో ప్రతివాది ఏ తేదీని హాజరుకావలెనో తెలియజేయును. ఆ తేదీని వాదికూడ హాజరుకావలెను. వాది, ప్రతివాదు లిద్దరు హాజరుకానిచో దావా కొట్టివేయబడును. వాది తిరిగి దావా తెచ్చుకొనవచ్చును. ప్రతివాది హాజరయి, వాది

హాజరుకానిచో దావా కొట్టివేయవచ్చును. అప్పుడు వాది వేఱుగా దావా తెచ్చుకొనుటకు వీలుండదు. వాది తన వ్యాజ్యెమును కొట్టివేసిన ఆదేశమును ప్రత్యాఖ్యానించుటకు ప్రార్థింపవచ్చును. అతడు పూర్వపువిచారణకు హాజరుకాకుండుటకు సమర్థనీయమగు కారణములున్నచో ఏకపక్షీయనిర్వ్రరనను పూర్వపక్షముచేసి దావాను పునఃపరిశీలనచేయుటకు కోర్టువారు నిశ్చయింపవచ్చును.

ప్రతివాది హాజరుకాక, వాది హాజరయినచో కోర్టువారు ఏకపక్షీయనిర్వర్తనతో అతనికి "డిక్రీ" ఇయ్యవచ్చును. ఇట్టి ఏకపక్షీయమగు డిక్రీని ప్రత్యాఖ్యానింపుమని ప్రతివాది కోరవచ్చును. అతడు పూర్వపు విచారణకు హాజరుకాకుండుటకు తగినకారణములున్నచో కోర్టువారు అట్లేచేసి దావాను పునఃపరిశీలనచేయుటకు నిశ్చయింపవచ్చును.

విషమసమస్యానిర్దేశము :-

వాది ప్రతివాదులు వివాదపడుచున్న అంశములు ఏవో వారి వాదపత్రిక, లిఖితకథనము, దాఖలయిన దస్తావేజులు మొదలగువాని సహాయముతో కోర్టువారు నిర్ణయింతురు. వీనిపై కోర్టువారి అభిప్రాయమునుబట్టి వాది ప్రతివాదులహక్కులు ఆధారపడియుండును. వీనినే విషమసమస్యలందురు.

సాక్షులకు తాఖీదు :-

ఎవరిసాక్ష్యము దావాలో ఆవశ్యకమగునో వారికి సాక్షిసమనులు పంపవచ్చును. సాక్షికి రాకపోకలకువలసిన పైకమును, ఒకరోజుఉండుటకు కావలసిన పైకమును కోర్టులో

సాక్షినిపిలిపింపదలచిన కక్షిదారు దాఖలుచేయవలెను. ఈ బత్తాను సాక్షికి కోర్టువారు అందచేసినప్పుడు ఇయ్యవలెను. ఒక రోజుకన్న ఎక్కువకాలము సాక్షి ఉండవలసివచ్చిన యెడల అతనినిపిలిపించిన కక్షిదారు వలసినంత బత్తా మొత్తమును కోర్టులో చెల్లింపవలెను. సాక్షి సమనును నిర్లక్ష్యము చేసిన యెడల, కోర్టువారు అతనిఅరెస్టుకు వారంటును జారీచేయవచ్చును; 500 రూ॥ దాక జరిమానా విధింపవచ్చును. జరిమానా రాబట్టుటకు అతనిఆస్తిని జప్తుచేసి, అమ్మింపవచ్చును.

కమీషను ద్వారమున సాక్షివిచారణ :-

కొంతమందికి సాక్ష్యమిచ్చుటకు కోర్టునకు రావలసిన పనిలేకుండ ప్రత్యేకముగ మినహాయింపు ఉండవచ్చును. (ఉ॥ పర్దా స్త్రీలు) కొంతమంది అనారోగ్యముచే కోర్టునకు రాలేరు. సర్కారు ఉద్యోగులు ఉద్యోగధర్మము నిర్వర్తింపవలసియుండిన కోర్టునకు వచ్చుటకు అవకాశము లేకపోవచ్చును. అట్టి సందర్భములలో వారుఉన్న చోటికి ఒక కమీషనరును (సాధారణముగా ఒకవకీలును) పంపి, వారిసాక్ష్యమును అక్కడనే పూర్తి చేయించి కోర్టువారికి అందజేయవచ్చును.

సాక్షివిచారణ :-

విచారణనాడు వాది తన వాదమును వివరించి, తాను ఋజువుపరుపవలసిన విషయసమస్యలనుగూర్చి సాక్ష్యమును ప్రవేశపెట్టును. న్యాయాలయములలో బహిరంగముగా సాక్ష్యమీయవలెను. అప్పీలుఉన్న కేసులలో, అనగా పైన్యాయాలయములచే పునర్విమర్శచేయబడగల కేసులలో న్యాయాధిపతి కోర్టువారిభాషలో సాక్షులకథనమును వ్రాసి

కొనును. సాక్షికి ఆ భాష రానిచో, అతనికి ఆ వ్రాసినదన్న దేమిటో తెలియచెప్పవలెను. అట్లు తెలియజెప్పినతర్వాత న్యాయాధిపతి ఆ సాక్షికథనముగలపత్రములపై సంతకము చేయును. అప్పీలులేనివ్యాజ్యములలో సాక్షులకథనములోని సారాంశమును న్యాయాధిపతి వ్రాసికొని సంతకముపెట్టును. ప్రతివాది తర్వాత తన వాదమును ప్రతిపాదించి తన సాక్ష్యమును ప్రవేశపెట్టును. తర్వాత విషయసమస్యలనుగూర్చి సాక్ష్యముబలాబలములను వివరించును. వాది దీనికి ప్రత్యుత్తరమిచ్చును.

కోర్టునిర్ణయము :—

వాదోపవాదములను విన్నతర్వాత న్యాయాధిపతి తన నిర్ణయమును బహిరంగముగా న్యాయస్థానములో ప్రకటించును. లేదా నిర్ణయమును ఆలోచననిమిత్తము వాయిదా వేయవచ్చును. అట్లు వాయిదా వేసిన కక్షిదారులకు తెల్పి వాయిదా తేదీన బహిరంగముగా కోర్టులో నిర్ణయమును ఉద్ఘాటింపవలెను. న్యాయాధిపతి నిర్ణయమును వ్రాసియుంచిన, అతడు బదిలీఅయినను ఉత్తరాధికారి దానిని కోర్టులో చదువవచ్చును. నిర్ణయమును కోర్టులో ఉచ్చరించినప్పుడు దానికి తారీఖు, నిర్ణయాధికారిచేవ్రాలు చేర్పబడును తర్వాత లేఖక, గణితప్రమాదములను మార్చవచ్చునే కాని, నిర్ణయమును మార్చుటకు వీలులేదు, ఆజ్ఞప్తి (డిక్రీ)ని నిర్ణయమునకనుగుణముగా లిఖింతురు. దానిలో దావానంబరు, కక్షిదారులపేర్లు, వర్ణన, దావాలో అర్థింపబడిన హక్కులు, కోర్టువారు ప్రసాదించిన పరిహారమును సూచింపబడును. కక్షి

ఆజ్ఞప్తిని రిక్తసాధనకు పంపవచ్చును. ఉదా॥ నిర్ణీతుడైన ఋణియొక్క ఆస్తులు వేఱు న్యాయస్థానముయొక్క అధికార క్షేత్రములో ఉన్నపుడు ఆజ్ఞప్తియొక్క ప్రమాణితప్రతిలిపితో అమలుచేయుమని అర్థించు ప్రార్థనపత్రికను అమలుజరుపు కోర్టులో ప్రాప్తాజ్ఞప్తి దాఖలుచేయును. ఆజ్ఞప్తి ప్రసాదింప బడిన తేదినుండి ఒకసంవత్సరముదాటినతర్వాత అమలుజరుపుటకు ప్రాప్తాజ్ఞప్తి కోరిన, నిర్ణీతుడైన ఋణికి సూచనపత్రిక పంపకుండ అమలుజరుపరాదు.

అమలుజరుపుపద్ధతులు :-

(1) ఆజ్ఞప్తిప్రకారము ఆధీనముచేయుమన్న ఆస్తిని ఆధీనముచేయుట (2) నిర్ణీతఋణిని చెఱసాలలో ఉంచుట. ఈ విధానము ద్రవ్యమొసంగవలసిన ఆజ్ఞప్తులకే అన్వయించును. నిర్ణీతఋణి పరారియగుననికాని, దావా అనంతరము ఆస్తిని దాచుట లేక అన్యాక్రాంతముచేయుట దుస్సంకల్పముతో చేయుచున్నట్లుగాని, ధనముండియు ఆజ్ఞప్తిని నిర్వర్తింపకున్నాడనిగాని, విశ్వాసాశ్రితస్థానములో జవాబుచెప్పవలసినవాడయియున్నప్పుడుగాని, కోర్టువారు అధమర్ణుని చెఱసాలలోఉంచుటకు సమ్మతింతురు. ప్రాప్తాజ్ఞప్తి బందికి కోర్టువారు నిర్ణయించుప్రమాణములో ఉపజీవికకై బత్తెము ఇయ్యవలెను. చెఱసాలలోఉంచుటకు గరిష్ఠకాలపరిమితి: (1) 50 రూ॥లకన్న ఎక్కువ మొత్తము చెల్లింపవలసినడిక్రీలకు— 6 మాసములు (2) ఇతరములైన డిక్రీలకు ఆఱువారములు బందిలోఉంచినను ఆజ్ఞప్తి చెల్లింపకపోయిన, నిర్ణీతఋణము

విమోచనమైనట్లు కాదు. కాని ఋణదాత తిరిగి అదే ఆజ్ఞప్తిని అమలుజరుపుటకు చెరసాలకు పంపవీలు లేదు. నిర్ణీతఋణ ఆమొదిఅయిన ఈపద్ధతిని ఆజ్ఞప్తిని అమలుపరచవలెను. నిర్ణీతార్థ మున్నదు అప్పులు చెల్లింప శక్తి లేదని ఒప్పుకొని దివాలాతీర్పు నట్లు న్యాయనిర్ణయముకొరకై నెలరోజులలో తగుచర్యలు తీసికొన సంకల్పించినట్లు తెలియజేసిన చెరసాలనుండి విడుదలచేయుదురు. కొంతమందిని చెరసాలలో పెట్టుటకు వీలు లేదు. విధానసభాసభ్యులైనపుడు విధానసభాసభ్యులను న్యాయస్థానములకు పోవుచున్నపుడు, అందు అధ్యక్షించుచున్నపుడు, ఇంటికి తిరిగివచ్చునపుడు న్యాయాధిపతులను ప్రాప్తాజ్ఞప్తి చెరసాలలో ఉంచునట్లు అడుగుటకు వీలులేదు.

(బ) చరమగు ఆస్తిని జప్తు చేయుట:-

జప్తుచేయువిధము ఆ ఆస్తియొక్క స్వభావమునుబట్టి యుండును. వ్యవసాయపుపంటను జప్తుచేయుటకు పంట పెరుగుచున్న పొలములో లేక నూర్పిడి అయి కాగా, ప్రోగుపడిన చోటులో జప్తు ఉత్తరువును అంటించవలెను. నిర్ణీతార్థ మున్నదుండు గృహముయొక్క బయటద్వారమునందు కూడ అతికింపవలెను. అట్లు చేయుటచే ఆ ఫలసాయము కోర్టువారి ఆధీనములోనికి వచ్చినట్లు భావింపబడును. ఇతరములగు చరపుటాస్తిని స్వాధీనముచేసికొనుటవలన జప్తుచేయబడును. కొన్ని రకముల చరమగు ఆస్తిని జప్తుచేయరాదు. ఉదా॥ ధరించిన వస్త్రములు; అన్నమువండుకొను పాత్రలు, పండుకొను మంచములు, పరుపులు. ఇవి అర్థమున్ననిర్ణీతను, అతని భార్య

నైనను, సంతానమునైనను జప్తుచేయరాదు. ఆధునారి మెడ లోని తాళిని జప్తుచేయరాదు.

(4) స్థిరపుగా ఆస్తిని జప్తుచేయుట:-

స్థిరముగు ఆ స్తిని జప్తుచేయుటకు కోర్టువారు అధమర్ణుని ఆ ఆస్తిని అన్యాక్రాంతనుచేయవద్దని ఆజ్ఞాపత్రమును పంపు దురు. ఆ స్తి పరిసరములలో డప్పు వాయించి ఆ నిషేధాజ్ఞను ఘోషపెట్టుదురు. ఆ స్తిపైనను, కోర్టులోను బాగుగా కనబడు నట్లు ఆజ్ఞాపత్రముయొక్క ప్రతిని అంటించుదురు. జప్తుక్రింద వచ్చు నాస్తులను జప్తుతర్వాత జరిగిన అన్యాక్రాంతములు భంగముకల్గింపలేవు. పేరయ్య సీతయ్యఆస్తిని జప్తుచేయిం చెను. అయినను సీతయ్య భీమయ్యకు ఆ ఆస్తిని అమ్మెను. పేరయ్య జప్తు చేయబడిన ఆ స్తిని తర్వాత వేలము వేయగా, శరభయ్య కొనెను. శరభయ్యహక్కులు జప్తుక్రింద వచ్చి నవి. కనుక వానిని సీతయ్యచేసిన అన్యాక్రాంతము బాధిం పదు. శరభయ్యకు ఆ స్తి స్వాధీనముచేయవలసియుండును.

(5) ఆ స్తిని వేలము వేయించుట:-

జప్తు అయిన ఆ స్తిని వేలము వేయింపవచ్చును. ఈ వేలము కోర్టు అధికారిచే బహిరంగముగా జరుపబడును. ప్రథమముగా వేలము ప్రకటింపబడును. ప్రకటనలో ఆ స్తికి సంబంధించిన వివరములు, చెల్లింపవలసిన మొత్తము మొద లగువిషయము లుండును.స్థిరమైనఆ స్తి వేలమునకు ఈ ప్రకట నను కోర్టులో అంటించినప్పటినుండి ౩౦రోజులు జరుగవలెను. నిర్ణీతుడా అధమర్ణుడు లిఖితపూర్వకముగా అంగీకరించిన

గాని అంతకుముందుగా వేలము వేయరాదు. వేలము పూర్తి గాకముందు ఆజ్ఞప్తిలో ఉల్లేఖించిన ధనమును, అసలుచేయుటకైన ఖర్చులను వేలము వేయు అధికారికి చెల్లించిన వేలము నిలిపివేయబడును. కోర్టువారి అనుమతిలేకుండ ప్రాప్తాజ్ఞప్తి వేలములో పాట పాడరాదు. అనుబంధపు చట్టములో వాక్యము కల అధికారులుకూడ వేలముపాట పాడరాదు. అందరికన్న ఎక్కువ పాటపాడినవానిచే ఆ ఆస్తి క్రేతగానుండునట్లు నిర్ణయించును. అతడు వెంటనే ధనములో 25% (నూటికి 25) చెల్లింపవలెను. అట్లు చేయనిచో ఆ ఆస్తి తిరిగి వేలము వేయబడును. ఈసారి పాట యిదివఱకు దానికన్న తక్కువైనచో నష్టమును అతడే పూర్తిచేయవలెను. చెల్లించినదిగాక మిగత 75% పైకమును 15 రోజులలో చెల్లింపవలెను. అట్లుచేయనిచో మరల వేలము ప్రకటించి తిరిగి ఆ ఆస్తిని అమ్మవచ్చును. ప్రాప్తాజ్ఞప్తి వేలములో కొన్నచో అతనికి రావలసిన మొత్తమును విక్రయ ధనముక్రింద చెల్లగట్టవచ్చును. అందుచే అతడు 25% కొన్నపుడే ఇవ్వవలసినదను నియమమును పాటింపవలసిన ఆవశ్యకత యుండదు.

## వేలమును స్థిరముచేయుట:—

వేలమువలన సిద్ధించిన విక్రయమును న్యాయస్థానము స్థిరపఱచవలెను. నిర్ణీతబాధమద్దుడుగాను, వేలమునకు పూర్వమే అతనినుండి ఆ ఆ స్తిలో హక్కులు సంపాదించినవారుగాని కోర్టులో ఆజ్ఞప్తిక్రింద చెల్లింపవలసిన ధనము + వేలము మొత్తములో 5% (నూటికి 5 రూపాయలు) కోర్టులో కట్టిన వేల

మును రద్దు చేయుమనును. వేలమును ప్రకటించుటలోగాని, నిర్వహణలోగాని నియమోల్లంఘనమును జరిగిన లేక మోసము జరిగిన యెడల, వేలమువలన నష్టపడినవారు దానిని రద్దుచేయుమని అర్థింపవచ్చును. నిర్ణీతార్థఋణునికి ఆస్తిలో హక్కులు లేనియెడల వేలములో కొన్నవారు క్రయమును రద్దుపరచుటకు అర్థింపవచ్చును.

వేలపు విక్రయ ధ్రువీకరణపత్రము :-

వేలము స్థిరపడిన తర్వాత, న్యాయస్థానముచే క్రీతకు విక్రయధ్రువీకరణపత్రము ప్రసాదింపబడును. ఈ ధ్రువీకరణ పత్రికవలన ఆ ఆస్తిలో హక్కులు వేలములో అమ్మకముజరిగిన తేదినుండి ఉద్భవించును. ధ్రువీకరణ పత్రమును పొందిన క్రీతపై ఎవరును ఆ క్రయపుటాస్తి తనకొరకుగాని, అన్యస్వామ్యముకైగాని క్రీతపేరున కొనబడినదని దావా తెచ్చుటకు వీలులేదు. పేరయ్య వేలములో కొని, విక్రయ ధ్రువీకరణపత్రమును తనపేరున పొందెను. చెన్నయ్య తానే ఆ ఆస్తిని నిజముగా కొన్నట్లును, నామకః పేరయ్య పేరున ధ్రువపత్రమును పొందినట్లును ఆరోపించుచు ఆ ఆస్తి స్వాధీనమునకు పేరయ్యపై దావా తెచ్చెను. ఈ ఆరోపణము నిజమైనను దావానుకొట్టివేయవలసినదే. చెన్నయ్యధనముతో పేరయ్య ఆ ఆస్తిని కొని, చెన్నయ్యను మోసముచేసికాని, సమ్మతి లేకుండగాని, తన పేరును ధ్రువపత్రికలో చేర్పించికొనినచో చెన్నయ్యదావా సమర్థనీయము.

## ఏడవ భాగము

## ద ణ్డ ప్ర క్రి య లు

చట్టము:—దణ్డప్రక్రియాసంహిత (1898)
(1955లో ముఖ్యమైన సవరణలు జరిగెను.)

దోష విచారణపద్ధతి సంక్షిప్తముగా ఇక్కడ వివరింప బడును.

### 1. న్యాయవిచారణయంత్రాంగము

రక్షకభటుల శిబ్బంది:—

రక్షకభట శాఖ ఇండియాలోని ప్రతి రాజ్యములోను కలదు. ఈ శాఖకు అధికారి ఆరక్షీయమహానిరీక్షకుడు (ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్). ప్రతిజిల్లాకు ఒక ఆరక్షీయాధీక్షకుడు (సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్) గలడు. ప్రతిఅధీక్షకుడు (డిప్యూటీ సూపరింటెండెంట్), సహాయక అధీక్షకుడు (అసిస్టెంట్ సూపరింటెండెంట్)అనువారుకూడ జిల్లాలో ఉందురు. ఈ అధీక్షకులక్రింద పనిచేయునారు: మండలనిరీక్షకులు; ఉపనిరీక్షకుడు, రక్షకభటులు. ప్రతి పోలీసుఖానా (ఆరక్షకగృహము; పోలీసుస్టేషన్) వీరిలో ఒకరి అధికారములో ఉండును. జిల్లాలో ఎన్ని పోలీసుఖానాలుండవలెనో వాని విస్తీర్ణమును అక్కడి పరిస్థితులనుబట్టి నిర్ణయింతురు. ఈ రక్షకశాఖశిబ్బందియొక్క విధి నేరస్థులను పట్టుకొనుట, న్యాయస్థానములలో వారిని విచారణజరిపించుట.

న్యాయశాఖ శిబ్బంది :—

ప్రతిరాష్ట్రము కొన్ని సాస్త్రిక (శెషన్సు) మండలములుగా విభజింపబడినది. ఒకొక్క సపన్సులమునకు ఒక

టిగాని, అంతకన్న ఎక్కువగాని జిల్లాలుండును. ప్రతి మండలమునకు ఒక సాంప్రతిక న్యాయాధిపతియు గలడు. కొన్ని జిల్లాలకు అదనపు సాంప్రతిక న్యాయాధిపతులు (ఎడిషనల్ సెషన్సుజడ్జి) ఉండును. సహాయక సాంప్రతిక న్యాయాధిపతులుకూడ ఉండవచ్చును. సాంప్రతిక లేక అదనపు సాంప్రతిక న్యాయాధిపతులు ఏ శిక్షనయిన విధింపవచ్చును. మరణశిక్ష విధించినచో ఉన్నతన్యాయస్థానము ధ్రువపరచువరకు ఆ శిక్షను ప్రయోగింపరాదు. సహాయక సాంప్రతిక న్యాయాధిపతులు మరణశిక్ష, ఆమరణ కారాగారవాసశిక్ష, 10 సం॥ లకు మించిన కారాగారవాసశిక్షలు విధింపరాదు. ఇవిగాక ఇతరశిక్షలను విధించుటకు సమర్థులు.

ప్రతిజిల్లాలోను దణ్డనాధికారులుందురు. వీరిని ప్రథమ ద్వితీయ, తృతీయ వర్గీయులుగా విభజింతురు. వీరు జిల్లా దణ్డనాధికారి క్రిందివారుగా పనిచేయుచుందురు. జిల్లా దణ్డనాధికారి ప్రథమవర్గీయ దణ్డనాధికారి. అదనపు జిల్లాదణ్డనాధికారులుకూడ ఉండవచ్చును. జిల్లాలో ఉపవిభాగమున ప్రథమ లేక ద్వితీయ వర్గీయ దణ్డనాధికారి అధికారముతో ఉండును. ఇతనినే ఉపవిభాగ (సబ్ డివిజనల్) దణ్డనాధికారి యందురు. ఇతని ఉపవిభాగములోని ఇతర దణ్డనాధికారులు ఇతనికి అధీనాధికారులు.

వీరి దణ్డనాధికారములు క్రింద వివరింపబడినవి.

| | |
|---|---|
| I వర్గీయదణ్డనాధికారి | 2 సం॥ల కారావాసం ; 2000 వరకు జరిమానా. |
| II ,, ,, | 6 నెలలవరకు కారావాసము ; 500 వరకు జరిమానా. |

III ,, ,, 1 నెలవరకు కారావాసము
100 వరకు జరిమానా.

## 2. రక్షకభటుల శిబ్బంది పరిశోధనము

సంజ్ఞేయ అసంజ్ఞేయ అపరాధములు :-

సంజ్ఞేయాపరాధమనగా బన్ధీకరణాధిపత్రము లేకుండనే రక్షకభటాధికారి అపరాధిని బంధింపవచ్చును (ఉదా॥ లూటీ, హత్యవంటి నేరములు). అసంజ్ఞేయ అపరాధమనగా బన్ధీకరణపు అధిపత్రము ఉన్ననే అపరాధిని బంధింపవచ్చును. (ఉదా॥ మోసము; ద్వివివాహము; స్త్రీని చెఱచుట). బన్ధీకరణపు అధిపత్రమును న్యాయాధిపతి లిఖితపూర్వకముగా చేవ్రాలుతో కోర్టు మొహరుతో జారీచేయును. అధిపత్రమును అసలుజరుపు అధికారి దానిలోని సంగతులను దోషికి తెలియజేసి, అతడు కోరినచో అతనికి దానిని చూపవలెను.

### ప్రథమప్రాభియోగము

(ఎఫ్. ఐ. ఆర్-ఫస్టు ఇన్ఫర్మేషన్ రిపోర్టు):-

పోలీసు శాఖాధికారి ఒక పుస్తకములో తనకు నేరములనుగూర్చి వచ్చిన ఫిర్యాదులను, సూచనలను వ్రాయవలెను. ఈ ప్రతివేదనకే ప్రథమప్రాభియోగమని అందురు. దీనిని ఫిర్యాదుగాని, సూచనగాని యిచ్చినవ్యక్తికి చదివి వినిపింపవలెను. సంజ్ఞేయాపరాధమయిన, ఫిర్యాది (సూచకుని) చేవ్రాలు తీసికొనవలెను. అసంజ్ఞేయాపరాధమయిన ఫిర్యాదిని దండనాధికారియొద్ద పరివేదనచేసికొనుమని చెప్పవలెను. అట్టి అపరాధములను (I లేక IIవ వర్గీయ) దణ్డనాధికారిఅనుమతి లేకుండా పరిశోధింపరాదు. ప్రథమప్రాభియోగముయొక్క

ప్రతిని అధికారక్షేత్రమునుగల దర్యాప్తాధికారికిని, ఒక ప్రతిని మండల నిరీక్షకునిద్వారాగాని ఆనుషంగిక న్యాయాధిపతికి పంపవలెను.

పోలీసు పరిశోధన :-

ఎక్కడ నేరముచేయబడినదని ఫిర్యాదువచ్చునో అచ్చటికి పోలీసుఖానా అధికారిగాని, అతనిచే ఆదేశింపబడిన క్రిందిఅధికారిగాని పోవును. సాక్షులను విచారింపవచ్చును. ఆడువారిని, 15సం॥లు నిండని పురుషులను, వారి ఇండ్ల దగ్గరనే విచారింపవలెను. తనమీదికి నేరారోపణ తెప్పించు ప్రశ్నలను తప్ప తక్కినప్రశ్నలకు సమాధానములు చెప్పవలెను. పోలీసువారికి పరిశోధనలో చెప్పిన సంగతులను వ్రాసికొందురు. గాని, వానిని తెల్పినవాని సంతకముచేయనక్కరలేదు.

పోలీసుఅన్వేషణలు :-

అన్వేషణ అధిపత్రమును కోర్టువారు పరిశోధనకు అవసరమనితోచినచో జారీచేయుదురు. అన్వేషణను ఒక నిర్దిష్ట స్థలమునకు కట్టుబాటుచేయవచ్చును. అత్యావశ్యక సన్నివేశములలో పోలీసుఖానా అధికారిగాని, పరిశోధనకు నియమింపబడిన అధికారిగాని అన్వేషణాధిపత్రము లేకుండనే చర్య తీసికొనవచ్చును. అట్టిచర్యకుగల యావశ్యకత యేమిటో లిఖితముగా ఉంచుకోవలెను. పైగా అన్వేషణాస్థలము తన ఆధిపత్యమునకు సంబంధియగు పరిధిలోనిదిగా ఉండవలెను.

అపరాధాంగీకారము :-

అపరాధి తననేరమును ఒప్పుకొనదలచిన, దోషాంగీకారములను వ్రాయుఅధికారముగల 1వ లేక 2వ వర్గీయ దండనాధికారికి ఆ సంగతిని తెలియజేయవలెను. నేరపు అంగీకార

మును వ్రాసికొనుటకుముందు దణ్డనాధికారి అపరాధికి చెప్ప వలసిన సంగతులు: (1) నేరమును ఒప్పుకొనుట అతనికి విధి కాదనియు (2) నేరమును ఒప్పుకొనినచో తర్వాత దానిని సాక్ష్యముగా ఉపయోగింతురనియు. పైగా, ఆ నేరపు అంగీకారము పోలీసువారుగాని ఇతరాధికారులుగాని చూపిన భయమువల్ల, ఆశవల్లనుగాక, స్వేచ్ఛగా మనస్ఫూర్తిగా అపరాధి తన అపరాధమును అంగీకరించుచున్నట్లు నిర్ధారణచేసికొని దణ్డనాధికారి వ్రాసికొనుటకు పూనుకొనవలెను.

వ్యవహార దైనికము; సాధారణ దైనికము :-

పై అధికారులకు నివేదింపదగు ప్రాముఖ్యముగలవియు, తనచే సేకరింపబడినవియునగు సమాచారములను, తన దైనందినపు రాకపోకలను చూపుటకు ఒక సాధారణ దైనిక లేఖమును (డయరీని) పోలీసుఖానాధికారి యుంచుకొనును. వేరుగా వ్యవహారదైనిక లేఖము నొకదానిని వ్రాసికొనవలెను. దీనియందు ఏదేని నిర్దిష్ట దోషపరిశోధనలో ఫిర్యాదు అంది నప్పటినుండి పరిశోధన ముగియువఱకు తనచర్యలను వ్రాయవలెను. దణ్డన్యాయాలయములు ఆవశ్యకమైనచో ఈవ్యవహార దైనిక లేఖమును తెప్పించి చూడవచ్చును. ముద్దాయి దీనిని చూపుమనికోరవీలులేదు. మఱి పోలీసుఅధికారి జరిగినదానిని జ్ఞాపకముచేసికొను నిమిత్తము కోర్టులో ఈ కేసుడైరీని (వ్యవహారదైనందిన లేఖమును) చూచుకొనిన, ముద్దాయి తనకు కూడ చూపుమని (తన వకీలునకు చూపుమని కోరవచ్చును.)

దోషిని బంధించుట :-

దోషిని బంధించుటకు పోలీసులకు అధికారముకలదు. వలసినచో, ఇందుకొరకు బలప్రయోగమును చేయవచ్చును; ఇంటికవాటములను, ద్వారబంధములను విరుగగొట్టవచ్చును. జనానాలో దోషి దాగుకొనిన, అక్కడనున్న ఆడువారికి ముందుగా అక్కడినుండి తొలగుమని తెలియజేసి, తర్వాత ఆ ప్రదేశములోనికి చొరవచ్చును. బంధింపబడినవాని శరీరమును తణిఖీచేయవచ్చును. ఆడువారిని ఆడువారే తనిఖీచేయవలెను.

బందిలోనివారికిగల రక్షణలు :-

పోలీసువారు అధికారపత్రములేకుండనే బందిచేసిన, వానిని దణ్డనాధికారిదగ్గరకు వెంటనే తీసుకొనిపోవలసి యుండును. ఈ పనిచేయుటకు ప్రయాణమునకుపట్టు కాలముగాక 24 గంటలకన్న హెచ్చుకాలము పట్టరాదు. అంతకంటె హెచ్చుకాలము బందిలో ఉంచుటకు దణ్డనాధికారి అనుమతి కావలెను. దణ్డనాధికారికూడ 15రోజులకుమించి బందిగాఉంచుటకుఅనుమతింపరాదు. తగినకారణములనులిఖితపూర్వకముగా చూపవలెను. మూడవవర్గదణ్డనాధికారి (ప్రత్యేక అధికారము లొసంగబడినతప్ప) పోలీసువారు దోషిని తమ ఆధీనములో ఉంచుకొనుటకు అధికారమిచ్చు హక్కులేదు.

జామీను-కోరదగ్గ, జామీను-కోరదగని అపరాధములు:-

కొన్ని అపరాధములు జామీనుపై విడుదలచేయుటకు తగినవి. అనగా అపరాధి కోర్టులో కావలసినప్పుడు హాజరు పరచుటకు కొందరు హామీయిచ్చిన ఇట్టినేరములలో అతనిని

విడుదలచేయవచ్చును. ఈ హామీదారులు పోలీసుఅధికారి గాని,కోర్టువారుగాని నియమించిన మొత్తమునకు బన్ధపత్రము (బాండ్) ను వ్రాసియిస్తారు. అధిపత్రము లేకుండ జామీనుకుతగ్గ అపరాధమునకు బంధింపబడిన వ్యక్తికి జామీనుమీద విడుదలహక్కు గలదు. జామీనులేకుండనే కేవలము అతని బంధపత్రముమీదనే పోలీసుఅధికారిగాని, న్యాయస్థానముగాని విడుదలచేయునువచ్చును. జామీను కోరదగని అపరాధమునకు, వారంటులేకుండ బంధింపబడిన ముద్దాయి జామీనుమీద విడుదలగావచ్చును.అతడు మరణ శిక్ష లేక ఆమరణ కారావాసశిక్ష విధింపవలసిన నేరములు చేసినట్లు తగిన ఆధారములు కన్పించినచో, జామీనుమీద విడుదలచెయ్యరు. అటువంటి పరిస్థితులలో కూడ 16 సం్ళ నిండనివారిని, ఆడువారిని, రోగపీడితులను జామీనుపై కోర్టు వారు విడుదలచేయవచ్చును. జామీనుకోరదగని అపరాధ ములలో జామీనుమీద విడుదలనిచ్చినచో తగినకారణము లను విడుదలచేయు అధికారి లిఖితపూర్వకముగా నిర్దేశింప వలెను. జామీను అక్కరలేని అపరాధమును విచారణసల్పు దణ్డనాధికారి సాక్ష్యముతీసికొనుటకు నిర్దేశించిన తేదినుండి 60 రోజులలో విచారణను పూర్తిచేయనిచో, ముద్దాయి అంతకాలమునఅకు నిరోధములోనున్న అతనిని జామీనుపై విడుదలచేయవలెను. అట్లు చేయనిచో దణ్డనాధికారి తగు ఆధారములను వ్రాయవలెను. జామీనుఇచ్చినవాడు ఎప్పు డైనను దణ్డనాధికారికి తన బంధపత్రమును రద్దుచేయుమని ప్రార్థన పత్రికను దాఖలుచేయవచ్చును. అప్పుడు దండనాధి

అభియోక్తయో అభియోగచర్యలను నడుపునారు, అపరాధమును పరిశోధించిన అధికారి అభియోక్తగా నుందురు.

విచారణస్థానము :-

అపరాధము జరిగిన చోటు లేక హానిపరిణామములు ఫలించిన చోటు ఏ దండన్యాయాలయముయొక్క అధికారక్షేత్రములో కలదో, ఆ దండన్యాయాలయములోనే సాధారణముగా అభియోగచర్యలను జరుపుదురు. వీరయ్యను పీరయ్య సైదరాబాదులో గాయపరచగా మద్రాసులో చనిపోయెను. వీరయ్యను హత్యాదోషమునకు సైదరాబాదులోగాని, మద్రాసులోగాని విచారణసల్పవచ్చును. రైలుబండిలో ప్రయాణికుని సొమ్మును దొంగిలించిన ఎక్కడ అభియోగము తేవలెను? ఏ యే దండన్యాయాలయముల అధికారక్షేత్రముల గుండ అపరాధిగాని, నేరమునకు గురియైన ఆ స్త్రీగాని ప్రయాణము పోవునో, ఆ చోట్లు అన్నిటిలో అభియోగము తేవచ్చును.

ఆజ్ఞాపత్ర అభియోగము (వారంటు కేసు)
ఆహ్వానపు అభియోగము (సమ్మన్సు కేసు):-

వారంటు కేసు అనగా మరణశిక్షగాని, ఆమరణ కారావాసముగాని, ఒక సంవత్సరముపైన కారావాసముగాని శిక్షగాపడుటకు అవకాశముగల నేరము. వారంటు కేసుకానిది సమ్మన్సు కేసు.

సమ్మన్సు కేసు విచారణ :-

ఆరోపింపబడిన నేరము వివరణలు ముద్దాయికి తెలియచేయవలెను. దోషారోపణము యథావిధిగా చేయనవసరము

సాక్షులను ప్రతిపరీక్షణ, అభియోగము తెచ్చినవాడు పునః పరీక్షణ చేయవచ్చును. దండనాధికారి అవసరమైనచో ముద్దాయిని ప్రశ్నింపవచ్చును. ముద్దాయి, అభియోక్త కథనము లను వినవలెను. ఉపార్పణ చేయుటకు ఆధారములు లేనిచో ముద్దాయిని నిముక్తునిచేయవలెను. ఉపార్పణ చేయుటకు(ఆధారములున్న) అతనిపై నిశ్చిత దోషారోపణ బనాయింపవలెను. ఆ దోషారోపణప్రతిని ముద్దాయి కొసంగి,అతనికి స్పష్టముగా తెలియజేయవలెను. ప్రతివాదసాక్షులజాబితాను ఇమ్మని ముద్దాయిని కోరవలెను. దండనాధికారి ముద్దాయిని ఉపార్పణ చేయుటకు ఆధారములను వ్రాసి, దోషారోపణను, విమర్శను గూర్చిన నాజూర్మాలములను, నేరముచేయుట కుపయోగింపబడిన ఆయుధమును, సాంత్రికన్యాయస్థానమునకు పంపవలెను. ముద్దాయిని అధికారపత్రమువలన బందీగృహమున విచారణ అగువరకు చెరసాలలో ఉంచవలెను. జామీనుమీద విడుదలచేయుటకు వీలయిన అట్లు చేయవచ్చును.

పోలీసురిపోర్టు లేకుండ చర్యతీసికొనబడిన, ప్రత్యక్షముగా చూచిన సాక్షులనేకాక, అభియోక్త తెచ్చిన యితర సాక్షులనుగూడ పరీక్షింపవలెను. ప్రతివాదసాక్షులనుగూడ పరీక్షించినపిదప ముద్దాయిని విముక్తునిచేయుటో ఉపార్పణ చేయుటో నిర్ధారణచేయవలెను.

అనుమోదకుని సాక్ష్యము :—

సాంత్రికన్యాయస్థానమేవిచారింపవలసిన కేసులలోను, 7 సం॥లవరకు కారాగారవాసశిక్షవిధించుటకు అవకాశము గల కేసులలోను, జిల్లాదండనాధికారి, అనువిభాగీయదండనాధి

దిగా ఉండవలసిన తోచినను, న్యాయసభ్యులు లేనంత సాంత్రిక న్యాయాధిపతి యే విచారింపవలసి విని యోగింపవచ్చును.

న్యాయసభాసదులు :-

న్యాయసదస్యులు 7 గురికి తగ్గకుండ, 9 మందికి మించకుండ ఉండవలెను. సాధారణముగా తీవ్రమైన నేరములలో వీలయిన 9 మంది యుండవలెను. ఈ సదస్యవరణములో ముద్దాయికి కాని, అభియోక్తకు కాని సదస్యునికి సాక్ష్యమిచ్చు భాష రాదని కాని, పక్షపాతబుద్ధిగలవని కాని తోచిన, ఆ సదస్యుని విచారణలో పాల్గొనరాదని ఆక్షేపణ తెల్పవచ్చును. ఎంచుకొనబడిన సదస్యులు తమలో ఒకరిని అగ్రణిగా ఏర్పరచుకొందురు. దోషనిర్ణయములో సదస్యుల అభిప్రాయమును ఈ అగ్రణి ద్వారా కోర్టుకు తెలుపబడును. సదస్యులు విషయముల అస్తిత్వమును గూర్చి విమర్శింతురు. న్యాయసూత్రములనిచ్చుటకు న్యాయమూర్తియే. సాంత్రికాధికారి సదస్యుల అభిప్రాయముతో ఏకీభవింపక పోయిన, న్యాయము చేకూర్చుటకు ఆవశ్యకమని తోచిన ఉన్నత న్యాయస్థానమునకు అర్పణ చేయవలెను. అప్పుడు ఉన్నతన్యాయస్థానములో సాక్ష్యమును పరిశీలించి నిర్ణయము చేయుదురు.

అర్పణ చేయబడిన విచారణలు:-(రిఫర్డు ట్రయలుస్)

సాంత్రిక న్యాయాధిపతి ఉరిశిక్ష వేసిన, ఉన్నతన్యాయస్థానము ధ్రువపరచువరకు శిక్షను నెరవేర్చరాదు. ఉన్నత న్యాయస్థానము అటువంటి కేసులలో ఆవశ్యకమైనచో సాంత్రిక న్యాయాధిపతిని ఇంకను విమర్శింపుమని కాని, పునర్విచారణ చేయుమని కాని, ఆదేశింపవచ్చును. లేక ముద్దాయిని నిర్దోషి

అని తీర్పు చెప్పవచ్చును. లేక శిక్షను వాయిదావేయవచ్చును; లేక వేరుగా శిక్షవేయవచ్చును. ఈ అన్ని పైచెప్పబడిన విచారణలలో ఇద్దఱికి తగిన న్యాయాధికారివద్దకు అప్పీలు చేసుకొనవచ్చును.

## 5. వారంటుకేసుల విచారణ

### మండలాధిపతియొద్ద వారంటుకేసు విచారణ

(1) పోలీసురిపోర్టుమీద విచారణ ప్రారంభమగును :–

మండలాధిపతి ముద్దాయికి 173 సెక్షనుక్రింద ఇవ్వవలసిన పత్రములు ఇవ్వబడినట్లు రూఢిచేసికొనవలెను. ఈ పత్రములను పరిశీలించి, అవసరమగునచో ముద్దాయిని పరీక్షించి, ముద్దాయి అభియోక్త చెప్పుకొనునది విని, నేరారోపణ సహేతుకమా నిర్హేతుకమా అని ఆలోచింపవలెను. నిర్హేతుకమైనచో ముద్దాయిని నేరారోపణవిముక్తునిగా నిర్ణయించి విడుదలచేయవలెను. సహేతుకమైనచో నేరారోపణ చేయవలెను. ముద్దాయి అపరాధమునంగీకరింపనిచో సాక్ష్యము తీసుకొనుటకు తేదిని సూచింపవలెను. మొదట అభియోక్త తెచ్చిన సాక్ష్యమును వ్రాసికొన్నతర్వాత ప్రతిసాక్ష్యమును విచారించి మండలాధిపతి ఆ సాక్ష్యముపై తననిర్ణయమును తెలియజేయవలెను.

(2) ఇతరవిధముగా ప్రారంభమైన :–

పోలీసురిపోర్టు లేకుండ చర్యలు ప్రారంభమైనచో, అభియోక్తను పరీక్షించి, అతనితరపు సాక్ష్యమును విచారింపవలెను. ముద్దాయి నిర్దోషిఅని తేలిన అతనికి విమోచన మొసంగవలెను. లేనియెడల నేరారోపణచేయవలెను. అపరాధమును ముద్దాయి అంగీకరించిన అతనికి శిక్షవిధింప

నచ్చును. లేనియెడల, అభియోక్తతనపును విచారింపబడిన సాక్షులను ప్రతిపరీక్షచేయుటకు ముద్దాయికి అవకాశ మొసగి, ప్రతివాదసాక్ష్యమును విన్నమీదట దండనాధికారి తననిర్ణయమును తెలియజేయవలెను.

6. పై న్యాయస్థానములలో పునర్విచారణ (అప్పీలు)

దోషవిమోచన నిర్ణయముపై :—

ముద్దాయిని నిర్దోషియని నిర్ణయింపబడిన, సర్కారీ అభియోక్త ఉన్నతన్యాయాలయమునకు అప్పీలుచేయవచ్చును ఇతరఅభియోక్త ఉన్నత న్యాయాలయమునుండి అనుమతి లేనిదే అప్పీలుచేయరాదు. నిర్దోషియని తీర్మానింపబడిన 60 రోజులలోగా అప్పీలునకు అనుమతి కోరవలెను. అప్పీలుకు అనుమతి నిరాకరింపబడిన తర్వాత సర్కారీ అభియోక్తకూడ ఆ కేసులో అప్పీలు వేయుటకు వీలులేదు.

దోషిఅను నిర్ణయముపై :—

| దోషమును నిర్ణయించినకోర్టు | అప్పీలు చేయవలసిన కోర్టు | నియమములు |
|---|---|---|
| (1) సహాయక సాంత్రికాధికారి (లేక ప్రత్యేక అధికారము పొందిన దణ్డనాధికారి) | (1) సాంత్రికన్యాయాలయము [సెషన్సుకోర్టు] (2) ఉన్నతన్యాయస్థానం [హైకోర్టు] | 4సంవత్సరముల కారాగారవాసమునకు మించిన శిక్ష. |
| (2) జిల్లాదణ్డనాధికారి (లేక ఇతర దణ్డనాధికారి) | (1) సాంత్రికన్యాయాలయము (2) ఉన్నతన్యాయస్థానం | రాజ్యద్రోహపు నేరమయిన |
| (3) సాంత్రికన్యాయాధిపతి (లేక ప్రతిసాంత్రికన్యాయాధిపతి) | ఉన్నతన్యాయస్థానము | |

## నేరముల

| | నేరము | బందిచేయుటకు వారంటుకావలెనా అక్కఱలేదా | వారంటునా సమ్మన్సునా మొదట ప్రయోగింపవలసినది | జామీను - యో... మా అయోగ... |
|---|---|---|---|---|
| 1. | హత్య | అక్కఱలేదు | వారంటు | జామీను అయోగ్య... |
| 2. | గాయపఱచుట | కావలెను | సమ్మన్సు | జామీను - యోగ్యము |
| 3. | సదోషనియంత్రణ | అక్కఱలేదు | సమ్మన్సు | ,, |
| 4. | మానవాపహరణ | ,, | వారంటు | ,, |
| 5. | స్త్రీ సంగ్రహణము (చెఱచుట) | ,, | ,, | జామీను అయోగ్య... |
| 6. | చోరీ | | | |
| 7. | లూటీ | అక్కఱలేదు | వారంటు | అయోగ్య... |